# తొలి పలుకు

నేను అప్పుడప్పుడు ప్రసారముచేసిన రేడియో ప్రసంగములు, వ్రాసిన వ్యాసములు వివిధవిషయములకు జెందియున్నవి. వానిలో కొన్నిటిని సంపుటీకరించి ఈగ్రంథమును ప్రకటించితిని.

వీనిలో కొన్నింటిని అక్కడక్కడ అవసరమగుచోట్ల సరిదిద్దితిని, విపులీకరించితిని. కొన్ని వ్యాసములను క్రొత్తగా వ్రాసి చేర్చితిని.

ప్రసంగములను ప్రకటించుకొనుటకు అంగీకరించిన మద్రాసు విజయవాడ రేడియో అధికారులకును, వ్యాసములను పునర్ముద్రణ మొనర్చి చేర్చుకొనుట కంగీకరించిన ప్రథమ ప్రచురణ కర్తలకును కృతజ్ఞుడను.

విఘ్నేశ్వరుడను వ్యాసములో శ్రీ వావిలాల సోమయాజులుగారు వ్రాసిన 'గణపతి' యను వ్యాసమునుండి ఒకటి రెండు విషయములను గ్రహించితిని. అందులకు వారికి కృతజ్ఞుడను.

నావ్రాతలోని భాషావిషయమును సరిదిద్ది, ప్రూఫులనుశద్ధి శోధికను తయారుచేసి తోడ్పడిన శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి గారికి నాహృదయపూర్వక వందనములు.

అట్టపై డిజైను వ్రాసియిచ్చిన శ్రీ బి. వెంకటేశ్వరరావు గారికి నాధన్యవాదములు.

ఈవ్యాస సంపుటి ఆంధ్రమహాజనుల యాదరమును బొందగలదని ఆశించుచున్నాను.

గుంటూరు
దుర్ముఖి జేష్ఠపూర్ణిమ
23 – 6 – 56

విస్సా అప్పారావు

# విషయసూచిక

తొలిపలుకు

| | | |
|---|---|---|
| * 1 | సత్యాన్వేషణ | 1 |
| * 2 | శక్తిలేని మంచితనము కావలెనా ? | 9 |
| * 3 | మంచిపౌరునిగా తయారుచేయుట | 17 |
| * 4 | రేడారు | 24 |
| 5 | విశ్వము నిర్మాణమై ఎంతకాలమైనది ? | 29 |
| 6 | పంచాంగ సంస్కరణము | 43 |
| * 7 | ఉన్నతవిద్యా లక్ష్యము | 64 |
| 8 | రామన్ ఇఫెక్టు | 72 |
| 9 | విశ్వశిల్పము | 87 |
| * 10 | క్షేత్రయ్య | 100 |
| * 11 | త్యాగరాజస్వామి | 112 |
| 12 | త్యాగరాజుని ఆధ్యాత్మికసందేశము | 121 |
| 13 | ఆంధ్రుల నాట్యకళ — కూచిపూడికళావైభవము | 131 |
| * 14 | మార్గ — దేశి సంగీతములు (Classical and Popular Music) | 147 |
| 15 | నాట్యకళ — దానిపరమార్థము | 160 |
| 16 | పాండవాజ్ఞాతవాస వత్సరవ్యాప్తి నిర్ణయము | 177 |
| 17 | పరిణామవాదము | 186 |
| 18 | విఘ్నేశ్వరుడు | 197 |
| 19 | నాడీగ్రంథములు | 216 |


* రేడియో ప్రసంగములు

# I

## సత్యాన్వేషణ

" ఏకంసత్ విప్రాబహుధావదంతి, " అని వేదముచెప్పు చున్నది. వ్యావహారికము, శాస్త్రీయము, ఆధ్యాత్మికము, అని సత్యమును మూడురీతుల మనము చెప్పవచ్చును

వ్యావహారిక సత్యము :— ఉన్నదిఉన్నట్టు, కన్నది కన్నట్టు, విన్నది విన్నట్టు చెప్పుట సత్యమనుచున్నాము. ఇట్టి సత్య వ్యవహారములో ప్రవర్తించుట చాల దుర్ఘటము బలిచక్రవర్తి, హరిశ్చంద్రుడు మొదలగువారి గాథ లీవిషయమునే బోధించుచున్నవి. ఎంతకష్టమైనను సత్యానుసరణమే శ్రేయోదాయకమని మనమెరిగిన విషయమే. సత్యంవద, ధర్మంచర, అహింసా పరమోధర్మః అని ఆర్యులు చెప్పుదురు. అందుచేత జీవకోటికి మేలు కలిగించునట్టి భూతహితమగు కల్లమాటకూడ సత్యమే అని పెద్దలు చెప్పుదురు. ధర్మవిరుద్ధము కాకుండ సత్యముగా ప్రవర్తింప ప్రయత్నించుట అవశ్యకర్తవ్యము. అది పూర్తిగా నెరవేరుట దుర్లభము. అది ఎంతవరకు సాగిన అంత శ్రేయము, ఎంతవరకు నెరవేరకుండిన అంతక్లేశము, కలుగును. కనుక ఎడతెగకుండ ఈప్రయత్నమును మనము చేయుచునే యుండవలెను.

శాస్త్రీయ సత్యము :— భూమి బల్లపరుపుగా ఉన్నది, సూర్యుడు భూమిచుట్టును తిరుగుచున్నాడు, అనునవి వ్యవహార

సత్యములు. వ్యవహారమందు వీనివలన ఏబాధయు లేదు. కాని విమర్శించిచూచినచో అవి సంపూర్ణ సత్యములు కావని తేలును. ఇట్టి విమర్శయే శాస్త్రము. శాస్త్రములు పలువిధములు. అందు ముఖ్యమైన వానిలో పదార్థవిజ్ఞానశాస్త్రము ఒకటి. అది, ఇంద్రియ గోచరమగు ప్రపంచముయొక్క స్వరూప మెట్టిదని విమర్శించు చుండును. ప్రకృతిలోని యనేకములగు దృశ్యములను పరిశీలించి వాని కారణములను వెదకి, పరస్పర సంబంధములను గుర్తించి, కొన్ని ఊహలను చేసి, వానిని ప్రయోగముల మూలమున పరిశీలించుకొని తేలిన పర్యవసానములను సిద్ధాంతములుగాను, సూత్రములుగాను గ్రహించు చుండును. కాలక్రమమున క్రొత్తవిషయములు లభించినప్పుడు వెనుకటి సూత్రములను పునర్విమర్శన చేసి అవసరమైనచో సూత్రములను, సిద్ధాంతములను మార్చుకొనుచు నిరంతరము జ్ఞానమును వృద్ధిపరచుచు సత్యాన్వేషణము చేయబడుచుండును. ఇటీవల 20, 30. సంవత్సరముల నుండి జరిగిన పరిశోధనలవలన అప్పటికి సత్యము లను కొన్న మూలసూత్రములలోనే క్రమముగా గొప్ప మార్పు కలిగినది. ఈమార్పును గురించి కొంచెము తెలిసికొనుట యవశ్యము.

దేశము (Space) కాలము (Time) ద్రవ్యము (Matter) శక్తి (Energy) అని ఈశాస్త్రములో నాలుగు మూల విషయము లున్నవి. 20, 30. సంవత్సరముల క్రిందటివరకు వీనికి పరస్పర సంబంధ మున్నట్టు తెలియలేదు. దానివలన ఏబాధయు గోచరించలేదు. ఈముప్పదేండ్లలో కనిపెట్టిన నూతనాంశముల

వలన దేశకాలములు అవినాభావములు, అవి ఏకవస్తువుయొక్క వికారములు, ఆవస్తువును దేశ - కాలమని గాని, కాల - దేశ మనిగాని, కంటిన్యూమ్ అనిగాని, అనవచ్చును అని సిద్ధాంతము చేయవలసి వచ్చినది. మరియు ద్రవ్యమునకును శక్తికిని భేదము లేదు, అవి రెండును ద్రవ్య-శక్తి లేక శక్తి-ద్రవ్యము అను ఏకవస్తువు యొక్క వికారములు, ద్రవ్యము నశించి శక్తి పుట్టు చున్నది, శక్తి మాయమై ద్రవ్యముక్రింద మారుచున్నది అని సిద్ధాంతీకరింపవలసి వచ్చినది. ఇదంతయు ఎంతో వింతగా తోచు నిర్ణయ మనుటకు సందేహము లేదు. మరొక విశేషాంశము కలదు. ఈశాస్త్రములో కార్యకారణ రూపమగు హేతువాదముచేత దృశ్యము లన్నింటికిని ఉపపత్తి నేర్పరచుకొను చున్నాము. ఆకాశ మందలి గ్రహములయొక్క గతులనుబట్టి అవి ఎప్పుడేస్థితిలో ఉండునో లెక్కింప గలుగుచున్నాము. అట్టి గతిశాస్త్రానుసార మైన లెక్కలు ప్రత్యక్షనిదర్శనములుగా ఉన్నవి. కాని, ఈ గతిశాస్త్ర సిద్ధాంతములు సూక్ష్మములు సూక్ష్మాతి సూక్ష్మములు అగు పరమాణువుల యొక్క సూక్ష్మాణువుల యొక్క స్థితిగతుల కన్వయించుటలేదు. స్థూలవస్తు ప్రపంచమునందేగాని అనగా పెద్ద ద్రవ్యఖండములకు సంబంధించినప్పుడు గాని సూక్ష్మవస్తు ప్రపంచ మునందు ఆ గతిశాస్త్రము వర్తించుటలేదు. ఏల ఈ వ్యత్యాసము అని ఆలోచింపగా తేలిన పర్యవసానములు ఏమనిన- సూక్ష్మపదా ర్థములు ద్రవ్యమువలెను శక్తి వలెనుకూడ ప్రవర్తించుస్వభా వము కలవి. అందుచేత వీని కార్యకలాపమునకు, నూతన చర్య లకు, చేష్టలకు, ఆశాస్త్ర మన్వయించుటలేదు. ఆప్రాత మాటల

వలన ఈ క్రొత్త సత్యము నిర్వచింపబడుట లేదు: మరియు సనాతనములగు దేశ-కాలము, ద్రవ్య-శక్తి అనువాని యొక్క స్వరూపస్వభావములు మనస్సునకు, మాటలకు అందక అవ్యక్తముగా ఉన్నవి. సూక్ష్మ ప్రకృతియొక్క నిర్మాణపథకము ఎరుకకందని పద్ధతి ననుసరించు చున్నదేమో యనిపించుచున్నది.

మరియు, పదార్థ విజ్ఞానశాస్త్రము జడపదార్థముల గురించి నశాస్త్రము. అందలి సిద్ధాంతములనే జీవశాస్త్రమందు కూడ అన్వయించ జూచుచున్నాము. ఇది అసందర్భము కాదా? దీని వలన సత్యము తేలునా? జీవించియున్నదాని తత్త్వము దానిం జంపి పరీక్షించుటచేత వ్యక్తమగునా? అందుచేత జీవశాస్త్రము యొక్క సత్యము పదార్థ విజ్ఞాన శాస్త్రపద్ధతిని తేలునా? క్రొత్త మార్గములనుబట్టుట అవసరమేమో.

శాస్త్రముయొక్క కట్టుదాళ్లకు లోబడని సూక్ష్మాణువుల చేష్ట లను విమర్శింతము. సూక్ష్మదర్శిని ద్వారా పరమాణువులను వెలు తురు సహాయముతో స్థలవిశేషమునకై చూచినపుడు ఆవెలుతురు అణుస్వరూపము గాన కాంతికణముల తాకుడువలన-అనగా చూచుట అను క్రియవలన—మనము చూచే సూక్ష్మాణువులు చెదరి పూర్వ స్థితిని కోల్పోవును. కనుక దేనిని గుర్తింపవలె ననుకొనుచు న్నామో దానిని గుర్తింపలేక పోవుచున్నాము. కంటియొక్క చూపు బాహ్యమైన, స్థూలమైన చూపు — అట్టిబాహ్యమగు చూపు చేత పరమాణువుల స్థితులు మారుచున్నవి. కనుక సూక్ష్మదృష్టిని మనలోపలికి త్రిప్పి కేంద్రీకరించినచో అట్టి అంతర్దృష్టివలన మన

ఆంతర్యము, మనస్సుయొక్క స్థితి మార్పుచెందునేమో: అప్పుడు గోచరించే విషయములు—సత్యము ఏల భిన్నముగా ఉండకూడదు? ఈరీతి నాలోచించగా మన స్తత్త్వము గురించి క్రొ త్తవిషయములు తెలిసికో వచ్చునేమోయని అనిపించుచున్నది. ఇది నేటి శాస్త్ర వేత్తలలో కొందరి మతము. భౌతికశాస్త్ర మార్గానుసారముగా సత్యాన్వేషణ ప్రారంభించి పోగాపోగా ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీని నతిక్రమించిన సత్యమొకటి తెలియగల దేమో యని తోచుచున్నది. ఇంతకు పర్యవసాన మేమనగా సత్యాన్వే షణ సంపూర్ణముగా జరుపుటకు భౌతికశాస్త్రముల మార్గము వాలదేమో అని.

ఆ ధ్యా త్మి క స త్య ము :— సత్యమైన జ్ఞానము సుఖమును శాంతిని ఆనందమును కలిగించవలెను. నేడు ప్రపంచ మనుభవించు చున్న దుఃఖము, అశాంతి దుర్భరములుగా ఉన్నవి. అందుచేత శాస్త్రజ్ఞానముతో పెచ్చు పెరిగిపోయిన ఈనాగరకత సత్యమును గ్రహించిన దనుటెట్లు? స్వార్థపరత్వము తాండవించుచున్నది. త్యాగము, సహకారము అడుగంటి పోవుచున్నవి. నేడు మానవ స్వభావ మేలాగున నున్నదనగా అజ్ఞానయుతమగు జ్ఞానము, మొరటుతనమైన గొప్పతనము, సందేహపూరితమగు ఉత్సాహము, దైవాంశతో కూడిన పశుత్వము, ఆత్మప్రబోధమునకు విషయ వాంఛలకు మధ్య అల్లాడు అవివేకము, నశించు దేహము, తప్పు దారినిబట్టు హేతువాదమువంటి ద్వంద్వములచే సంకులమైన పెద్ద ముద్దవలె ఉన్నది. కాని పూర్ణసత్యమును గ్రహించుటకు సమ

ష్టుడు మానవుడే. సందేహములేదు. నిరవధికానందప్రదమైనది, నిగూఢమైనది, అఖండ మహిమకలది ఈబ్రహ్మాండ మంతలోను మానవస్వభావ మొకటే. ఆస్వభావము యొక్క సత్యమును తెలిసికొనుట తన్నుతాను తెలిసికొనుటయే. దానినే ఆత్మజ్ఞానము, బ్రహ్మజ్ఞానము అందురు. ఐతే అట్టిది సాధ్యమా? మనకట్టి శక్తి గలదా? అని సందేహము గలుగవచ్చును ఈసంశయము పోవుటకు కొన్ని సంగతు లుదహరింపవచ్చును. జ్యోతిషము, సాముద్రికము, తేలు-పాముమంత్రములు, మహాద్రావక మహావిషభక్షణము, నేలలో పూడ్చిపెట్టినను కొన్ని గంటలు సజీవులై యుండుటయు, రక్తనాడిని, హృదయమును ఇష్టానుసారము స్తంభింపజేయుటయు అనుభవములో కలవు; వీనిని హేతువాదముచేత సమర్థించగలమా? సైకొఅనాలిసిస్సు అను మన స్తత్త్వ జ్ఞానము చేత, హిప్నాటిజమను మైమఱపు స్థితి సహాయమున, మనోజములగు వ్యాధులు, పీడలు కుదుర్చుచున్నారు. మనోగతములగు వ్యాధులనే కాక దేహగతములగు వ్యాధులనుకూడ ప్రార్థనవలన కుదుర్చుచున్నారు. ఈవిషయము గురించి నాకు అనుభవము కొంత గలదు. మరియు కొన్నేండ్ల క్రిందట తిరుపతిలో ఒక సామియారుగారితో నాకు చాల పరిచయము కలిగినది. ఆయన మన మనుకొనిన ఎవరినిగురించి యైనను, పూసగ్రుచ్చినట్లు వారి భూత, భవిష్యద్వర్తమానముల గురించి అద్భుతముగ చెప్పుచుండువాడు, కొందరి స్నేహితులకు వారిగురించిన విషయములు వ్రాసి వేసి పంపియున్నాను. ఇదంతయు ఎట్లు చెప్పుచున్నారని ప్రశ్నించగా కంటికి కనిపించునని, 'అమ్మ' చెప్పుచున్నదని, 'రామర్'

చెప్పుచున్నాడని అనుచుండువారు. అందుచేత హేతువును మీరిన సంగతులు కలవు. సందేహించరాదు.

మనస్సుయొక్క, ఆత్మయొక్క మహత్త్వవలన వింత వింత అనుభవములు కార్యములు జరుగ వీలులేదనుకొనరాదు. శీలము ప్రధానముగాని శాస్త్రము కాదు. ఆత్మ శక్తియే శక్తి. అది మనస్సును స్వాధీనము చేసికొనినగాని లభింపదు. సందేహములేదు. “మనసు స్వాధీనమైన యా ఘనులకు, మరి మంత్ర, తంత్రమేల” యని శ్రీత్యాగరాజస్వామివారు పాడిరి. వ్యవహారమునకు, శాస్త్రమునకు పరమై, నిత్యమై, పూర్ణమై పరమపవిత్రమై, స్వయంప్రకాశమైన పారమార్థిక సత్యమును మనస్సు స్వాధీనము చేసికొనినచో తెలియగలమని, అట్టి ఆత్మ జ్ఞానము సాధనవలన, అభ్యాసమువలన బడయగలమని పెద్దలు చెప్పుదురు. ఈమార్గమును బట్టువాఁ ఒక శిక్షణను, ఒక క్రమమును, ఒక నియమమును, పాటించవలెను. నేనీ పరమార్థమును పొందవలెను అను ఆర్తి సాధకునకు కలుగవలెను. ఇదియే ప్రథమ లక్షణము, యోగ్యత. ఈసాధనకు సాంఖ్యయోగము, తారక యోగము, జ్ఞానయోగము అవి ముఖ్యముగ మూడు మార్గములు. అందు జ్ఞానయోగ ముత్తమము. దీనినే అమనస్కయోగమని, రాజయోగ మని యందురు. దీనివలన పరమసత్యమైన ఆత్మ స్వరూపము, బ్రహ్మజ్ఞానము కలుగును. పిపీలికాది బ్రహ్మ పర్యంతము సర్వకాల, సర్వావస్థలయందు ఒకేవిధముగా ఆత్మ స్వరూపము వ్యాపించియుండును. అది యిట్టిదని నిర్వచించుటకు

పించులేదు. అవాఙ్మానసగోచరము. అనుభవైక వేద్యము. ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు అను ప్రస్థానత్రయము ఈబ్రహ్మ పదార్థము గురించియే చెప్పుచున్నవి.

సర్వేంద్రియములతో సర్వ విషయముల ననుభవించుచున్నను, బ్రహ్మజ్ఞాని సచ్చిదానందరూపమగు ఆత్మనిష్ఠలో నుండగలడు. అతడే స్థితప్రజ్ఞుడు. నిర్వికల్పసమాధి నిష్ఠుడై, పరిపూర్ణ బ్రహ్మ చైతన్యమాత్రుడై, అతడుండగలడు. రామకృష్ణపరమహంసస్వామి ఇట్టి నిర్వికల్పసమాధి స్థితిని పెక్కుసార్లు పొందుచుండెను. అట్టి మహాపురుషులు పరిపూర్ణచిత్త నిగ్రహము గలిగి, మితవాక్కులుగల వారై, సర్వభూతహితము కోరుచు దయామయులై, సర్వజనచిత్తముల నాకర్షించుచుందురు. అట్టి వారివయ సర్వ శ్రేయస్సుల నిచ్చి, సర్వకార్యసిద్ధి కలిగించగలదు. అట్టి వారి యుపదేశభాగ్యముచేత సాధకునికి శీఘ్రముగా ఫల ప్రాప్తి కలుగును.

ఆత్మవిచారము చేయు సాధకునికి, జ్ఞానోదయ మైన కొన్ని జన్మల తరువాతగాని పూర్ణ ప్రజ్ఞ, "తత్త్వమసి" యనగలుగు బ్రహ్మైక్యము కలుగదు. గతించిన జన్మయందు చేసిన సాధనఫలముగా వృద్ధిపొందు నధికారమును పురస్కరించుకొని, అనగా పూర్వజన్మ సంస్కారమును బట్టి, ఈజన్మయందు ఫలప్రాప్తి కలుగుచుండును. ఇట్లు పెరిగి పెరిగి పూర్ణ పరిణామము కలిగి, పుట్టుకచావులేని, నాశములేని నిత్యమగు జీవన్ముక్తి కలుగును. అప్పుడే ఆధ్యాత్మిక సత్యమును పూర్ణ

ముగా గ్రహించగలుగుట తటస్థించును. ఇందుచేతనే సత్యాన్వేషణ తీరని అన్వేషణ అని చెప్పవలసి యున్నది

ఇట్టి సాధకులగు సజ్జనులయొక్క సాంగత్యముచేత లోకమందు ధర్మము పెరుగగలదు. లోకులు శీలవంతులు కాగలరు. అట్టి స్థితి సర్వవాంఛనీయముగదా ! మరియు నది సర్వసుఖప్రదమును సర్వశాంతికరమును. అట్టి స్థితికి లోకము త్వరలో ఉన్ముఖమగుగాక !.

" అసతోమాసద్గమయ. తమసోమా జ్యోతిర్గమయ. మృత్యోర్మా అమృతంగమయ. " "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ".

## శక్తిలేని మంచితనము - కావలెనా ?

మంచితనము ప్రయోజనకారి, లాభకారి కానియప్పుడు, అట్టి మంచితనము కావలెనా ? మంచితనమును కార్యముగా మార్చు శక్తి లేనప్పుడు అట్టి మంచితనమును అవలంబించవలెనా ? అనునది ప్రశ్న. దీనికి సమాధానము నీయవలెను. అందులకై మంచితనమనంటే యేమిటో నిర్వచనము చేయుదము. నీతిగాను, న్యాయముగాను, ధర్మముగాను వర్తించుటను, శీలవర్తనము కలిగియుండుటను, మంచిగా ఉండుట అందుము. దయాదాక్షిణ్యములు కలిగి యుండుట కూడ మంచితనమే. వీడు మంచి పనివాడు అన్నప్పుడు మంచి అంటే కార్యసామర్థ్యము అని అర్థము. ఋజువైనవి, చేయదగినవి, నిష్పక్షపాతమైనవి — మంచిలోనివే.

ఈమంచితనము దేశకాలపాత్రలవలన, జాతిమతభేదములవలన, మనోవృత్తుల తారతమ్యమువలన మారదు. అది సర్వత్ర మానవ స్వభావములో సహజమై గోచరించుచుండును. ఇది మంచి, ఇది చెడ్డ అని అంతరాత్మ అందరకు ఏకరీతిగానే బోధించుచుండును. ఈబోధ మతబోధల కతీతమైనది, స్వయంభువు, శుద్ధమైనది; సర్వదయామయ మైనది; స్వార్థ చింత లేనిది; త్యాగమే దీని ముఖ్య లక్షణము. ఋషులు, ధీరులు, మార్గదర్శకులు, దేశభక్తులు, విజ్ఞానవేత్తలు, మహాత్యాగులు కీశాపసులు, సత్యముకొఱకు, జ్ఞానముకొఱకు, ఇతరుల లాభముకొఱకు ఎన్నిబాధలకైనను వెనుదీయక అవసరమైనచో ప్రాణములను గూడ అర్పింతురు.

అట్టి మంచివారు లోకమం దెంతమంది ఉన్నారు? ఉన్నట్లయిన యింక లోకములో లోపేమిటి? నిజమే. అట్టివారు చాలమంది లేరు. మొత్తముమీద చూచిన ఈప్రపంచము చెడ్డదే యని చెప్పవలెను. పాపభూయిష్ఠమై, కీడునే తలచుచు, స్వార్థమునే కోరుచు ఉన్నది. అందులో ఈనలుబది సంవత్సరములలోను జరిగిన రెండు మహా సంగ్రామములు కారణముగా, రాజకీయముగాను సాంఘికముగాను ప్రపంచము మఱియు చెడిపోయినది. ఈదుస్థితిని మార్చి మంచిదారికి దానిని మరల్చవలసిన అవసరము ఎక్కువగా ఉన్నది. ఇది యెట్లు జరుగుట? మంచితనము బాగుగ ప్రబలవలెను. మంచివారెందరో బయలుదేరవలెను. వారు మంచికై తీవ్రముగా ప్రయత్నింపవలెను. మానవ హృదయము ప్రేమమయము కావలెను.

ఇట్లు చేయుటవలన లాభముగాని, సుఖముగాని వారికి ఉండునా ? సందేహమే. మంచితనము పెరిగినకొలది త్యాగికి బాధయే హెచ్చుచుండును. తనచుట్టు నున్న మానవులు పశు కష్టములను గుర్తించుచుండుటచేత మంచివానికి లోలోపల దుఃఖమేగాని సుఖ ముండనేరదు. బుద్ధుని చరిత్ర ఒక గొప్ప తార్కాణము. మంచివారిలో ఓర్పు, ప్రేమ, సత్యము, నిండి యుండును. శక్తివంచన లేకుండ ఇతరులకు మేలును చేయుటకే వారు ప్రయత్నించుచుందురు. అదే వారి నిరంతర సాధన. దాని వలన వారి మంచితనము, శీలము పెరుగుచుండును. ఇతరులకు మేలుచేయగల శక్తి పెరుగుచుండును. ఇతరులు తమకు కీడు చేసినను పాటించరు. తిరిగి వారికి మేలే చేయుదురు. అది వారి స్వభావము. ఇతరము వారు సంకల్పించలేరు, వచించలేరు, చేయ లేరు. త్రికరణశుద్ధిగా వారు మంచివారే.

ఇట్లు అగుటకు పూర్వము, నేటి ప్రపంచమందు చెలరేగు చున్న రాజ్యాంగమందలి మూలసూత్రములు తారుమారు కావలెను. వ్యక్తి లేమయినను సరే. నశించినను సరే దేశమునకు, జాతికి లాభము కలిగినట్లయిన అట్టి పనులు సాగించవచ్చును, అనే ధోరణి పూర్తిగా నశించవలెను. ఏమనిన, ప్రతిమానవుని జీవిత మునుపవిత్రమైనదే, కాపాడదగినదే, వృద్ధిపొందదగినదే. అదే దేశక్షేమమునకు ఆధారము. ప్రతివ్యక్తికిని క్షేమము లేనిదే దేశ మంతటికిని క్షేమమురాదు, అను అభిప్రాయము ప్రబలవలెను. రాజ్యాంగములో జరుపు సంస్కారములవలన, పునర్నిర్మాణము వలన, వ్యక్తి స్వాతంత్ర్యమునకు గాని, వ్యక్తులకుగాని యేవిధ

మయిన బాధయు కలుగకూడదు. ప్రజలందఱు సుఖజీవనము జరుపుచుండవలెను. నేటివఱకు అట్టి నిజమైన, నిత్యమగు సంస్కారము, పరిణామము ప్రపంచమునకు లభింపలేదు.

అయిన మన ప్రపంచ మింత చెడ్డగా నుండుటకు కారణ మేమి? మంచి సంకల్పములు బొత్తిగా లేకపోవుట చేతనా? కాదు. మంచి యభిప్రాయములు లేకపోవుట చేతనా, కాదు. సాధారణముగా మంచిఫలమునే కోరుదుము, తలపెట్టిన కార్యము మంచిదికదా అని దాని సాధనకు అవలంబించే మార్గము కూడ మంచిగానే ఉండవలెనని తెలిసికొనక చెడ్డసాధనముల నుపయోగించుట ముఖ్యకారణము. ఫలమెంత ముఖ్యమో సాధనమును అంతముఖ్యము. దౌర్జన్యమువలన దుఃఖము, అశాంతి, కలుగును. యుద్ధసాధనమువలన మంచి పరిణామము ఎన్నటికిని రాదు. మంచి కావలెననిన శాంతియుతమగు మార్గము అవలంబించవలెను. అన్యోన్యసహకారము అపేక్షించవలెను. అక్కటికమగు హృదయముతో పాటుబడి సమస్యలను సాధించవలెను. అప్పుడు గాని మంచి పరిణామము రాదు.

రెండు మూడు ఉదాహరణలు చెప్పెదను. (1) 1932–34లో ఆయుధవిసర్జన సభలోనివారు భిన్నాభిప్రాయములను కలిగి, దృక్పథము వేరై, యెవరికివారే లోభముచేత ఏకీభవించలేక, జాప్యముచేసి తరుణమును జారవిడిచినారు. (2) మమారు ఇరువది సంవత్సరములు నామమాత్రముగా ఉండి లీగ్ఆవ్‌నేషన్సు విఫలమైపోయినది. దక్షులు, సమర్థులు,

ఉండిన రష్యా. అమెరికాసంయుక్తరాష్ట్ర ప్రభుత్వములవారు సమితిలో చేరనేలేదు. మిగిలినవారైనను చిన్నరాజ్యములకు అన్యాయము జరుగుచుండుట చూచి ఊరకున్నారు. చివరకు చివికి చివికి గాలివానై ప్రపంచమంతకు ముప్పు వచ్చినది. నేడు తిరిగియు అట్టిప్రయత్నము సాగుచున్నది. యునైటెడ్ నేషన్సు ఆర్గనైజేషన్ అను నానాజాతిసమితి యేర్పాటైనది. ప్రపంచమునకు సర్వత్ర స్వాతంత్ర్యము, భద్రత, క్షేమము, యీసమితి యొక్క ఆశయములు. ఇట్టి ఆశయములను త్రికరణశుద్ధిగా కలిగినవారు తప్ప శాంతిసభలలో పాల్గొనకూడదు. ఆయుధాగారములలో, పరిశ్రమలలో భాగస్వాములై వ్యాపారసంఘమునకు జెంది అతిలాభాపేక్షతో సాహసించి వ్యాపారము చేయువారు, రాజ్యసంపాదనము ధర్మమేఅనువారు ఇట్టి సభలలో పాల్గొనరాదు. వీరి మనోవృత్తులు శాంతికి, క్షేమమునకు బహుదూరములు. అందు పాల్గొనువారు త్రికరణశుద్ధిగ మంచివారై ఉండినగాని వారు సాధించు కార్యము మంచిగా పరిణమించనేరదు. నేటివరకు శాంతి సభలు నిష్ప్రయోజనము లగుట కిదియే కారణము.

ఐన శక్తిలేని మంచితనమన నేమిటి? ఏమిటి ఆశక్తి? అట్టి శక్తి ఎలాగున కలుగును. ఆశక్తి లేకుంటే మంచితనము అవసరమా, లేదా?

శక్తిఉన్నను లేకపోయినను మంచితనమును వదలకూడదు. మంచి సంకల్పము, మంచిమాట ఈరెండు సార్థకములేగాని నిరర్థకములుకావు. ఈ సందర్భములో అవసరమగు శక్తి మూడు

విధములు. సంకల్పశక్తి, వాక్ఛక్తి, కార్యశక్తి. మంచి సంకల్పమే ఒకగొప్ప శక్తి. అది తీవ్రముగా, గాఢముగా, అవిచ్ఛిన్నముగా ఉన్నచో దానివలన కార్యసాధన కలిగితీరును. మనోబలము ధైర్యమును, సాహసమును కలిగించును. భగవంతునియందు అఖండ విశ్వాసమును కలుగజేయును. మహాపురుషుల కార్యములకు ఇదే ప్రాతిపదిక. ప్రహ్లాదుడు, సావిత్రి, హరిశ్చంద్రుడు వీరి చరిత్రములు గొప్ప ఉదాహరణములు. సత్సంకల్పమునకు గొప్ప ఆధ్యాత్మిక శక్తి గలదు. మహదాశీర్వచనము వలన కలుగు క్షేమ మిట్టిదే, భౌతికముగాను, మానసికముగాను సంకల్పమునకు గొప్ప శక్తి గలదు.

వాక్ఛక్తివలన వినువారికి ఉత్సాహము, అభిప్రాయ సామ్యము కలుగును. దానివలన కార్యానుకూలమునకు సాధన ఏర్పడును. ఈరెండుమాత్రమే, పెద్ద కార్యములను సాధింపనేరవు. కార్యము పెద్దదయినకొలది పెక్కు వ్యక్తుల సానుభూతి, సహకారము అవసరము. అందులకు తగిన ప్రయత్నములు విరివిగా చేసినగాని కార్యసాధనకు తగిన వాతావరణ మేర్పాటుగాదు. వాతావరణ మనగా కార్యసాధనకు ఉపకరించు వ్యక్తులే, వ్యక్తులకు ఏకీభావము లేనిదే కార్యము సిద్ధించదు. నానాజాతి సమితులు ప్రపంచసమస్యలను చక్కబెట్టలేకుండుట కిదే కారణము. కావలసిన కార్యశక్తి అపారమైనది. ప్రతిజాతివారు, ప్రతిజాతిలోను ఎన్నదగిన ప్రతివ్యక్తికూడ సమస్యను ఏకవిధము గానే మంచిగానే అర్థము చేసికొనినగాని, అందరు ఏకమార్గా

వలంబులైవగాని, ప్రబలమైన కార్యశక్తి పుట్టదు — అప్పుడుగాని కార్యము సిద్ధించదు — అందుచేత ప్రజాశక్తిని మంచిమార్గమున ఎక్కువగా పెంచవలసియున్నది.

అట్టి శక్తి ప్రబలువరకు మంచికై ప్రయత్నము చేయుచునే యుండవలెను. గాని, ఫలితము స్పష్టముగా కనిపించుట లేదుగదా యని మంచితనమును వదలకూడదు.

మంచితనమును ప్రజలయందు వ్యాపింపజేసి వారి కార్యశక్తిని పెంచుటకు ఏమిచేయవలసియుండును ?.

ముఖ్యముగా విద్యావిధానములో గొప్ప మార్పు రావలెను. చిన్నతనమునుండియు పిల్లలకు మంచి అభిప్రాయములు కలిగించి, వారిని సత్కార్యములను చేయునట్టి ఉత్సాహముతో నింపవలెను. అందరు మంచివారైనగాని మంచికార్యము సాధింపబడదు, ప్రపంచములో జరుగుచున్న విషయము లన్నింటివి వారి శాహతునుబట్టి వారితో చర్చించి, ఎందుచేత సరియైన పరిణామమును, మానవప్రయత్నములు పొందుటలేదో విమర్శించి చూపవలెను. చరిత్రమ, సంఘసమస్యలను, రాజ్యాంగవిషయములను ఇట్లే విమర్శించి సరియైన, న్యాయమైన మార్గములను వారికి నేర్పవలెను. ఇట్లా, ఇట్లా అని వారిని విధించరాదు. వారి మనోవృత్తుల ప్రకారము వారిని పోనిచ్చి దానివలన కలుగు మంచిచెడ్డలను ఎత్తి చూపుచు క్రమముగా వారిని సన్మార్గావలంబులుగాను, కార్యోత్సాహపరులుగాను మార్చవలెను—అప్పుడు స్వతంత్రులై మంచిని సాధించగలరు. ఇట్టివారు దేశములయందు

వృద్ధియైనకొలది కార్యశక్తి పెరుగుచువచ్చును. అప్పుడు మంచి తనమునకు కావలసినంత శక్తి కలిగి మంచితనము సార్థకమై, ప్రయోజనకారి యగును.

ఐన ప్రపంచములో మంచితనము పెరుగుచున్నదా, తగ్గుచున్నదా? పెరుగుచునే ఉన్నది, కాని చాల స్వల్పముగా ఉన్నది, ఈ వృద్ధి. చెడ్డతనము పాపము పెరుగుచున్నావని నాయభిప్రాయము కాదు. నాగరకత పెరిగి, ప్రపంచమందలి వివిధ ప్రజలలో రాకపోకలు కలయికలు పెరిగినకొలది, విజ్ఞాన మభివృద్ధియగుకొలది, హృదయములు మంచిగానే పరివర్తన పొందుచున్నవి. రాజ్యకాంక్ష, ఘోరసంగ్రామము, ఆటామిక్ బాంబు వీనివలన సర్వనాశనమేగాని, వేరులేదని, ఈచెడ్డమార్గములను విసర్జించుట తప్ప వేరు త్రోవ, ప్రపంచమునకు క్షేమము కావాలె నంటే ఇంకొకటి లేదని, మంచితనమే శరణ్యమని రానురాను మానవ హృదయమునకు గట్టిగా పట్టిపోవుచున్నది. మంచితనమును సదా అవలంబించవలెనని ప్రపంచ హృదయము తల్లడిల్లుచున్నది, ఆవేదన పొందుచున్నది. నేడు ప్రాప్తమైన ప్రపంచ క్షామమును ఎదుర్కొనుటకై నానాజాతులవారు ఏకమై పాటుపడుచున్నారు. భోజనపదార్థములు, ధాన్యాదులు ఎక్కువగా ఉన్నవారు లేనివారికి దయార్ద్రహృదయులై పంపుచున్నారు. ఇది గొప్ప పుణ్యకార్యము. మంచితనము పెరుగుచున్నదనుటకు గొప్ప తార్కాణము. అందుచేత శక్తివ్యక్తముగా గోచరించినను లేకున్నను మంచితనమును విడువరాదు — శక్తిలేనిదైనను మంచి

తనము తప్పక కావలెను. "అనగననగరాగ మతిశయిల్లుచు నుండు తినగతినగ వేము తీయనుండు, సాధకమున బనులు సమకూరుధరలోన" అని వేమన్న చెప్పియున్నాడు గదా !

## మంచిపౌరునిగా తయారుచేయుట.

జ్ఞానసంపాదన బ్రతుకుతెరువునకు మార్గము. మంచి పౌరునిగా చేయుటమొదలైనవి విద్యావిధానపు ముఖ్యోద్దేశములు. వీనిలో అన్నిటికంటె మేలైనది మంచి పౌరునిగా జేయుటయని నా అభిప్రాయము. మంచి పౌరులను కలిగియుంతుటకంటె దేశాభివృద్ధికి కావలసినది మరొకటి లేదు. మంచిపౌరునిగా చేయుట అంటే ఏమిటి, పౌరలక్షణము లేమిటి అని కొంత ఆలోచింతము.

పాపభీతి, దేశభక్తి, స్వయంసమర్థత, పౌరుని లక్షణము లనవచ్చును. మరియు గ్రామాలలో గ్రామప్రజల కష్టసుఖాలలో భాగము పంచుకొనుచు వ్యవసాయ సహకార పారిశ్రామిక ప్రజానిర్మాణ పద్ధతులలో శిక్షణల ద్వారా ఆరితేరి గ్రామాభివృద్ధికి తోడ్పడగలుగుట పౌరలక్షణము. ఇట్లు గుణాతిశయములు గల పౌరులున్నచో మానవుని వ్యక్తిగత సాంఘికజీవితము సర్వసంపూర్ణము కాగలదు. సాంఘిక, నైతిక, వైజ్ఞానిక రంగాలలో ఏకీభావము పొందవచ్చును. సంఘమందు స్వయంసమృద్ధిని నిర్మించవచ్చును. అనర్థముల నాపగల బుద్ధిబలము, మనోబలము, ఆత్మబలము మహాజనులకు క్రమముగా ప్రాప్తమగును.

ఇట్టి స్థితి భరతఖండమం దెన్నడైన నుండెనా, ప్రజలు రాజ్యము చేయుట, వారి యభిప్రాయ ప్రకారమే పరిపాలన జరుగుట యనునదుండెనా, నాటిపౌరలక్షణములెట్టివి యని ప్రశ్న, కలుగుట స్వభావమే. రామాయణ కాలములో ప్రజాభిప్రాయమునకు విలువ ఈయబడినట్లు కనబడుచున్నది. భారతమందు యాదవ కుకురాంధకభోజ రాజ్యములు ప్రజాస్వామ్యములని ఆసంఘములకు ఒక్కొక్క ముఖ్యు డున్నట్లు తెలియుచున్నది. బౌద్ధయుగములో ప్రజాస్వామ్యములు, ప్రాతినిధ్య సంఘములు, అట్టి సంఘములకు వినయధరుడు అను అధ్యక్షుడు, వోటు తీసికొనుట ఉన్నటుల పాలీ గ్రంథములవలన తెలియుచున్నది.

వేయేండ్ల క్రిందటి గ్రంథమగు శుక్రనీతిసారములో గ్రామ పంచాయితీల గురించి వర్ణింపబడి యున్నది. గ్రామస్థులు పెద్దల నెన్నుకొనుచుండిరి, గ్రామపెద్దల సభలే పంచాయితీలు. గ్రామములోని సర్వ వ్యవహారములు వారే చక్కపెట్టువారు. రాజు పంచాయితీలను మిక్కిలిగౌరవముతోచూచి వాని తీర్పులను మన్నించెడివాడు. పంచాయితీ దారుల దగ్గర బంధువులను గ్రామోద్యోగులుగా నియమించరాదని విషేధ ముండెను. రాజసేవకులు గ్రామస్థులయెడ గౌరవముతో ఉండెడివారు, ప్రజాసేవకులుగా పని చేయుచుండెడివారు. అట్టి ఉద్యోగులెవరైన ఉద్యోగదర్పము చూపించినచో గ్రామస్థుల ఫిర్యాదుపైని రాజు ఆ ఉద్యోగులకు తగు శిక్ష విధించువాడు. గ్రామసేవకులకు పంచాయితీదారులకు కార్య దీక్ష, శీలము, గుణము ప్రధానములై యుండెను కాని, కులగోత్రము

లకు విలువ లివ్వబడలేదు. నాటి రాజ్యతంత్రమందు కార్మిక సంఘములు, వర్తకసంఘములు ఉండెను. అవి సమర్థతతో నడప బడుచుండెను. సహకారమే సంఘజీవితమునకు పట్టుకొమ్మగా ఉండెను. మరియు ౧౩వ శతాబ్దివరకు ఇట్టి పంచాయితీసభలుండెను. అప్పుడు కోర్టులు లేవు. అన్ని తగాదాలకు పంచాయితీ సభవారే ఉభయపక్షములవారిని విచారించి గ్రామస్థుల యెదుట గ్రామపు రచ్చ వాకిట తీర్పుల నిచ్చువారు. సత్యప్రమాణమును సాక్షులు చేసెడివారు. వారికి సత్యప్రమాణమంటే నేటివలె సాధారణ విష యము కాదు. అసత్యప్రమాణము చేసినచో నిర్వంశ మగు ననియు సంపదలు పోవుననియు పాపభీతి మెండుగా ఉండెను. సంఘమందు ధర్మబుద్ధి ఉండెను.

ఏరాజుపాలించినను ఎన్నిరాజ్యాలు నశించినను ఆమార్పులు గ్రామాల నంతగా అంటలేదు. జనపరిపాలన ఎంతో ప్రీతి పాత్రమై జనోపయుక్తమై యుండెను. అందుచేత భారతదేశ మందు గ్రామవ్యక్తిత్వము పాడుకాలేదు. భారతీయ సంస్కృతి అందుచేతనే మొత్తముమీద కాపాడబడుచు వచ్చినది. కాని ౧౮వ శతాబ్దమునుండి ఇంగ్లీషువారి పరిపాలనతో గ్రామపంచాయితీలు భారతీయ సంస్కృతి క్రమముగా నశించి మాయమై పోయినవి. పాశ్చాత్యానుకరణము పెరుగజొచ్చినది. రెండింటికి చెడ్డరేవడి వలె మనము తయారైనాము. కాని ఇంగ్లీషు నేర్చుకొని ప్రజ్ఞా వంతుల మైనాము. స్వేచ్ఛాపిపాసుల మైనాము. మన పుణ్యావశ మున గాంధీమహాత్ముని నాయకత్వమున ప్రపంచమందున్న అన్ని

ప్రజాస్వామిక రాజ్యములకంటె గొప్పదైన ప్రజాస్వామ్యమును స్వాతంత్ర్యమును పొందగలిగినాము. రాజకీయ స్వాతంత్ర్యము వచ్చినంత మాత్రమున ఏమియును శాశ్వతమగు లాభములేదు. నైతికముగా, ఆర్థికముగా సాంఘికముగా మనకు స్వాతంత్ర్యము రావలెను. లేనిచో ఈ స్వాతంత్ర్యము చిరస్థాయికానేరదు. ప్రపంచ మంతెప్పుడు చూచినను దురాశ, దురహంకారము, స్వలాభము, అధికారవాంఛ గర్వము పర్నీతి తాండవమాడుచున్నవి. దేహబలము, యంత్రబలము తంత్రబలములచేత విఱ్ఱవీగుచు అవేపరమ సాధనములని దారితప్పి ప్రపంచము ప్రవర్తించుచున్నది. ఇట్టి ప్రపంచమందు భారతదేశ మొక ప్రజాస్వామ్యరాజ్యముగా ఉదయించినది. ప్రపంచమంతయు మనదేశమువైపు దృష్టి మరలించియున్నది. మన మేస్థితికి జారిపోదుమో యని కొందరు శంకించుచున్నారు. వేద వేదాంగములయందు పురాణేతిహాసములయందు ప్రపంచమం దితర దేశములలో ఎచ్చటను కానరాని భారతీయ విశిష్టమైన ఆధ్యాత్మ తత్త్వవిషయములు నిండియున్నట్టియు బుద్ధుడు, మహాత్ముడు మొదలగు మహాపురుషు లుదయించినట్టియు పరమసత్యమును సనాతనమునై ధర్మయుక్తమైనట్టియు ఈ పుణ్యభూమిలోని, ధర్మభూమిలోని ప్రజలు స్వాతంత్ర్యరథము నెట్లు జయప్రదముగా నడిపి ప్రపంచమున కాదర్శప్రాయులు కాగలరో యని వేయి కళ్ళతో పరిశీలింపబడుచున్నారు.

అందుచేత మన ప్రభుత్వమువారు భారతజాతియొక్క విశిష్ట సంస్కృతి నాధారము చేసికొని ప్రజలకందరకు విద్యా

బోధ చేసి వారిని గొప్ప పౌరులుగా చేయుటకై సర్వ ప్రయత్న ములు జేయబూనియున్నారు; చేయనారంభించియున్నారు.

భారతీయ సంబంధమగు రిపబ్లికు అవతరణ మైనది. రాజ్యాంగచట్టరీత్యా వయోజనులకందరకు ఎన్నికల హక్కు సంక్ర మించినది. రాజ్యాంగ తంత్రమును సమర్థతతో నడపగలనాయ కులను ప్రజలెన్నుకొనగలిగి, ఆతంత్ర మెట్లు నడుచుచున్నదో విమర్శించి తెలిసికొనగలిగేలాగున వయోజనులు మంచి పౌరులుగా తయారుకావలసియున్నది. భావిపౌరులైన బాలబాలికలకు నూతనమగు బేసిక్ విద్యావిధానము నేర్పాటుచేయుచున్నారు. ఈ విధానము వలన పిల్లలలో సహకారము కార్యదీక్ష సత్యప్రవ ర్తన మానవసేవ శిక్షణ మొదలగు సద్గుణము లలవడగలవు. ఈ బేసిక్ పాఠశాలలు గ్రామస్థుల నాకర్షించు కేంద్రములుగా ఉండగలవు. అందలి ఉపాధ్యాయులకు తగు శిక్షణ యీయబడు చున్నది. అట్టివారు గ్రామస్థులకుకూడ మంచిచెడ్డలను చెప్పి సన్మార్గావలంబనకు దారి చూపగలరని ఆశించుచున్నాము. ఇది గాక మధ్యమ కక్ష్య పాఠశాలల యందంతటను పౌరశిక్షణ ప్రణాళికను అమలులో పెట్టి నడుపుచున్నారు. పౌరశిక్షణ ఎట్లు చేయవలెననువిషయమును ఉపాధ్యాయులకు నిపుణులచేత నేర్పించుచున్నారు. అట్టి ఉపాధ్యాయులే పాఠశాలలయందు పౌర శిక్షణ తరిబీదు పిల్లలకిచ్చుచున్నారు. ప్రజాస్వామిక మందలి రాజ్యాంగ మెట్లు నడుపవలెనో అట్లే పాఠశాలను బాలురచేత నడపించుట, నాయకుల నెన్నుకొనుట, జరుపవలసిన కార్య

క్రమములను పాఠశాల బాల సంఘమువారు చర్చించి నిర్ణయించుట, నడపించుట, నాయకుని గౌరవించుట శిక్షణను— డిసిప్లిను—, తెలిసికొనుట మొదలగు అనేక విషయములలో పిల్లలకు, సక్రమమగు పౌరశిక్షణ ఏర్పాటు ప్రారంభింపబడినది.

బాల పౌరులనుగురించే కాకుండ నేటి పౌరులైన వయోజనులకుపయోగపడు సాంఘిక వయోజన విద్యను గరపుటకై ప్రణాళిక తయారైనవి. ఈమధ్యనే దేశమందంతటను వయోజన విద్యా విషయకమైన ప్రబోధము వారము దినములపాటు జరిగినది. అది ప్రచారము నిమిత్త మేర్పడినది మాత్రమే. ఉపన్యాసముల వలన అయ్యేపనికాదు. కార్యము వలననే కాగలదు. దానిని ప్రారంభము చేయుచున్నారు. ప్రతిపిల్లల పాఠశాలలలోను జరుగు వార్షికోత్సవములలో పౌరులను ఆహ్వానించి వారికి ఉత్సాహము కలుగు ప్రత్యేక ప్రణాళికల నేర్పరిచి వారిని పాల్గొనునట్లు చేయుట, గుణపాఠములనిచ్చు నాటకములను వారిచే నాడించి వారిలో గట్టివారికి బహుమతులిచ్చి ప్రోత్సహించుట, దేశభక్తి జనకములు చరిత్రాత్మకములగు జానపదగీతములు పాటలు వయోజనులకు చెప్పుట, వారి వృత్తుల కవసరమగు, ఆరోగ్య పారిశుద్ధ్యములకు కావలసిన విషయములను మాటల చేతకాక మేజిక్ లాంతరు, సినిమా ప్రొజెక్టర్లు మొదలగు ఆకర్షణీయములగు పద్ధతులచేత బోధించుట, ఆప్రాంతములయందలి జాతీయతకు సంబంధించిన ఆటపాటలను కళను పెంపొందించుట మొదలగు ప్రణాళికలవలన వయోజనులను మంచిపౌరులుగా జేయుటకై ప్రయత్నములు సాగుచున్నవి.

ఇవన్నియును జయప్రదముగా సాగవలెనంటే సులువుగా జరిగేపనికాదు. ఇది ప్రజల మానసిక తత్త్వమందు మార్పువచ్చిన గాని జరుగదు. ముఖ్యముగా దేశనాయకులయందు ఉపాధ్యాయుల యందు మానసికపరివర్తనరావలెను. అన్నిటికంటె శీలము ప్రధాన గుణమని గ్రహించవలసియున్నది. శీలము విద్యచేతగాని, ధనము చేతగాని అధికారముచేతగాని పెంపొందదు. శీలవంతుల సాహచర్యముచేత, జనసామాన్యమునకు వారు జేయు ఉపకారకమగు, త్యాగరూపకమగు కార్యములచేతగాని శీలము పెంపొందదు.

గాంధి మహాత్ముని జీవితమే దానికి ప్రబల తార్కాణము. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత పదవీ వ్యామోహము చేత మహాత్ముని వంకనుండి వైదొలగి సంకుచితాభిప్రాయమువలన కట్టుపడి నాయకులు తమ పూర్వదీక్షను దేశసేవను మరచుట చేత దేశముయొక్క స్థితి క్రమముగా హీనమగుచున్నది.

ఉద్యోగ పదవు లేమైనసరే సహచరు లేమనుకొన్నను సరే స్వార్థమెట్లు త్రిప్పుచున్నను సరే సరకుజేయక జంకక కొంకక ప్రజల యొక్క క్షేమలాభముల యందే లక్ష్యము నిడుకొని పర్వతము వంటి స్థైర్యమును బూని నాయకులు కార్యములు సాగించవలసిన తరుణమిది. జాగుచేసిన, సందేహించిన మోసము కాగలదు. స్వాతంత్ర్యము చేతులనుండి చల్లగా జారిపోవచ్చును. కష్టించి పనిచేసి ఫలములను చూపించుటకు గాని మాటలకిది తరుణము కాదు. ఇట్టి దీక్ష నడవడి గల పెద్దలు తమ కార్యముల చేత జనసామాన్యుల మనస్సులను సమ్మోహింపజేసి గుణపాత

మున నేర్పి వారిని ధర్మ ప్రేరితులను చేయవలసి యున్నది. అప్పుడు స్వార్థము, జాతి మత భేదములు మొదలగు దుశ్శీలము అడుగంటగలదు. శీలవంతమగు వాతావరణమేర్పడిన గాని వయోజన విద్య, బేసిక్ విద్య, పౌరశిక్షణా ప్రణాళికలేమియును సఫలీకృతము కానేరవు. అట్టి శీలప్రదానమగు వాతావరణము శీఘ్రకాలములోనే దేశమందంతటను వ్యాపించు భాగ్యము కలుగు గాక. భారతీయులందరు మంచి పౌరులై దేశాభ్యుదయమును సర్వతో ముఖముగ పెంపొందింతురు గాక.

## రేడారు

రేడారునుగురించి తెలిసికొనుటకుముందు కొన్నిముఖ్య విషయములు ఎరిగి ఉండవలెను. వానిని గురించి చెప్పెదను. నీళ్ళలో పంచదార కరిగి అణువులై కనపడకుండ లీనమై నీళ్ళలో కలసి పోవును. ఈ పంచదార అణువులను ( Molecules ) రసాయన శాస్త్రజ్ఞులు, ఉదజని, ప్రాణవాయువు, బొగ్గు పరమాణు వుల (Atoms) క్రింద విభజించిరి. విభజించిన పరమాణువు లన్నిటిలో ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు అనే సూక్ష్మాణువు లున్నవని తేలినది. అంటే ఏమన్నమాట ? ఈ సూక్ష్మాణువులతో పరమాణువులు, పరమాణువులతో, అణువులు, అణువులతో సకల పదార్థాలు నిర్మింపబడినట్లు నిశ్చయ మైనది. ప్రోటానులు ధన (+ ve) విద్యుత్తుకణములు, ఎలక్ట్రా నులు ఋణ(— ve)విద్యుత్కణములు. పరమాణువు ఒకగుండులా గున్నదనుడు. ఈ గుండుయొక్క కేంద్రమందు కొద్ది పాటి

స్థలములో ప్రోటానులు, న్యూట్రానులు దగ్గరగా చేర్చబడి ఉండును. ఈ కేంద్రముచుట్టు, సూర్యునిచుట్టు గ్రహములవలె, దూరదూరముగా గిరగిర తిరిగే ఎలక్ట్రానులే రేడారు అనే యంత్రములో వినియోగపడుచున్నవి. రేడారు రేడియో లాగున పనిచేయును, రేడియో స్టేషనులో మాటలు సంగీతము, కొన్ని మీటర్ల పొడుగు గల విద్యుత్తరంగములద్వారా, ప్రసారమగును. మాటలు తరంగాలుగా మారి, ఎత్తైన ఒక స్తంభము ద్వారా ఆకాశములోనికి వెళ్లును. అవి మన ఇంటిపైనఉన్న ఆకాశతీగ చేత ఆకర్షింపబడి రేడియోపెట్టెలోనికివచ్చి మాటలక్రింద మారును. విద్యుత్తరంగాలను పుట్టించి ప్రసారముచేసే యంత్రమును ప్రసారిణి (transmitter) అందురు. ఎత్తు స్తంభమును, ఆకాశ తీగను అంటెన్నా అందురు, రేడియోపెట్టెను గ్రాహకము (receiver) అందురు, రేడియోతరంగాలు ఎలక్ట్రానులవలన ఉత్పత్తి అగును. మాటలు తరంగాల క్రింద, తరంగాలు మాటల క్రింద, ఎలామారునో, మొదలైన విషయములు ఇప్పుడు చెప్పుటకు వీలులేదు. విద్యుత్తరంగాలు సెకనుకాలములో ౧౮౬,౦౦౦ మైళ్ళు ప్రయాణము చేయును, వెలుతురు, వేడిమి ఎక్సు కిరణాలు కూడ విద్యుత్తరంగాలే.

ఈ తరంగాలు ౧౮౬ మైళ్ళు ప్రయాణము చేయుటకు ౧/౧౦౦౦ సెకనుకాలముపట్టును. ఇంత స్వల్పమగు కాలములను తెలుపుటకు సూక్ష్మములగు గడియారములు తయారుచేసిరి. ఈ సూక్ష్మ గడియారము రేడారులోఉండును.

ఇంక రేడారు చేయు పనిగురించి చెప్పెదను.

కంటికి కనపడకుండ ఆకాశములో ఎగురుచున్న విమానాలు, ఎంతదూరములో, ఏదిక్కులో ఉన్నది రేడారు చెప్పును. ద్వితీయ ప్రపంచయుద్ధములో జర్మనీవారు బాంబరు విమానాలను పంపి ఇంగ్లండును సర్వధ్వంసము చేసినారు. ఆకార్యము ఇంకను కొన్నినెలలు జరిగియుండిన ఇంగ్లాండు తప్పక దుస్థితిలోనికి వచ్చియుండును. అట్టి సమయములో రేడారుయంత్రము ఇంగ్లండును, తద్వారా ప్రపంచమును సంరక్షించెను. ఈపని రేడారువలన ఎలా జరిగినదో కొంత తెలిసికొందము. రేడారులో ప్రసారిణి, ఆంటెన్నా, గ్రాహకము, సూక్ష్మగడియారము మొదలైనవి అమర్చబడియుండును. ప్రసారిణినుంచి ఒక సెంటిమీటరు పొడుగుగల విద్యుత్తరంగాలు పుట్టి ఆంటెన్నా వల్ల ఆకాశములోనికి వెళ్ళిపోవును. ఆ తరంగాలుపోయే మార్గములో ఒక శత్రువిమానమున్నదనుకొందము. దానికి ఈతరంగాలు తగిలి పరావర్తనమగును—రిఫ్లెక్టు అగును. ఈ పరావర్తనమైన తరంగాలు తిరిగి వచ్చి రేడారులోని ఆంటెన్నాద్వారా గ్రాహకములో ప్రవేశించును. విమానము ౧౮౬ మైళ్ళ దూరములో ఉందనుకొందము. రేడారునుంచి విమానమునకు తరంగాలు వెళ్ళుటకు ౧/౧౦౦౦ సెకను కాలము పట్టును. తిరిగి రేడారులోకి తరంగాలు వచ్చుటకు ఇంకొక ౧/౧౦౦౦ సెకను పట్టును. ఈ రాను పోనుపట్టిన కాలము సెకనులో ౧/౫౦౦. రానుపోను సెకనులో ౧/౫౦౦ కాలం పట్టినదనిన విమానము ౧౮౬ మైళ్ళ దూర

ములో ఉన్నదన్నమాట. రేడారులో కేథోడుకిరణపుగొట్టము (Cathode-ray tube) అనే పనిముట్టు ఉంటుంది. దాని చివర సంత్రమగు గాజుపలక ఉండును. దానిమీద అడ్డముగా ఒక కాంతివంతమగు గీత ఉండును. ఈ గీతవలన విమానము యొక్క దూరము తెలుసుకొనవచ్చును.

దూరమొక్కటే తెలిసిన ఏమియు ప్రయోజనములేదు. విమానమున్న దిక్కు, దాని ఎత్తుకూడ తెలియవలెను. రేడారులో ఉన్న అంటెన్నా ఒక గిన్నె ఆకారముగా ఉండును. దానిని హారిజాంటలుగా గిరగిర త్రిప్పుటకు, వర్టికల్‌గా పైకి క్రిందికి త్రిప్పుటకు ఏర్పాట్లుండును. ఈ ఏర్పాట్లు గల అంటెన్నావలన ఇంత ఎత్తు అని, ఫలానా దిక్కుని రేడారు చెప్పును ఇవి తెలియగానే అతివేగముగా పోవు యుద్ధ (fighter) విమానాలు పైకి చేరివెళ్ళి శత్రువుల బాంబరు విమానాలను పేల్చి కూల్చివేయును. ఇంక తప్పించుకొని వచ్చిన బాంబర్లను సముద్రపు ఒడ్డున ఉన్న విమాన విధ్వంసక శతఘ్నులు (Anti-aircraft guns) కాల్చివేయును. ఇట్లు చేయుటవలన జర్మను బాంబర్లను నూటికి 80 వంతులు కూల్చివేయగలిగిరి. ఇంగ్లీషువారు. అందుచేత ఈ నష్టమును తట్టుకోజాలక జర్మనీ, బాంబర్లను పంపుట మాని వేసినది. జర్మనులకు రేడారు యంత్రములేదు. అందుచేత, తరువాత, ఇంగ్లాండు జర్మనీమీద విమానదాడులను విరివిగా చేసి జర్మనీని ధ్వంసము చేయగలిగినది. రేడారువలన ఆకాశమందున్న విమానము శత్రువిమానమో, మిత్రవిమానమో, తెలిసికోవచ్చు-

పర్యవసానమేమంటే, కంటికి కనపడనంత దూరములోనున్న విమానములను కాని, ఓడనుకాని, దేనినికాని ఆవస్తువునకు తెలియకుండ కనిపెట్టి, అది ఉన్నదిక్కు, ఎత్తు, దూరము రేడారు మనకు తెలియజేయును. పగలు కానీ, రాత్రి కానీ, మబ్బుకానీ, పొగమంచు కానీ, శత్రువుల విమానములను, ఓడలను, జలాంతర్గాములను కనిపెట్టగలదు. అందుచేత వానిని సులభముగా ధ్వంసము చేసి విజయము సాధించవచ్చు. ఇట్లు పెక్కు పనులకు యుద్ధములో ఈ రేడారు సర్వోపకరణ్యమైనది. శాంతి సమయములలో కూడ రేడారు చాల ఉపయోగపడుచున్నది. తుపాను, పొగమంచు క్రమ్మినప్పుడు విమానములకు, ఓడలకు ప్రమాదము రాకుండ చేయగలుగును; రేవు ఎంత దూరములో ఏదిక్కున ఉన్నదో తెలియపరచును. మన చుట్టునున్న గాలిలో ఒక లక్ష అడుగుల ఎత్తు వరకు వాతావరణస్థితి, అనగా, వేడిమి, తడి, గాలియొక్క వేగము ఎట్లున్నదియు, రేడారు సహాయమున తెలిసికొనుచున్నాము. చంద్రుడు మొదలగు గోళములు ఎంతదూరములో నున్నదీ తెలిసికొనుచున్నారు. రోడ్డుమీద వెళ్లకూడనంత వేగముతో పోయే మోటార్లను రేడారు పట్టించును. ఇట్టి రేడార్లను రహదారీ రోడ్డు ప్రక్కన కనపడకుండునట్లు అమెరికాలో ఏర్పాటు చేయుచున్నారు. ఇంక ఎన్నింటికో రేడారును ఉపయోగించుకోవచ్చును.

ఈ రేడారు మనుష్యుని బుద్ధిచాతుర్యముచేత పదేండ్ల మధ్య కనిపెట్టబడిన సాధనము. ఇట్టి సాధనమే సృష్టిలో అనాదిగా ఏర్పాటై ఉన్నది. గబ్బిలములలో ఇట్టి రేడారు నిర్మింపబడి

ఉన్నది. ఈ రేడారువలన పుట్టె తరంగాలు శబ్దతరంగాలు. వాని పొడుగుకూడ ఒక సెంటిమీటరుకు కొంచెము తక్కువ. గబ్బిలాలకు వెలుతురులో కండ్లు కనపడవు. అందుచేత ఎగురునప్పుడు ఏ ఆటంకమువలన ప్రమాదము లేకుండ తప్పించుకోగలుగుటకు ఈ రేడా రుపయోగపడుచున్నది. ధ్వని తరంగము గబ్బిలమునుండి బయటకు వెళ్లి ఆటంకమునకు తగిలి తిరిగివచ్చి, ఆ యాటంకము ఇట్టిదని తెలియజేసి దానినుండి తప్పించుకొనునట్లు చేయును. ఆయాటంకము ఒక చిన్నపురుగైతే గబ్బిలము వెళ్లిదానిమీద పడి తినివేయును. చూచితిరా ? గబ్బిలములోని రేడారు ఎంతలాభమును గబ్బిలమునకు ఇచ్చి దానిని రక్షించుచున్నదో. సృష్టిలో ఎట్టి అద్భుతాలున్నవో, రేడారెంత లాభకారియో.

## విశ్వము నిర్మాణమై ఎంతకాలమైనది ?

విశ్వము (Universe) అనంతమని, అనాదియని సాధారణముగా భావించుచున్నాము. కాని శాస్త్రరీత్యా విశ్వపరిశీలన జరుగుచునే యున్నది. దానిపరిమితిని, ఆది సృష్టియైనకాలమును నిర్ణయించుటకై వైజ్ఞానికులు చేసిన కృషిఫలితముగా కొన్నివిషయములు స్పష్టపడినవి. ఈ రెంటిలో నొకటియగు సృష్టికాలమును గురించిన విషయములు కొన్ని తెలిసికొందము.

విశ్వము, వివిధభాగముల యొక్క కూర్పు, రచన, ఏర్పాటు; భూమి, ఉల్కలు, సూర్యుడు, నక్షత్రములు, జంట నక్షత్రములు (Binary stars), నక్షత్రవీధులు (Galaxies)

నక్షత్రమేఘములు (Nebulae) ఇవన్నియు ఒకఅద్భుతమగురీతిని కలిసి విశ్వమను కట్టడము ఏర్పాటైనది విశ్వము ఒక బ్రహ్మాండమైన విచిత్రాకారముతో వెలయుచున్నది. ఇట్టి మహాకారము కల విశ్వము ఎంతకాలము క్రిందట నిర్మాణమైనదనే విషయమునే విశ్వనిర్మాణ కాలమని, విశ్వముయొక్క వయస్సు అని చెప్పుచున్నాము. విశ్వములోని వివిధభాగములు ప్రత్యేకముగా ఎప్పుడు నిర్మాణమైనవను విషయము పరిశీలింపబడినవి. వానిఫలితములను ముందు తెలిసికొందము

(1) భూమి :— భూమి గోళాకారమును పొంది, గట్టిపడుట కారంభించి, సూర్యకుటుంబములో ఒక గ్రహముగా ఏర్పడి యెంతకాలమైనదో ఆకాలమునకే భూమియొక్క వయస్సు అని పేరు. అంతేగాని, భూమిలోని వివిధపదార్థములు, అందలి అణువులు, పరమాణువులు పుట్టి ఎన్నాళ్ళైనదనికాదు మన విచారణ.

భూగర్భమందలి ఖనిజములలో యురేనియము ఉప్పులు (Uranium salts) గల రాళ్లుండును. అన్నిపరమాణువుల (Atoms) లోను యురేనియము బరువైనది. అన్నిటికంటె తేలికైన హైడ్రోజను పరమాణువుకంటె 238 రెట్లు బరువైనది- అనగా దీని తారతమ్య పరమాణుభారము (Atomic weight) 238. రేడియోయాక్టివు పదార్థములలో యురేనియము ముఖ్యమైనది. దీనినుండి ఆల్ఫా, బీటా, గామాకిరణములు నిరంతరము ప్రసారమగుచుండును. ఈ ప్రసరణమువలన యురేనియము ఇతరపదార్థములుగా మారుచుండును. ఈ మార్పులు పరంపరగా

కొన్ని జరుగుచుండును. ఏమార్పులో ఏకిరణము వెలువడునో, ఆమార్పుచెందుట కెంతకాలముపట్టునో నిర్ణయింపబడినవి. అన్ని మార్పులు జరిగినపిమ్మట 206 పరమాణుభారముగల సీసము పుట్టును. ఈ మార్పుల పరంపరలో 8 హీలియము పరమాణు కేంద్రకములు (Helium nuclei-alpha particles) విడుదలగును. హీలియము పరమాణుభారము 4. అందుచేత $8 \times 4 = 32$ పరమాణు భారప్రమాణముతగ్గి $238 - 32 = 206$ పరమాణుభారముగల సీసము పుట్టుచున్నది. దీనిని బట్టి 238 భారముగల యురేనియము పరమాణువు మార్పులు చెందిచెంది 206 భారముగల యురేనియము — సీసము, పరమాణువుగాను, ఎనిమిది హీలియము పరమాణువులుగాను పరిణమించుచున్నది.

ఈపరిణామములోని మొదటి మార్పులో యురేనియము, యురేనియము $X_1$, అను పరమాణువుగా మారును. ఇట్లు మారుటకు కొంతకాలము పట్టును. అనగా ఒకగ్రాము బరువుగల యురేనియములో సగముభాగము యురేనియము $X_1$, గా మారుటకు పట్టెకాలము 450 కోట్ల సంవత్సరములు. దీనిని యురేనియముయొక్క అర్ధపరివర్తన కాలమని, అర్ధాయుర్దాయమని అందురు. రేడియో ఏక్టివిటీ మార్పులలో కొన్నిటికి చాల తక్కువ అర్ధాయుర్దాయకాలములు, కొన్నిటికి ఎక్కువకాలములు ఉండును. పైన పేర్కొనిన మార్పులయొక్క అర్ధాయుర్దాయమన్నిటికంటె ఎక్కువయైనది. యురేనియము 14 సార్లు ఒకదాని తరువాత ఒకటిగామారి తుదకు యురేనియము—సీసముగా మార్పుచెందును. హీలియము గాలిని వెలువరించును.

యురేనియ మున్నట్టి రాళ్లను పరీక్షించి అందు మార్పు చెందకుండ ఉన్న యురేనియమెంతో, యురేనియము సీసమెంతో విశదీసి తెలికోవచ్చును. ఈరాళ్లలో ఉండే యురేనియము అతి స్వల్పమైనను, ఇంత స్వల్పముగాఉండే యురేనియమును యురేనియము—సీసమును, హీలియముగాలిని, అతి సున్నితమైన విధానములచేత నవీనశాస్త్రము, ఇంతింతయని, నిర్ధారణ చేయగలుగుచున్నది. ఇందుగల సీసమునుబట్టి, హీలియమునుబట్టి ఈరాళ్లలో ఈమార్పుల ప్రారంభమై ఎంతకాలమైనదని లెక్కించవచ్చును. అట్టి లెక్కలవలన ఈ రాళ్లయొక్క ప్రాచీనతను నిర్ణయించవచ్చును.

అతి ప్రాచీనమైన రాళ్లు ఇవి యని భూగర్భశాస్త్రము నిర్ణయించగలదు. అందుల కుపయోగపడే భూగర్భశాస్త్రభాగము పేరు పేలియంటాలజీ. ఎప్పుడో జీవించిన మొక్కలయొక్క, జంతువులయొక్క ఆకారములు, అస్థిపంజరములు భూగర్భమున కానవచ్చుచున్నవి. కొన్ని అస్థులు శిలలుగా మారుచున్నవి. వీనిని ఫాసిల్సు (Fossils) అందురు. వీనిని గురించిన శాస్త్రమే పేలియంటాలజీ. పాలిచ్చు జంతువులయొక్క, ప్రాకెడిజంతువులయొక్క, జలచరములయొక్క, కీటకములయొక్క ఫాసిల్సు అనేకవిధములగు రాళ్లలోను వివిధమైన లోతులు గల భూగర్భములలోను కానవచ్చుచున్నవి. ఆయాఫాసిల్సుయొక్క, వివిధ చగుణములనుబట్టి అవి ఏకాలములకు చెందినదీ నిర్ణయింపవచ్చును. ఇట్టి వియర్ణములో అతిప్రాచీనమైనవిగా నిశ్చయింప

బడినవి. ప్రీకేంబ్రియను (Pre-Cambrian) యుగమునకు చెందినవి. ఆకాలపురాళ్లు అతి ప్రాచీనములు. వానిని, రేడియో ఏక్టివిటీ పద్ధతిని, పరిశీలించగా వానికాలము 180 కోట్ల ఏండ్లకు పూర్వమని తేలినది. అర్గ్లే హీలియము విధానముచేతను తేలిన కాలముకూడ 180 కోట్ల ఏండ్లే. రాళ్లుపుట్టిన కాలమెక్కువయై యుండుటనుగాన అది 200 - 300 కోట్ల సంవత్సరములమధ్యకాల మని నిర్ణయింపబడినది.

(2) ఉల్కలు :— భూకక్ష్యకంటె దూరమైనకక్ష్యలో సూర్యునిచుట్టి ఉల్కలు పరిభ్రమించుచుండును. అందులోకొన్ని భూమికి దగ్గరగావచ్చి భూమిచే ఆకర్షింపబడి భూమిపై పడుచుం డును. అంతరాళమందతివేగముతో పడునప్పుడు, గాలితో రాపిడికలిగి వేడిమినంది మండిపోవును. మండగా మిగిలిన ముక్కలు నేలమీదపడును. ఇందలి రాళ్లను పైన వివరించిన తీరుననే పరీక్షించి, కాలనిర్ణయము చేయగా, 300 కోట్ల ఏండ్లని లెక్కకు వచ్చినది. ఉల్కల కాలముకూడ సుమారుగా భూమి యొక్క కాలముతో సమానముగా ఉన్నదదని దీనివలన చెప్ప వచ్చును.

(3) సూర్యుడు :— సూర్యగోళము యొక్క వయస్సు తెలిసికొనుటకు పూర్వము, సూర్యునినుండి నిరంతరము ప్రసార మగు వేడిమి, వెలుతురు రూపకమగు శక్తి ఇంతయని తెలిసికొన వలసియున్నది. సూర్యగోళమందలి ద్రవ్యమే (mass) ప్రసరణ శక్తిగా మారుచున్నదని నవీనశాస్త్ర సిద్ధాంతము. శక్తిద్రవ్యము

లకు (energy & mass) అవినాభావమని, ఒకటి ఇంకొకటిగా మార్పు చెందునని, ఇంతద్రవ్యమున కింత శక్తి సమానమని ఐన్‌స్టయిను చాలఏండ్లక్రింద ప్రతిపాదించెను. సూర్యునినుండి ప్రతివిముసము ప్రసారమగుశక్తిని ద్రవ్యముగా మార్చినచో అది 25 కోట్ల టన్నులగును. ప్రతి నిముసములోను 25 కోట్ల టన్నుల ద్రవ్యము సూర్యగోళమునుండి అంతర్ధానమగుచున్నది. ఐనప్పటికిని సూర్యగోళములోని ద్రవ్యము * ఇరవై లక్షలకోటి, కోటి, కోట్ల టన్నులని లెక్కింపబడుటచేత, నిముషమునకింత రేటుచొప్పున ఈ ద్రవ్యమంతయు అంతరించుటకు 13,000 కోట్ల సంవత్సరములు పట్టును. కావున మనకేవిధమైన జిజ్ఞాస అవసరములేదు.

సాధారణముగా నక్షత్రము లన్నిటిలోను నూటికి ముప్పది వంతులు వరకు హైడ్రోజనుగాలి ఉండునని శాస్త్రపరిశోధనలవలన తేలినది. సూర్యగోళముయొక్క మధ్యభాగమున విపరీతమగు ఉష్ణోగ్రత (temperature) – 200,00,000 సెంటిగ్రేడు డిగ్రీ లుండును. దీనితోపాటు అక్కడ గల అతిపల్చని వాయువుల యొక్క పీడనము (pressure) కూడ విపరీతముగా ఉండును. ఇట్టి పరిస్థితులలో హైడ్రోజనుగాలి హీలియముగా పరివర్తన చెందుచుండును. ఈ పరివర్తనములో నాలుగు హైడ్రోజను పరమాణువులు హీలియము పరమాణువుగా మారును. హీలియము

* 2000000 0000000 0000000 0000000 టన్నులు = $2 \times 10^{27}$ టన్నులు = $2 \times 10^{33}$ గ్రాములు.

పరమాణువు బరువు నాల్గు హైడ్రొజనుపరమాణువుల బరువు కంటె కొంచెము తగ్గియుండును. ఈ తక్కువైన ద్రవ్యము శక్తిగా — వేడిమి, వెలుతురుగా — మారుచుండును. ఇట్టి మార్పువలననే సూర్యగోళములోని 25 కోట్ల టన్నుల ద్రవ్యము నిమిషకాలములో శక్తిగా మారుచుండును. సూర్యుడొక గోళముగా సమకూడిన ఆరంభకాలమందు గల ద్రవ్యములో హైడ్రొజను ఎన్నిభాగములున్నదో హీలియము ఎన్నిభాగములున్నదో తెలిసినచో, నేడు సూర్యగోళమం దివి ఎన్నెన్నిభాగములున్నదో తెలిసినచో ఇంత హైడ్రొజను తగ్గి ఇంత హీలియముగా పరిణమించినదని ఇంత శక్తిగా అంతరించినదని తెలియును. దీనినిబట్టి, నిముషమున కింత హరించుచున్నదన్న లెక్కనుబట్టి, ఇంతకాలమై యుండునని లెక్క చేయవచ్చును. ఇట్టి లెక్కల అంచనాల వలన, గణితమువలన సూర్యగోళములో ఈ పరివర్తనము 200 కోట్ల ఏండ్లనుండి జరుగుచుండవచ్చునని నిర్ణయింపబడినది. దీనినిబట్టి సూర్యునివయస్సు సుమారు 200 కోట్ల సంవత్సరము లనుచున్నాము.

(6) నక్షత్రసమూహములు :— ఆకాశమందు కొన్ని నక్షత్రములు గుంపులుగా కనిపించుచున్నవి, కృత్తిక, రోహిణి మొదలైనవి. "కృత్తికాక్షురాకారంషట్కమ్" అన్నట్లు కృత్తిక నక్షత్రము ఆరు నక్షత్రములుకలిగి మంగలికత్తి ఆకారముతో ప్రకాశించుచుండును. దూరదర్శినితో (telescope) చూచినచో

ఆ గుంపులో సుమారు 200 నక్షత్రములు కనబడును. పది * కాంతి సంవత్సరముల వ్యాసార్థము (radius) గల గుండ్రటి ఘనపరిమాణములో (Spherical volume of space) ఈ నక్షత్రము లన్నియు ఇమిడియున్నవి. ఈ గుంపులోని నక్షత్రములన్నియు రమారమి సెకనుకు 500 • మీటర్ల వేగముతో ఇటునటు కదలుచుండును. సాధారణముగా ఆకాశమందు గల ఇట్టి నక్షత్రముల గుంపులలోని నక్షత్రముల మధ్యగల దూరముకంటె ఈ గుంపులోని నక్షత్రముల మధ్యదూరము చాల తక్కువ. వానికంటె ఇవి 20 రెట్లు దగ్గరగా దట్టముగా చేర్చబడి యున్నవి. అందుచేత ఈ గుంపులోని నక్షత్రములకు ఒండొంటితో గల సంబంధము చాల హెచ్చు. చుట్టుపట్లనున్న ఇతర నక్షత్రములతో జోక్యములేక ఇవి ఒక స్వతంత్రపు ముఠాగా ప్రవర్తించుచుండును. ఇందలి నక్షత్రములు వేగముగా ఇటునటు కదలు చుండుటచేత ఒండొంటితో తీవ్ర సంఘర్షణలు కలుగుచుండును; వేగములలో మార్పులు పుట్టుచుండును. మరియు ఒకదాని నొకటి ఆకర్షించు కొనుచుండును. వీనివలన ఈనక్షత్రముల యొక్క గతులలో— వేగములలో వ్యత్యాసము లేర్పడుచుండును. వీనిని ఫ్లక్చుయేషన్సు (fluctuations) అందురు. వీనిని ఖగోళగతి శాస్త్ర

---

* సూర్యకాంతిగాని, మరేతేజస్సుగాని ఒక సెకనుకాలములో 186,000 మైళ్ళదూరము ప్రసారమగుచున్నది. ఇంత వేగముతో ఒక సంవత్సరకాలము కాంతి ప్రయాణము చేసినచో సుమారు ఆరు లక్షలకోట్ల మైళ్ళు దూరమగును. ఈ దూరమును కాంతివత్సరము (light year) అందురు.

• ఒక మీటరు సుమారు 40 అంగుళముల పొడుగు.

రీత్యా లెక్కింపవచ్చును. చాలకాలము గడచిన వెనుక కొన్ని నక్షత్రములకు విపరీతమగు వేగము కలుగవచ్చును. అప్పుడు అవి అగుంపులోని ఇతర నక్షత్రముల యొక్క ఆకర్షణ నుండి తప్పించుకొని వెళ్ళిపో గలిగినంత శక్తికలవై యుండును. అందుచేత కొన్ని నక్షత్రములు క్రమముగా గుంపులోనుండి సడలి, వదలిపోవచ్చును. అప్పుడు గుంపునకు ఏర్పడియున్న ఆకారములో మార్పు ప్రారంభమగును. కృత్తిక క్షురాకారముగా గాక ఇతరమగు ఆకారమును పొందును. ఇట్లు అకారభేదము గోచరించుట కెన్ని ఏండ్లకాలము పట్టునను విషయము నక్షత్రగతి శాస్త్ర రీత్యా 300 కోట్ల సంవత్సరములని లెక్కింపబడినది. + రోహిణీ నక్షత్రముయొక్క ఆయుర్దాయముకూడ ఇట్లే సుమారు 300 కోట్ల సంవత్సరము లని లెక్కింపబడినది. నక్షత్రపు గుంపులతోను, సూర్యునివంటి నక్షత్రములతోను కూర్పబడిన మన నక్షత్రవీధి (galaxy—ఆకాశమందు పాలపుంతవలె గోచరించునది) యొక్క ఆకారమునకు కూడ ఇదే ఆయుర్దాయమని చెప్ప వచ్చును. ఏమనగా నక్షత్రసమూహముల ఆకారము మారగానే నక్షత్రవీధి యొక్క ఆకారములోకూడ మార్పుగలుగును. * ఇట్టి నక్షత్రవీధు లనేకములతో అమర్పబడిన విశ్వముయొక్క ఆకారమునకుకూడ,

---

+ ఈ విషయము డాక్టర్ యస్. చంద్రశేఖర్, అను హైందవ ఖగోళవిజ్ఞానవేత్తచేత 5, 6 ఏండ్లక్రిందట ప్రకటింపబడినది. ఈయన చికాగో విశ్వవిద్యాలయములోని యర్కిస్ నక్షత్రపరిశోధనాగారములో పది పండ్రెండేండ్లనుండి ఉన్నారు.

* అవయవముల ఆకారము మారినచో దేహముయొక్క ఆకారము మారినట్లు.

ఈ 300 కోట్ల కాలములోనే మార్పు కలుగవచ్చును అని, మన మూహించుటకూడ సహేతుకమేగదా. ఐనను ఈపర్యవసానమునే ధ్రువపరచు ఒకటిరెండు ఇతర ఖగోళవిషయముల గురించి తెలిసి కొనుట మంచిది.

(5) జంట నక్షత్రములు :— నూటికి పదికి తక్కువ కాకుండ, ముప్పదికి ఎక్కువకాకుండ ఖగోళమందలి నక్షత్రములలో జంట లుండును. జంటనక్షత్రములలో, ఒకనక్షత్ర మింకొకనక్షత్ర మును చుట్టితిరుగుచుండును. ఈ జంటల మధ్యగల దూరములు అనేకములుగా ఉండును. రెండింటి మధ్య ఎక్కువ దూరము గల జంటలలో, ఒకదానిచుట్టి మరియొకటి తిరుగుటకు పట్టుకాలము ఎక్కువగాను, తక్కువ దూరముగల జంటలలో తక్కువగాను ఉండును. జంటనక్షత్రమునకు చుట్టుపట్లగల ఇతర నక్షత్రములు ఈజంటలలోని నక్షత్రములను ఆకర్షించుచుండును. ఆకర్షణ రాను రాను హెచ్చిపోయి జంటలలోని ఒక నక్షత్రము తన కక్ష్యనుండి సడలుట కారంభించును. ఈ సడలింపు ప్రారంభించుటకు పట్టు కాలము సుమారు 500 కోట్ల సంవత్సరములని నిర్ణయింపబడినది.

(6) నక్షత్రవీధులు :— మనకు దగ్గరగాఉన్న ఒకనక్షత్ర వీధిలో భూమి, సూర్యుడు, నక్షత్రములు అమర్చ బడియున్నవి. నక్షత్రవీధులు విశ్వమందెన్నో కలవు. మన నక్షత్రవీధి గురించి కొంత తెలిసికొందము. మధ్యభాగములో దళసరిగాను, అంచు లకు పోనుపోను సన్నముగాను ఉండు గాజుపలక (lens) వలె

అది యుండును. దాని నిడివి కొలత లక్ష కాంతి సంవత్సరముల దూరముండును. దళసరి 20,000 కాంతివత్సరము లుండును.

O నాభి

A B 100,000 కాంతివత్సరములు

C D 20,000




ఈ నక్షత్రవీధి గాజుపలక నాభినుండి పోవు దళసరి రేఖను (C O D) చుట్టి భ్రమించుచుండును. దీని నాభి భాగమునుండి నిడివిరేఖమీదుగా 30,000 కాంతి సంవత్సరముల దూరమున, సూర్యగోళ మున్నది. సూర్యకుటుంబము, ఇతర నక్షత్రములు, ఒకసారి తిరిగివచ్చుటకు 30 కోట్ల ఏండ్లు పట్టుచున్నది. అందుచేత పదిసార్లు తిరిగివచ్చుటకు 300 కోట్ల సంవత్సరములు పట్టును. ఇంతకంటె ఎక్కువసార్లు పరిభ్రమణము చేసినచో, పరిభ్రమణ వేగముచేత ఈనక్షత్ర వీధిలోఉన్న సూర్యుడు మొదలగు గోళములు నియమితమైయున్నస్థలమునుండి చెదరిపోగలవని గణితమువలన చెప్పవచ్చును. అందుచేత ఈనక్షత్రవీధి యొక్క ఆకారములో మార్పుకలుగుటకు అధమము 300 కోట్ల సంవత్సరములు పట్టునని శాస్త్రజ్ఞులు భావించుచున్నారు.

(7) విశ్వము :— మన నక్షత్రవీధినిచుట్టి, వివిధ దూరములలో పెద్ద పెద్ద నక్షత్ర గోళరాసులు (Globular star clusters), ఇతర నక్షత్రవీధులు, నక్షత్రపుమబ్బులు (Nebulae)

ఉన్నవి. ఇంతవరకు తెలిసిన దానినిబట్టి అతి దూరమున నున్న నెబ్యులాలు 100 కోట్ల కాంతివత్సరములను మీరి లేవని అంచనా వేయబడినది.

ఈ నక్షత్రపుమబ్బులు, మన నక్షత్రవీధినుండి దూరదూరముగా పోవుచున్నట్టు గోచరించుచున్నవి. దూరమునకు పోయిన కొలది వానివేగము పెరుగుచున్నది. పదిలక్షలమైళ్ళ దూరమున నున్న నక్షత్రపుమబ్బులు, సెకనుకు 100 మైళ్ళ వేగముతోను, కోటిమైళ్ల దూరమున నున్నవి, 1,000 మైళ్ల వేగముతోను పోవుచున్నవి. దూరముఎన్నిరెట్లుపెరిగిన వేగముకూడఅన్నిరెట్లుపెరుగుచున్నది. ఈ నక్షత్రపుమబ్బులలో కాంతివంతమైనవి కొన్ని కలవు. వీనియొక్క కాంతివర్ణమాలను (spectrum), స్పెక్ట్రాస్కోపుతో పరీక్షింప వచ్చును. కాల్షియము (సున్నపు పదార్థము) వలన కలుగు కాంతివి రంగునుబట్టి గుర్తించి దానియొక్క వేవ్ లెన్గ్త్ (Wave-length) కొలువ వచ్చును. ఇట్లే సూర్యకాంతిలోని కాల్షియము రంగుయొక్క వేవ్ లెన్గ్త్ కూడ కొలువ వచ్చును. వీనిని పరీక్షింపగా నక్షత్రపుమబ్బులలోని కాల్షియము తరంగపు కొలతలు సూర్యకాంతిలోని కొలతకంటె చాల ఎక్కువ పొడవుగా నున్నవని తెలియ వచ్చినది. రంగులో భేదము లేకున్నను తరంగపు కొలతలో భేదము, కాంతినిచ్చు వస్తువుయొక్క వేగము వలన కలుగవచ్చునన్న విషయమును శాస్త్రము సాధించియున్నది. దానిని బట్టి నక్షత్రపుమబ్బు లింతింత వేగములతో మనల నుండి దూరముగా పోవుచున్నవని లెక్కకట్టబడినది. ఈ తరంగపు కొలతల వ్యత్యాసములవలన నక్షత్రపు మబ్బులయొక్క వేగము తెలిసి

కొనబడినది. ఈ వివిధ వేగములు, వివిధదూరములు, గల నెబ్యు లాలనుబట్టి విశ్వమందలి నెబ్యులాలు, నక్షత్రవీధులు ఒక దాని నుండి ఒకటి దూరముగా పోవుచున్నవని నిర్ణయింపవలసి వచ్చి నది. అందుచేత విశ్వముయొక్క వైశాల్యము పెరిగిపోవు చున్నదని (Universe is expanding) చెప్పుచున్నాము. ఈ లెక్కలను బట్టి విశ్వముయొక్క పరిమాణము 130 కోట్ల ఏండ్లలో, రెట్టింపుకు పెరుగునని తేలినది. అందుచేత ఇప్పటికి 130 కోట్ల ఏండ్లకు పూర్వము విశ్వముయొక్క పరిమాణము నేటి పరిమాణములో సగమై యున్నదన్నమాట. ఇట్లు వెనుకకు లెక్కించిన కొలది 260 కోట్ల ఏండ్ల క్రిందట నాల్గవ వంతు పరిమాణము కలిగి యుండెనని, ఇంకను వెనుకకు పోయిన కొలది విశ్వము ఇంకను కుదించబడి యుండవలెనని, చెప్ప వలసి యున్నది. ఇట్లు జరుగుటలో ఒక అవధి (Limit) యుండవలెనని, ఒక అవధి పరిమాణము కంటె సంకుచిత ముగా విశ్వమును కుదించుట యసంభవమని తోపకమానదు. ఇట్టి భావములను జాగ్రతగా పరిశీలనచేసిన శాస్త్రవేత్తలు నేటి విశ్వము అవధి పరిమాణమును 200-300 కోట్ల ఏండ్ల క్రిందట పొందియుండ వలెనని, నిర్ధారణచేసిరి. అందుచేత విశ్వము నిర్మాణమై, 300 కోట్ల వత్సరములు దాటి యుండదని నిర్ణయించవలసి వచ్చినది.

ఈ పరిశోధనా ఫలితము లన్నిటినిబట్టి చూడగా, విశ్వము లోని వివిధభాగముల యొక్కయు, విశ్వముయొక్కయు వయస్సు రమారమి 200-300 కోట్ల ఏండ్లమధ్య నున్నదని తెలియు

చున్నది. ఈవయస్సు లన్నియు ఇంతదగ్గరగా, ఒక పరిమాణ మునే కలిగి యుండుటలో నొక యద్భుతమైన సత్యమున్నదని గోచరింపకపోదు.

అయిన, 300 కోట్ల సంవత్సరములకు పూర్వము అనగా 1,000 కోట్ల ఏండ్లక్రితము విశ్వరచన ఎట్టిదై యుండవచ్చునని ఆలోచించి చూతము. అట్టి యాలోచనలో వచ్చు ఒక సమాధానము ఇట్లై యుండవచ్చును. — అంత పూర్వకాలమందు నేటి నిర్మాణము విశ్వమున కుండవీలులేదు కనుక, మరియొక తీరున విశ్వము నిర్మాణమైయుండి, అది విచ్ఛిన్నమై నేటి రీతిగ తిరిగి నిర్మాణమై ఏల యుండరాదని మనమూహింపవచ్చును. అనగా కొన్నివందల కోట్ల సంవత్సరముల కొకసారి విశ్వనిర్మాణము విచ్ఛిన్నమై నూతనముగా నిర్మాణ మేల కాకూడదని యనుకొనవచ్చును. కాని నేటినిర్మాణమునకు ప్రారంభము సుమారు 300 కోట్ల ఏండ్లైయుండవలెను. అంతకువెనుక విశ్వము ఎట్టిస్థితిలో నున్నది చెప్పజాలము. విశ్వము విస్తరించి పోవుచున్నది. కాని ఈవిస్తరణకు అవధి ఇంతయని చెప్ప వీలులేదు. విస్తరించి విస్తరించి సంకుచితమగునని (Contracts) ఒకసిద్ధాంతము కలదు. విస్తరించి విచ్ఛిన్నమైనగదా తిరిగి నిర్మాణమై యుండవచ్చు ననుకొనుట. అందుచేత విచ్ఛిన్నమవ కాలేదు, ఇదే ప్రథమ నిర్మాణమని, ఇది 300 కోట్ల ఏండ్లకు పూర్వమని చెప్పవలసి వచ్చుచున్నది. అందుచేత పై సమాధానముకాని ఇం కేసమాధానముగాని అనేక కారణములచేత అసమంజసమని, అసందర్భమని విశ్వము నిర్మాణమై 300 కోట్ల సంవత్సరములు సుమారైనదని శాస్త్రము నిర్ణయించుచున్నది.

# పంచాంగ సంస్కరణము

మన దేశమందలి పంచాగకర్తలలో సుమారు ౪౦ఏండ్ల నుండి వివాదము ఉండుట, పెద్ద సభలు జరుగుట, అధ్యక్షులు తీర్మానములిచ్చుట, తీర్మానము అమలుజరుగకుండుట, తిరిగితిరిగి ఆవిషయములే సభలలో చర్చించుచుండుట పరిపాటిగ ఉన్నదని మనకందరకు తెలిసిన విషయమే.

ఈ వివాదాలయొక్క స్వరూప స్వభావము లేమనగా, ముఖ్యముగా మూడని చెప్పవచ్చును. (౧) పంచాగములో వ్రాసిన కాలమునకు ముందో వెనుకో గ్రహణములు పట్టుట; (౨) అధికమాసము శ్రావణమా ఆషాఢమా, లేక చైత్రమా వైశాఖమా యని తర్కించుట; (౩) నక్షత్రములలోను, రాసుల లోను నవగ్రహములు ప్రవేశించు కాలములు వ్యత్యాసముగా వ్రాయుట. తిథులు, వర్జ్యకాలములు భిన్నముగా వ్రాయుట.

గోదావరి, కృష్ణ మొదలగు నదీ పుష్కర సమయములను భిన్నముగా వ్రాయుటచేత కలిగే ఇబ్బంది అందరకు బాగుగా తెలియునుగదా!

ఇట్టి భేదములకు, వివాదములకు మూలకారణములు రెండు విషయములను పురస్కరించుకొని యున్నవి. అవి పరిష్కార మైనచో ఈ భేదము అంతరింప గలవు. అవి ఏమనగా — (౧) దృక్సిద్ధపద్ధతి గ్రాహ్యమవునా కాదా? దృక్సిద్ధము శాస్త్రీయ మేనా? (౨) అయనాంశలెన్ని అనునవి. సిద్ధాంతులందరును

నిష్పక్షపాతబుద్ధితో సత్యాన్వేషణయే పరమార్థ మనుకొని, సంప్రదించుకొని తీర్మానములను ఐకమత్యముతో పాటించినచో పంచాంగసంస్కరణ సమస్య సంపూర్తి కాగలదు.

(౧) దృక్సిద్ధము :—పంచాంగములో వ్రాసిన కాలములకు సరిగా ఆకాశమందు దృశ్యములు గోచరించుట దృక్సిద్ధమనబడును. ఇది గ్రహణాదులయందు సిద్ధించుట లేదు. ఈ విషయమునకు కారణములు, సరిచేయతగిన విషయములు, మార్పులు ఎట్టివని పెక్కుసార్లు పెక్కుచోట్ల చర్చింపబడినవి. ౧౯౩౦ ప్రాంతముల నాడే శ్రీ శ్రీ శ్రీ కాంచీ కామకోటి పీఠస్వాములవారు విద్వాంసులను, సిద్ధాంతులను రప్పించి దృక్సిద్ధమే గ్రాహ్యమని నిశ్చయించినారు. లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయుడు మహారాష్ట్రమున సభలు గావించి దృక్సిద్ధమే గ్రాహ్యమని తీర్మానించినారు. మైసూరులో పదేండ్ల క్రిందట జరిగిన జ్యోతిషమహాసభలలో కూడ అట్లే తీర్మానమైనది. ఇక, మన జిల్లాలలో — రాజమహేంద్రవరమున ప్లవ సంవత్సరములోను, రౌద్ర సంవత్సరములోను, సాధారణ, క్రోధన సంవత్సరములలో విశాఖపట్టణములోను, బెజవాడలోను సభలు జరిగినవి. అన్నింటియందును దృక్సిద్ధ పద్ధతియే అనుసరణీయమని తీర్మానము లైనవి. ఈ విషయము ఇంకను చర్చించుట అనవసరము. క్రొత్త సంగతు లేమియును లేవు. ఈపద్ధతియే ఆచరింపతగినది యని గ్రహించి కూడ పంచాంగ కర్తలు కొందరు వెనుకంజవేయుచున్నారు. మరి కొందరు దృక్సిద్ధము పనికిరాదు, అశాస్త్రీయము, ప్రమాదకరమని కూడ యభిప్రాయములు వెల్లడించి గణితములను వేరుగా వ్రాయు

చున్నారు. తారణ ఉగాదిసంచికలోని సుదర్శన పంచాంగపీఠికలో ఏమని వ్రాసియున్నదో చూడండి.* ఈ భేదము లంతరించి, ఎంతత్వరలో దృక్పద్ధతి అనుసరణీయమైన అంత మంచిది; శ్రేయస్కరమున్ను.

౨) అయనాంశలు :— రవ్యాది గ్రహములు ఆకాశమున క్రాంతివృత్తము (Ecliptic) అనే మార్గములో గుండ్రముగా తిరుగుచుండును. ఈ వృత్తము కంటితో గుర్తించగల అశ్వ న్యాది ౨౭ నక్షత్రముల యాధారమునుబట్టి నిర్ణీత మగుచున్నది. ఈవృత్తము ౨౭ నక్షత్రభాగముల క్రింద ౧౨ రాసుల క్రింద విభ జింపబడెనది. ఈ క్రాంతి వృత్తమునకు ఏకాలమున ఎక్కడ నుండి ప్రారంభము? ప్రారంభస్థానము నాటినుండి నేటికెంత చలించినది? ఆచలనముయొక్క కాలత్ర్పమాణము డిగ్రీలలో, భాగలలో ఎంత? అనగా అయనాంశలెన్ని అనునది వివాదాంశము.

భూమిని ఉత్తరార్ధముగాను, దక్షిణార్ధముగాను విభజించు వృత్తమును విషువద్వృత్తమని, విషువద్రేఖయని (Equator)

---

* "సూర్యగ్రహణము ఆషాఢ బ ౩౦ ఉదయమున స్పర్శ గం. ౯-౩ మోక్షకాలము గం. ౧౧-౧౫ ఈ కాలములు సూర్యసిద్ధాంతానీతములు. పాశ్చాత్య పద్ధతిచే స్పర్శ గం. ౯-౩౦. మోక్షం గం. ౧౧-౦. పుష్య పూర్ణిమనాడు శ్రీ సూర్యసిద్ధాంతరీతిచే గ్రహణములేదు. పాశ్చాత్యపద్ధతిని స్పర్శ గం. ౮-౦ లకు మోక్షం గం. ౯-౪౨లకు. పాశ్చాత్యరీతి భారతీయులకు గ్రాహ్యము కాదు" మరియు వైదికపద్ధతి ఒకే ప్రమాణబద్ధ మని, పాశ్చాత్యపద్ధతియగు దృక్పద్ధతి ఒక ప్రమా ణము లేక ప్రతిక్షణమందు ప్రతివానిచేత మార్పు నొందునని, లోకాంతరములో ఆముష్మికసంబంధము లేనిదని, అందుచేత గ్రాహ్యము కాదనికూడ వ్రాయబడినది. ఇందలి సత్యాసత్యములు వేరే విమర్శింపనక్కరలేదని నమ్ముచున్నాను.

అందురు. ఈరేఖకు, క్రాంతి వృత్తమునకు మధ్యగల కోణము 23.5 డిగ్రీలు. ఈ రెండు వృత్తములును రెండుచోట్ల కలిసి యుండును. అనగా క్రాంతి వృత్తములో తిరుగుచు సంవత్సరమునకు రెండుసార్లు సూర్యుడు విషువద్వృత్తము మీదికివచ్చును. ఈరెండు స్థానములను సంపాతము అందురు — (ఒక వృత్తము మీద ఒకటి పడిన చోట్లు గనుక). ఈ సంపాతములలో సూర్యుడున్నప్పుడు రాత్రింబగళ్లు సమముగా నుండును. ఇట్టి సమరాత్రిన్దివములగు కాలములనే విషువత్తులు (Equinoxes) అని అందురు. అవి సంవత్సరమునకు రెండుసార్లు వసంతవిషువత్తని, శరద్విషువత్తని సంభవించు చుండును. ఒక వసంతవిషువత్తు నుండి తరువాతి వసంత విషువత్తువరకుగల కాలమునకు విషువద్వత్సరమని పేరు. ఈసంపాతస్థానములు క్రాంతివృత్తములో ఒకచోటనే యెల్లప్పుడు ఉండవు. ఒక సంవత్సరమున అశ్వనీ నక్షత్రప్రారంభమున వసంతసంపాతమైనచో రెండవసంవత్సరమున అశ్వని ప్రారంభమునకు, అనగా ప్రథమపాదములోనికి, సూర్యుడు రాకుండగనే, రేవతి చివరభాగములోఉండగనే, అశ్వనీప్రారంభము ఇంకను 50 సెకన్ల దూర ముండగనే విషువత్తు వచ్చును. అందుచేత యీసంపాతస్థానము సంవత్సరమునకు 50 సెకన్లు క్రాంతి వృత్తములో వెనుకకు - అశ్వనినుండి రేవతిపైపునకు - చలించునని చెప్పఁదము. దీనినే అయనగతి (Precession of the equinoxes) యని అందుము. ఈగతి ప్రకారము సంవత్సరమునకు ౨౦ నిమిషములవంతున ౭౨ యేండ్లకు ఒకరోజు

చొప్పున, అనగా రమారమి ఒకడిగ్రీ చొప్పున సంపాతము వెను కకు పోవును. ఒకరోజు ముందే విషువత్తు సంభవించును. ఇట్లు అశ్వన్యాది నక్షత్రములలో ౭౨ యేండ్లకు ఒకభాగ (డిగ్రీ) చొప్పున ఆయనాంశలు గలుగుచుండును. "తురగముఖాశ్వనీ త్రిణీ" అని చెప్పబడు అశ్వనినక్షత్రము ఆకాశమందు స్థిర ముగా ఉండును. అట్లే ౨౭ నక్షత్రములును, ౧౨ రాసులును స్థిరములు. క్రాంతి వృత్తమునందు చలింపవు. అందుచేత సూర్యుడు రాసులలో ప్రవేశించు సంక్రమణకాలములు, నక్షత్రము లలో ప్రవేశించు కాలములగు కార్తెలు స్థిరములు. ఇవి యానము లేనివి గాన నిరయనములు అని చెప్పబడుచుండును. రాత్రి, పవలు సమముగా ఉండు రెండు విషువత్పుణ్యకాలములు, మిక్కిలి తక్కువ అహస్సుగల దినమున సంభవించు ఉత్తరాయణపుణ్య కాలము, మిక్కిలి యెక్కువ అహస్సుగల నాడు వచ్చు దక్షిణా యన పుణ్యకాలమును—ఈ నాలుగును - చలించు స్వభావముగలవి, ఆయనసంబంధములు. అందుచేత సాయనములని చెప్పబడు చున్నవి. కనుక పంచాంగగణితమందు నిరయనమని, సాయన మని రెండు పద్ధతులు గలవు. ముహూర్తభాగము, జాతక భాగము, ఉత్సవములు, పండుగలు మొదలైన వెన్నో నిరయన పద్ధతినే నిర్దేశింపబడుచున్నవి, అందుచేత పంచాంగవిషయము లలో పాశ్చాత్యులవలె మనము కేవలము సాయనపద్ధతి నవలంబింప వీలులేకున్నది. మతము, సంప్రదాయము, ఆచారము, తిథులు, తీర్థములు, ముహూర్తములు, జాతకములు వీనిని పాటింప నవసరము లేకున్నయెడల, లేక వీనినిగూడ సాయన

పద్ధతికి మార్చుకొనగలిగినయెడల కేవలము సాయనము ననుస రింపవచ్చును. కాని అది దుర్ఘటము,

అయనాంశ లెన్ని? అనునది కదా ముఖ్యమైన విష యము. అయనాంశలు శూన్యముగ నున్న కాలమును నిశ్చయిం చినగాని దీనికి సమాధానము తేలదు. ఈ నిశ్చయము బహుక్లిష్ట మైనది. ఇదమిత్థమని తేల్చుటకు వీలులేనిది. ౧౯౩౩ సంవత్స రములో హిందూపత్రికలో నీ చర్చ 6 మాసములు జరిగినది. ఏమియును తేలలేదు. చిత్రానక్షత్రపద్ధతి యని, రేవతీపక్షమని యీ నిర్ణయమున రెండు మార్గము లున్నవి. చిత్రాపక్షవాదులే హిందూదేశమందు హెచ్చుగా నున్నారని, ఆవాదమే బలీయమైన దని చెప్పవలెను. ఈ చిత్రాపక్షమునకూడ అనేక సిద్ధాంతవాక్య ముల నాధారము చేసికొని లెక్కకట్టగా వివిధములగు అయనాం శలు తేలుచున్నవి. మన ప్రాంతములలో ముఖ్యమైన సిద్ధాంతులు కొందరు 22°-6′ అయనాంశలని, మరికొందరు 22°-56′ అని ప్రమాణములను జూపించుచున్నారు. ప్రమాణములుగా గ్రహించు సిద్ధాంతములయందలి ఆధారవాక్యములలోని వ్యత్యాసములవలన, వానికి చేయు వ్యాఖ్యానములవలన నీ భేదములు కలుగుచున్నవి. కనుక అందరు ఏకీభవించి యేదో ఒక పద్ధతి అనుసరించి అయ నాంశలు ఇన్ని అని అనుకొనుటతప్ప వేరు మార్గము లేదు. ఈ నిర్ణయము చేయునపుడు అఖిలభారతదేశము ఏకీభవించి చేయుట అత్యుత్తమము. అట్టిపని శీఘ్రకాలమున జరుగుగాక.

ఈ సందర్భములో ఒక విషయము చెప్పవలసియున్నది, అయనాంశ నిర్ణయము నేడు పుట్టినదికాదు. ప్రాచీను లెరిగి, నిర్ణ

యించి, వ్యవహరించినదే. ధర్మసింధుసారములో ప్రథమపరి చ్ఛేదములో నిట్లున్నది: "అయనాంశా జ్యోతిశ్శాస్త్రే ప్రసిద్ధాః తేచ ఇదానీం ద్వాదశాధికసప్తదశ శతసంఖ్యాకే (౧౭౧౨) శాలి వాహనశకే ఏకవింశతి రయనాంశాః ఇతి ఏకవింశతితమే దినే పూర్వం అయనాంశపుణ్యకాలః ఇతిపర్యవసన్నో అర్థః. ఏవం న్యూనాధికశకే ఊహ్యం" అనగా ౧౭౧౨ శాలివాహన శకము నాడు అయనాంశలు ౨౧. అందుచేత నేటి అయనాంశలు 23°–8′ అని తేలుచున్నది. కనుక అందరు కలిసి ఒక పద్ధతిని గ్రహించి అయనాంశలు నిర్ణయించుకొనుట అత్యవసరము.

పంచాంగములు గుణించుపద్ధతి :— దృక్సిద్ధపద్ధతి అంగీకరించి అయినాంశలు తేల్చిన తరువాత పంచాంగ గణితపద్ధతి యెట్లుండ వలెననునది ముఖ్యమైన విషయము. ఇందు భిన్నాభిప్రాయములు కలవు. (౧) పూర్వసిద్ధాంతములను — ముఖ్యముగా సూర్యసిద్ధాంత మును — అవలంబించి, అవసరమైనచోట్ల సంస్కరించుకొని, బీజములను కల్పించుకొని దృక్సిద్ధి యగునట్లు గణితమును చేయుట. ఇది చాలా కష్టసాధ్యము. ఏలననగా సూర్యసిద్ధాంతము దురవగాహము. సోపపత్తికముగా దానిని సంస్కరించుట దుర్లభ మేమో. (౨) కేట్కర్ వ్రాసిన జ్యోతిర్గణితము ననుసరించి పంచాంగము చేయుట రెండవ పద్ధతి. ఈపద్ధతిని గుణించిన పంచాంగములు మహారాష్ట్ర దేశమందు, దక్షిణాదిని, ఈన ప్రాంత ములందు నేడు కలవు. అందలి గణితము నాటికల్ ఆల్మనాక్‌తో సరిపోవుచున్నది. బాగుగా దృక్సిద్ధ మగుచున్నది. ఈపద్ధతి ననుస రించుట అన్నివిధముల మంచిది.

నేను పంచాంగములు గుణించువారు తర తరములనుండి వచ్చు పద్ధతుల ననుసరించి, సూక్ష్మమార్గములను బట్టునట్టి, ఉపపత్తిలేనట్టి కరణగ్రంథముల ననుసరించుచున్నారు. ఈపద్ధతిలో దృక్సిద్ధికై అప్పుడప్పుడు బీజములను (Corrections) కల్పించుకోవలెను. కాని అట్లు చేయుటలేదు. చేసినను అది సోపపత్తికముగాక లెక్కసరిపెట్టుటకై కల్పించినది గనుక అంత యవలంబనీయము గాదు. జ్యోతిర్గణితము సోపపత్తికము. దాని నవలంబించినచో సిద్ధాంతులకు గణితము విమర్శగా తెలియుట ఉపపత్తులను తెలిసికొనుట, ప్రాతపద్ధతులలోని లోటుపాట్లను గుర్తించుట మొదలగు అనేకలాభము లుండును. జ్యోతిషసిద్ధాంత విజ్ఞానము ప్రబలును. సిద్ధాంతులలో, దేశములో నిరుపమాన మగు వికాసము సర్వతోముఖముగా వ్యాపింపగలదు.

౨

ఋతువుల నిర్ణయము, సంవత్సరాది:— తపస్ తపస్యమాసములు శిశిరఋతువని, మధు మాధవమాసములు వసంతమని, శుక్ర శుచి మాసములు గ్రీష్మమని నభస్ నభస్యలు వర్షర్తువని ఈషో ఊర్జలు శరత్తని, సహస్ సహస్యలు హేమంతమని వేదమందు ఋతువులు చెప్పబడినవి. పేర్లయొక్క వ్యుత్పత్త్యర్థమును పరిశీలించినచో కాలధర్మమునుబట్టి ఋతువులకు, ఆధర్మములందలి శేషచ్ఛేదముల ననుసరించి ఋతువులోని మాసములకును పేర్లుపెటినటు స్పష్టమగుచున్నది.

దక్షిణాయనకాలమందు (June 21) గ్రీష్మము హెచ్చుగా నుండుట, ఉత్తరాయణమురోజులలో (December 22) చలి హెచ్చుగానుండుట అనుభవసిద్ధము.* అందుచేత ఋతువులు అయనసంబంధములని స్పష్టము. మనము సాధారణముగా మాఘ ఫాల్గుణములు శిశిరఋతువని, చైత్రవైశాఖములు వసంత మని చెప్పుచున్నాము. దీనిని విమర్శించుదము. చిత్తానక్షత్రయుక్త పూర్ణిమగలది చైత్రమని, విశాఖనక్షత్రయుక్త పూర్ణిమగలది వైశాఖమని, ఇట్లే తక్కిన మాసములకు పేర్లు కలిగినవని మన మెరుగుదుము. చిత్తనక్షత్రమును (spica) ఆకాశమందు మనము గుర్తింపగలము. తులారాశికి ప్రారంభ మదే యని సిద్ధాంత ములు చెప్పుచున్నవి. ఇట్లే తక్కిన నక్షత్రములును ఆకాశమందు స్థిరములు. అట్టి స్థిరనక్షత్రసంబంధముచేత ఏర్పడిన మాసములు నిరయనములు. కాని కాలధర్మమునకు సంబంధించిన ఋతువులు సాయనములు. అందుచేత సాయనములగు ఋతువులను నిరయన ములగు చైత్రమాసాదులచేత పేర్కొనుచున్నాము. ఇది ఎంత అసందర్భమో చూడుడు. ఋతువులు సాయనములు గనుక నిర యనములగు చైత్రవైశాఖాదిమాసములలో వెనుకకు చలించుట స్వభావము. గనుక ఋతువులను నిరయనమాసములతో గాక

---

* భూమియొక్క ఉత్తరార్ధమం దీరీతిగా నుండును. దక్షిణార్ధమందు తల క్రిందుగా నుండును. అనగా మనకు దక్షిణాయనమైనప్పు డక్కడ ఉత్తరాయణము. మనకు గ్రీష్మమైనచో వారికి చలిగా ఉండును. రెండు భాగములయందును విషువ ద్వృత్తమునకు ౩౦–౪౦ డిగ్రీల దూరమువరకే ఈ ఋతువిభాగము పాటింపనగును. అంతకు ఎక్కువగా ఉత్తరమునగాని, దక్షిణమునగాని వెళ్లినచో ౬ ఋతువులు క్రమముగా ౪, ౩, ౨ క్రింద సంకుచితమైపోవును.

సాయనమాసములతో సంబంధముచేసి చెప్పుటయే సమంజసము. అట్లు కానినాడు ఏమిజరిగినదో ఏమిజరుగనున్నదో చూడుడు.

చైత్రవైశాఖమాసములు వసంత ఋతువను పద్ధతి వేదాంగ జ్యోతిష, భారతకాలములనుండి ఉన్నట్లున్నది. భారతకాలము నుండి నేటికి ౩౦ అయనాంశ లనుకొందాము. అలాగైన మాస ములలో ఋతువులు ౩౦ దినములు వెనుకకు చలించియుండవలె. కాలానుసరణముగా ఋతువులు మాసములలో వెనుకకు పోవు చున్నట్లు అనేక నిదర్శనములు గలవు. అది అనుభవసిద్ధము కూడాను. లోకరీతి, లోకానుభవము ఎట్లుండునో దానినే ఇంచు మించుగా కవులు వర్ణించుట స్వభావమేకదా. "చలి ప్రవేశించు నాగులచవుతినాడు...." అన్నాడు శ్రీనాథుడు కాశీఖండములో. నేడు కార్తీకశుద్ధచవుతే నాగులచవితి. దీనినిబట్టి కార్తీక మార్గశీర్ష ములు హేమంత మని చెప్పవలసి యుడును. అనగా ఋతువులు ఒక మాసము వెనుకకు నడిచినవన్నమాట.

"ఆషాఢస్య ప్రథమదివసే మేఘ మాశ్లిష్టసానుమ్" అన్నాడు కాళిదాసమహాకవి. దీనినిబట్టి ఆషాఢశ్రావణములు వర్ష ఋతు వనవలె. ఈ లెక్కకూడా ఒకమాసము వెనుకకే పోవుచు న్నది. ఇట్లే అనేక నానుడులవలన ఋతువుల చలనము గ్రహించ వచ్చును.* కాళిదాసు కాలమునాటికి ౩౦ దినములు–ఒకమాసము–

---

* ౧. "ఆషాఢశుద్ధపంచమ్యాం వచ్చెనే వృద్ధగౌతమీ" ౨. "మహాలక్ష్మి పండుగులకు మాడంతచలి." (౧) దీనివలన పైన సూచించిన భావమే కలుగు చున్నది. (౨) మహాలక్ష్మిపండుగు లనగా దేవీనవరాత్రి పండుగలు. ఇవి నాగుల చవుతికంటె ౧౫–౨౦ దినములకు పూర్వమే వచ్చును. గాన ఈ నానుడివలన నేటి స్థితి తేటతెల్లమగుచున్నది.

ఋతువులు వెనుకకుపోయినచో ఇప్పటికి కాళిదాసుకాలముసుమారు ౧౫౦౦ సంవత్సరముల క్రిందటిది గనుక, సుమారు ఇంకొక ౨౦ దినములైనను ఋతువులు వెనుకకు వెళ్ళియుండును. అనగా మొత్తముమీద ౫౦ దినములు వెనుకకన్నమాట. ఇది సరిగానే ఉన్నది. భారతకాలము నుండి నేటికి అయనాంశలు ౫౦ అనిగదా లెక్క. అందుచేత ఆనాటి శిశిరము మాఘ ఫాల్గుణములలో ఐతే ఈనాడు శిశిరము మార్గశిరపుష్యములలో అగును. వసంతఋతువు మాఘఫాల్గుణములలో అగును. కాని ఈఋతు చలనమును గ్రహించక పోవుటచేత అనుభవముచేత వసంతమైన ఋతువును శిశిరమనియే కాకుండ ఇంకను కొంతకాల మగుసరికి నిజముగ వసంతమై యున్న దానిని హేమంతమని యందుము. ఇది ఎంత హాస్యాస్పదమో చూచితిరా? అందుచేత సంస్కార మత్యావశ్యకము.

ఈసందర్భములో ఋతువుల నిర్ణయించుటయందు, సంవత్సరాదిని నిర్ణయించుటయందు ప్రాచీనుల సంప్రదాయ మెట్టిదో తెలుపుటకై కొన్ని వివరములను వ్రాయుచున్నాను.

ఋతువుల చాంద్రమాసములతోగాక కార్తులతో నిర్వచనముచేయు ఆచారముకలదు.

"ధనిష్ఠాద్యాత్ పౌష్ణార్ధాంతం చరత శ్శిశిరః
వసంతః పౌష్ణార్ధాత్ రోహిణ్యంతం
సౌమ్యాదాశ్లేషార్ధాంతం గ్రీష్మః
ప్రావృ డాశ్లేషార్ధాత్ హస్తాంతం

చిత్రాద్యాత్ జ్యేష్ఠార్ధం శరత్
హేమంతో జ్యేష్ఠార్ధాత్ వైష్ణవాంతమ్"

(పరాశరసంహిత ౧)

ధనిష్ఠ ప్రథమపాదముతో శిశిరము ప్రారంభమః ఆక్కడనుంచి 4½ కార్తుల చొప్పున ఋతువులు క్రమముగ లెక్కించవలెనని దీని యర్థము.

మరియు,

" మాఘాద్యుపక్రమ స్తతోఽయనారంభాత్ " (౨)
మాఘశుక్లప్రపన్నస్య పౌషకృష్ణ సమాపినః
యుగస్యపంచవర్షస్య కాలజ్ఞానంప్రచక్షతే"(౩)

ఈ (౨), (౩) వాక్యములవలన మాఘమాసారంభమున ఉత్తరాయణ ప్రవేశమని, సంవత్సరారంభమని కూడ తెలియు చున్నది, పరాశరవాక్యమునుబట్టి ధనిష్ఠాదిశిశిరాది యని తేలు చున్నది. వీటి పరస్పరసంబంధమును చూడుడు.

మాఘశుద్ధపాడ్యమినాడు ధనిష్ఠ నక్షత్రమని, అందులో సూర్యచంద్రులు కలసియున్నారని అనుకొందము. పాడ్యమి నుండి ౧౫వ రోజు పూర్ణిమ; ధనిష్ఠనుండి ౧౫వ నక్షత్రము మఘ, అందుచేత ఆ పూర్ణిమ మాఘపూర్ణిమ. అందుచేత మాఘాది ధనిష్ఠాది. అదియే యుగాది. అదే శిశిరారంభము; ఉత్తరాయన ప్రవేశకాలముకూడ. ఇట్లు మూడు వాక్యములవలన అర్థము

సమన్వయమగుచున్నది. ఇట్టికాల మేది యని విమర్శించగా వేదాంగ జ్యోతిషకాలమని తెలుచున్నది. ఎట్లనగా—

పరాశరవాక్యమునుబట్టి ఆశ్లేషార్ధమందు సూర్యుడుండగా గ్రీష్మ మంతమగుచున్నదని స్పష్టము. అది ఉత్తరాయణమునుండి మూడు ఋతువులు-ఆరుమాసములు-గతించిన కాలముగదా. గనుక ఆశ్లేషార్ధమందు దక్షిణాయన మని స్పష్టము. వరాహమిహిరాచార్యుడు పూర్వశాస్త్రమగు వేదాంగజ్యోతిషమందు దక్షిణాయనము ఆశ్లేషార్ధమం దగుచుండెడిది యని చెప్పియున్నాడు,* తనకాలమందు రెండువిషువత్తులు, రెండు అయనములు ఎప్పుడు తటస్థించుచున్నవో ప్రత్యక్షపరీక్ష చేసి చెప్పియున్నాడు. ఈప్రక్క పట్టికలో ఈకాలభేదములు చూపబడినవి.

* "ఆశ్లేషార్ధా దాసీద్యదా నివృత్తిః కిలోష్ణ కిరణస్య, యుక్త మయనం తదాసీత్ సాంప్రతమయనం పునర్వసుతః"

## ౧. పట్టిక

| అయనములు విషువత్తులు | ప్రవేశకాలము | |
|---|---|---|
| | వేదాంగ జ్యోతిషకాలమందు I | వరాహమిహిరుని కాలమందు II |
| (౧) ఉత్తరాయణము | సూర్యుడు ధనిష్ఠ ప్రథమములో ప్రవేశించుచుండగా | ఉత్తరాషాఢా ద్వితీయములో (మకరాదిని) |
| (౨) వసంత విషువత్తు | ,, భరణి చతుర్థములో .... | అశ్వినీ ప్రథమములో (మేషాదిలో) |
| (౩) దక్షిణాయనము | ,, ఆశ్లేషాద్వితీయములో .... | పునర్వసు చతుర్థములో (కర్కాటకాదిలో) |
| (౪) శరద్విషువత్తు | ,, విశాఖా ప్రథమములో .... | చిత్తా ద్వితీయములో (తులాదిలో) |

(I) వ కాలమునుండి (II) వ కాలమునకు అయనము ఏడు నక్షత్రపాదములు చలించినట్లు పైపట్టిక తెలుపుచున్నది. రెండుకార్తులు - ౯నక్షత్రపాదములు - సూర్యుడు నడచుటకు ౨౭ దినములు పట్టును, గనుక ౭ పాదములకు సుమారు ౨౪ దినములు పట్టును. అందుచేత ఈ రెండుకాలములకు సుమారు ౨౪ × ౭౨=౧౮౦౦ సంవత్సరముల అంతరమున్నది,

వేదాంగ జ్యోతిషకాలమునకు ప్రాచీనమగు బ్రాహ్మణముల కాలములో వసంతవిషువత్తుభరణి ౪ వ పాదమున కాక కృత్తిక యందు సంభవించుచుండవలెను. "ముఖం వా ఏతన్నక్షత్రాణాం యత్కృత్తికా" అని తైత్తిరీయ బ్రాహ్మణవాక్యము. నక్షత్రఇష్టి చేయునప్పుడు ప్రారంభము కృత్తికతో ఉండును. నక్షత్రములకు కృత్తిక ముఖమని చెప్పబడియున్నది. దీనినిబట్టి ఏనక్షత్రములో వసంతవిషువత్తు సంభవించునో అది నక్షత్రములకు ముఖముగా ఎన్నబడిన దన్నమాట. అనక్షత్రముతో నక్షత్రములను లెక్కబెట్టెడివా రన్నమాట. జాతకభాగమందు జననకాల మహాదశ కట్టునప్పుడుకూడ 'కృత్తికాది క్రమేణ' దశలు లెక్కబెట్టమని చెప్పబడియున్నది. అందుచేతనే వరాహమిహిరాచార్యుడు తన కాలమందు వసంతఋతువు అశ్వనిలో సంభవించుటచేత పూర్వ సంప్రదాయానుసరణముగా అశ్వన్యాదిగా నక్షత్రములను లెక్కబెట్టినాడు. నేడు వసంత విషువత్తు ఉత్తరాభాద్ర ౨ పాదమున ఉన్నది గనుక ఉత్తరాభాద్రతో అరంభించి నక్షత్రములు నేడు లెక్కపెట్టవలెను.

వరాహమిహిరాచార్యుడు అశ్వనితో నక్షత్ర ప్రారంభము చేయుటయేగాక ఆ అశ్వనిలో ఉండే వసంతవిషువత్తుతో సంవత్సరముకూడ ప్రారంభించినాడు. అనగా పూర్వాచారమగు ఉత్తరాయణముతో గాక తరువాత మూడు మాసములకు వచ్చు విషువత్తుతో ఉగాది చేసినాడు. ఈనూతనపద్ధతిని వేదాంగ జ్యోతిషకాలమందు వత్సరాది చేసి యుండినచో మాఘ

ముతో మూడు మాసములు గతించిన వైశాఖముతో సంవత్సర మారంభమైయుండెడిది. అనగా వసంతమధ్యమున ప్రారంభమయి యుండెడిది. వరాహమిహిరుని కాలమునకు ౨౩ అయినాంశలు, అనగా రమారమి ఒక మాసముగాన వసంతమధ్యము వైశాఖ ప్రారంభమున నుండక వెనుకకు ఒక మాసము చలించి చైత్ర ప్రారంభమున ఉండినది. అందుచేత వరాహమిహిరుడు చైత్రముతో ఉగాదిచేసి సంస్కరించినాడు. అటు తరువాత నేటికి ౨౩ అయినాంశలైనను సంస్కరించక మనమున్నూ చైత్రముతోనే ఉగాది లెక్కబెట్టుచున్నాము. ఇది సంస్కరణీయమగు విషయము.

పైన చెప్పిన రెండు పద్ధతులకు భిన్నముగా ఉగాది రామాయణకాలమందు వైశాఖమాసముతో వసంతఋతు ప్రారంభముతో చేయబడినట్లు కనబడుచున్నది. ఈ విషయమును పరిశీలించగా రామాయణ కాలమందు చైత్రవైశాఖమాసములు వసంతఋతువు అను వ్యవహారము రాలేదని స్పష్టమగుచున్నది.

బాలకాండ ౧౮ వ సర్గలో ఇట్లున్నది :

"తతో యజ్ఞే సమాప్తేతు
ఋతూనాం షట్ సమత్యయుః" (౧)

"తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ
నక్షత్రే దితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునాసహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్ (౨)

చైత్రము ౧౨-వ మాసమని యనుటచేత వైశాఖముతో సంవత్సరారంభ మగుట నిశ్చయము. వ్యాఖ్యానములో ఈరీతిని వ్రాయబడినది : "అశ్వమేధమునకు పూర్వము మీమాంసానుసారము, కల్పసూత్రానుసారము అశ్వగమనక్రమ మెట్లనగా అశ్వమును విడిచినతరువాత ౧౧ మాసములు చనగా అశ్వమును తెప్పింపవలెను. ఫాల్గుణామావాస్యయందు ఋత్విజులతో శాల యందు యజమానుడు ప్రవేశించి, చైత్రశుక్లప్రతిపత్తు మొదలుగా నశ్వమేధము నారంభింతురు." అనుటచేత ౧౩-వ మాసమగు చైత్రములో యాగము జరుగునని, అమావాస్యతో పూర్తయినదని చెప్పవలెను. యజ్ఞసమాప్తితోపాటు ఋతువులుకూడ సమాప్తిపొందినవని (౧) వాక్యములో ఉండుటవలన వైశాఖ ప్రారంభమే ఋతువులకు ప్రారంభమని కూడ తెలియుచున్నది. వైశాఖాది, వసంతాది, ఉగాది నావొకటి యని తెలియుచున్నది, మరియు ఆ యజ్ఞము జరిగిన తరువాత (తత్కాల, ఉగాదియైనతరువాత, ౧౨-వ మాసమగు చైత్రమందు శుద్ధనవమినాడు శ్రీరామచంద్రులు వారు పుట్టిరనుట సమంజసమేగదా.

ఈ మూడు పద్ధతులకు భిన్నముగా నాల్గవ పద్ధతిని ఋతువులు, సంవత్సరము ప్రారంభింపబడుచుండి నట్లు కనిపించుచున్నది. శాస్త్రవిషయములగు అయనములతోను, విషువత్తులతోను సంబంధము లేకుండ, జనసామాన్యులగు వ్యవసాయకులయొక్క, విజయోత్సాహులగు రాజులయొక్క సౌకర్యములను బట్టి ఈనూతన పద్ధతి ఎర్పాటు చేయబడినట్లు తోచుచున్నది. ఈ క్రింది వాక్యములను పరిశీలింతము.

"ఆద్యాయ మార్గశీర్షాచ్చ
ద్వౌద్వౌ మాసా దృతు స్సత్రృతః" (౧)

"హేమంతాద్ధి వత్సర స్యారంభః" ఇతి కాత్యః (౨)

"షడమీ ఋతవః పుంసి
మార్గాదీనాం యుగ్మైః క్రమాత్ (౩)

"ద్వౌద్వౌ మార్గాదిమాసౌ స్యాదృతుః" (౪)

"మార్గశీర్షే సహామార్గ ఆగ్రహాయణికశ్చ సః". (౫)

ఈవాక్యములు అమరములోను, క్షీరస్వామి వ్యాఖ్యానములోను చెప్పబడియున్నవి. వీటిని బట్టి మార్గశీర్ష మాసముతో, హేమంతఋతువుతో సంవత్సరారంభ మయేదని స్పష్టము. ౫ వ వాక్యమునుబట్టి సంవత్సరారంభమున నూతనధాన్యముతో హవిర్యాగము చేయుటచేత అగ్రమందు హాయనము గలది 'ఆగ్రహాయణి' యని చెప్పవలసియున్నది.* దీనినిబట్టి వత్సరాదికి పంటలు కోతకు వచ్చియుండెడివని, వ్యవసాయకుల కుత్సాహసమయ మని స్పష్టము.

మరియు స్ఫీతసస్యసుఖకాలమే కాకుండ, జలకాష్ఠౌషధ సమృద్ధి గలిగి, విష్పంకమగు భూమి కలిగి అల్పమక్షికమై, సమ శీతోష్ణకాలమై విజయయాత్రకుసుఖదమగు శరదంతమును, హేమం

* కొత్తగడ్డితో తోరణమును గట్టి 'జ్వాలాతోరణ' మను ఉత్సవమును దేవాలయములందు చేయు సంప్రదాయము నేడున్నది. ఇది తత్సంబంధ విషయమై యుండవచ్చును.

త్ప్రారంభమునుఅగుకాలము సంవత్సరారంభముచేయుట కెంతయు తగియున్నదని చెప్పనక్కరలేదు. ఈవిషయమే మహాభారతమం దుద్యోగపర్వమున ఇట్లు చెప్పబడియున్నది :

" కౌముదే మాసి రేవత్యాం శరదంతే హిమాగమే
స్ఫీతసస్యసుఖే కాలే కల్యః స్సత్త్వవతాం వరః ''

'' బ్రూయాః కర్ణ ఇతో గత్వా ద్రోణం శాంతనవం కృపమ్
సౌమ్యోయం వర్తతే మాసః సుప్రాపయవసేంధనః

సర్వౌషధివనస్ఫీతః ఫలవా నల్పమక్షికః
నిష్పంకో రసవత్తోయో నాత్యుష్ణః శిశిర స్సుఖః "

'కౌముదేమాసి....శరదంతే' యనుటచేత మార్గశీర్షపుష్య మాసములు హేమంతమని, ఆశ్వయుజ కార్తీకములతో శర దంత మైనదని తెలియుచున్నది. అందుచేత నేటి చైత్రవైశాఖ ములు వసంతము అను వ్యవహారము భారతకాలమునుండి యున్న దని స్పష్టము. కాని రామాయణకాలములో వైశాఖజ్యేష్ఠములు వసంతమనిగదా పైన చెప్పియుంటిని. రామాయణ కాలము నుండి భారతకాలమునకు అయనాంశలు ౩౦ అని చెప్పవలెను. రెండుకాలముల మధ్యకాలము సుమారు ౨౦౦౦ సంవత్సరము లని లెక్క తేలుచున్నది.

ఈ నాలుగు పద్ధతులలోను ఋతువులు, సంవత్సరము కూడ ఒకచోటనుండియే ప్రారంభమగుచున్నట్లు తెలియుచున్నది.

౨. పట్టిక

| ఋతువులు | రామాయణకాలము | భారతకాలము | వరాహమిహిరుని కాలము | నేడు |
|---|---|---|---|---|
| వసంతము | వైశాఖ, జ్యేష్ఠములు | చైత్ర, వైశాఖములు | ఫాల్గుణ, చైత్రములు | మాఘ, ఫాల్గుణములు |
| గ్రీష్మము | ఆషాఢం, శ్రావణం | జ్యేష్ఠం, ఆషాఢం | వైశాఖం, జ్యేష్ఠం | చైత్రం, వైశాఖం |
| (ప్రావృట్) వర్షకాలము | భాద్రపదం, ఆశ్వయుజం | శ్రావణం, భాద్రపదం | ఆషాఢం శ్రావణం | జ్యేష్ఠం, ఆషాఢం |
| శరత్తు | కార్తికం, మార్గశిరం | ఆశ్వయుజం, కార్తికం | భాద్రపదం, ఆశ్వయుజం | శ్రావణం, భాద్రపదం |
| హేమంతము | పుష్యం, మాఘం | మార్గశిరం, పుష్యం | కార్తికం, మార్గశిరం | ఆశ్వయుజం, కార్తికం |
| శిశిరము | ఫాల్గుణం, చైత్రం | మాఘం, ఫాల్గుణం | పుష్యం, మాఘం | మార్గశిరం, పుష్యం |
| వసంత విషువత్తు ఎప్పుడును వసంత ఋతుమధ్యముననే సంభవించును. | జ్యేష్ఠాదిని June 13 | వైశాఖాదిని May 13 | చైత్రాదిని April 13 | ఫాల్గుణాదిని March 13 |

అదే సంప్రదాయపద్ధతి. మరియొక సంప్రదాయ మేమనగా కాలానుగుణముగా ఋతువులను చైత్రాది మాసములలో వెనుకకు జరిపి లెక్కించుట. ఈ పై పట్టికలో ఋతువులను చాంద్రమాసములో ఎట్లు రామాయణ కాలమందు, భారతకాలమందు, వరాహమిహిరు కాలమందు లెక్కబెట్టినారో, అందుచేత మన మీనాడు ఎట్లు లెక్కించవలెనో చూపబడియున్నది. ఈరీతిని మార్చుట కర్తవ్యము.

౨ వ పట్టికలో చాంద్రమాసములతో ఋతువులను లెక్కించుట చూపబడినది. చాంద్రసౌరమానములు తేడాగలవి గనుకను, ఆ తేడాను ౧౯ ఏండ్లకు ౭ అధికమాసములను వేసి సరిపుచ్చెదము గనుక చాంద్రమాసములు సౌరమాసములలో - ఇంగ్లీషుమాసములలోను- ఎగుడుదిగుడుగా వచ్చుచుండును. * అందుచేత సౌరమాసముల నుపయోగించుట మంచిది ఋతువులు సాయనములు గనుక సాయనసౌరమాసముల నుపయోగించినచో ఏతేడాలు లేకుండ ఎల్లప్పుడును ఉండును. మకరాయనము నుండి కుంభాయనము వరకు సాయనమకరమాసము. ఇట్లే ఇతరసాయన సౌరమాసములు లెక్కించుట. అందుచేత సాయనమకర కుంభమాసములు శిశిరఋతువని, సాయనమీనమేషములు వసంతమని లెక్కించిన ఏతేడా లేక సరిపోవును. ఇట్లు చేసినచో నేడు డిసెంబరు ౨౨ నుండి ఫిబ్రవరి ౨౧ వరకు శిశిరఋతువు, ఫిబ్రవరి ౨౨- ఏప్రిలు ౨౧ మధ్య వసంతఋతువు అగును. ఇట్లే సంవత్సరాదిని కూడ సాయనము చేయవలెను. వసంతఋతుమధ్యమగు సాయన మేషాదినాడు (నేటి మార్చి ౨౧) సంవత్సరారంభము చేయవలెను. మేషాయన మేచాంద్రమాసమున ఏతిథినాడైన నాడే సంవత్సరాది. ఈ పద్ధతిని గతించిన ఫాల్గుణబహుళ ద్వాదశినాడు సంవత్సరాదియై

---

* చిత్రభానులో చైత్రశుద్ధపాడ్యమి మార్చి ౧౭ తే ౧౯౪౨

సుభానులో ,, ,, ఏప్రెల్ ౫ తే ౧౯౪౩

తారణలో ,, ,, మార్చి ౨౫ తే ౧౯౪౪

పార్థివలో ,, ,, ,, ౧౫ తే ౧౯౪౫

చిత్రభానులో ఒక అధికమాసము వచ్చినది. పార్థివలో రానైయున్నది.

యుండెను. రాబోవు సంవత్సరాది చైత్రశుద్ధ సప్తమినాడు కాగలదు. ఇంకొకసారి ఫాల్గుణశుద్ధ పౌర్ణమీ ప్రాంతముల యందు కావచ్చును.

ఈ పైన సూచించిన విషయము లన్నింటిని విద్వాంసులు, సిద్ధాంతులు, మహాజనులు విమర్శించి, చర్చించి యుక్తమగునట్లు అచిరకాలములో పంచాంగములను సంస్కరించుదురని నమ్ము చున్నాను.

## ఉన్నత విద్యా లక్ష్యము

నేటి ప్రపంచస్థితి చాల అల్లకల్లోలముగాయున్నది. ౨౫ సంవత్సరములలో రెండుప్రపంచ మహాసంగ్రామములు సంభవించి నవి. మొదటిదానికంటె రెండవది ఎక్కువ భయావహమై లోక భయంకరమై యుండెను. యుద్ధసమాప్తియైనను శాంతి సూచనలు కనుపట్టుటలేదు. మూడవయుద్ధమునకు సూచనలు గోచరించుచున్నవి. తిరిగి యుద్ధమే తటస్థించినచో నాగరకతయంతయు నిర్మూలముకాక తప్పదని బుద్ధిమంతు లందరు ఊహించుచున్నారు. ఇట్టి పరిణా మమునకు కారణ మేమని అన్ని దేశములయందు ఆలోచనలు తీవ్రముగా కలిగినవి. విద్యావిధానముల యందుగల లోపమే ముఖ్య కారణములని గుర్తించబడినది. ప్రపంచము ఇకముందైన శాంతి వంతముగా నుండవలెననిన అన్ని దేశములయందలి యువకు లకు - అనగా భావి పౌరులకు - సరియైన జీవితాశయములు బోధించినగాని కార్యసాధనము కాదని నిశ్చయించడ మైనది.

అందుచేత ఉన్నత విద్యాలక్ష్యము లెట్లుమార్చవలెనను విషయము యుద్ధానంతర శాంతి ప్రణాళికలో ముఖ్యస్థాన మాక్రమించినది. ఇదియే ఇందలి విషయము.

అతి ప్రాచీనకాలమునుండి ఉన్నతవిద్యలను బోధించు సంస్థలు ప్రాయికముగా భారతదేశమందే యుండెనని చెప్పవచ్చును. హైందవ, బౌద్ధ సంస్కృతి పొంగి పొరలుచుండెడి దినములలో తక్షశిల, నలందా, ధరణికోట, కంచి మొదలైన స్థలములయందు, మహామహులైన పండితులు చేరి భారతీయ విజ్ఞాన వికాసమును దశదిశలకు వెదజల్లుచుండెడివారు. యవన తురుష్క రాజ్యముల నుండి, చీనా, టిబెట్, సుమత్రా, జావా మొదలగు దేశములనుండి విద్యార్థులు, పండితులు వచ్చి విద్యలు నేర్చుకొనుచుండెడివారు. సర్వవిద్యలు, సర్వకళలు, సర్వమతములు, సర్వజనులు ఎట్టి భేదమును లేకుండ నేర్చుకొనుటచేత విశ్వకళాపరిషత్తులని సార్థకనామధేయమును దాల్చి విరాజిల్లినవి. నాటి సంస్థలు. అందలి లక్ష్యములు మిక్కిలి ఉన్నతమైనవి. "సత్యంవద, ధర్మంచర, మాతృదేవోభవ. పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ. అహింసాపరమో ధర్మః" అనునవి ముఖ్యమైనవి. విద్యలు నేర్చుట యొక్క పరమ ప్రయోజనములు, ధర్మము, దయ, క్షమ, శాంతి, మానవసేవ యని వారి యాశయము. ఈయాశయములు సార్వకాలికములు. మరియును నలందా వంటి విశ్వవిద్యాలయములలోని విద్యార్థుల యొక్క, ఆచార్యులయొక్క నిత్యజీవితముకూడ ఆదర్శప్రాయమై యుండెను. వారందరు కలసిమెలసి ఒండొరుల క్షేమము నపే

క్షించి, గొప్ప కొద్ది యను భేదములకు తావులేకుండ, జీవితమును గడపుచుండెడివారు. సహృదయులై, నిశితమగు బుద్ధికలిగి, సమ దృష్టితో విషయగ్రహణమందు నిమగ్నులై విద్యార్థులుండెడి వారు. ఒండొరుల సౌహార్ద్రముతో సంచరించేవారు. ఒకరి నొకరు పూర్తిగా తెలిసికొనెడివారు. వివిధ దేశములకు, మతములకు జెందిన వీరందరు క్షీరనీరన్యాయమున మెలగుటచేత వివిధ సంప్రదాయములను సమీకరణమై సర్వసమ్మతములగు ఆశ యములు, మనోధర్మములు ఏర్పడి, ఏకీభావము పెంపొంది సర్వ మానవ సౌభ్రాత్రము పెంపొందుచుండెను. శిష్యులను గురు వులు సదా కాపాడుచు వారితో అన్నివిషయములను నిరాడంబర ముగా చర్చించుచు, ఎట్టి మర్మము లేకుండ విషయముల బోధించుచుండెడివారు. అన్ని లక్ష్యములకంటె పరమ లక్ష్యము ఆధ్యాత్మిక విద్యయై యుండెడిది. అందుచేత విద్యార్థులు శీల వంతులై, సేవాతత్పరులై లోకకళ్యాణమునకై వారి సర్వశక్తులను ధారపోయవలెనను దీక్ష కలిగియుండెడివారు. అందుచేత నలందా వంటి విద్యాకేంద్రములు భరతవర్షమునకు తలమానికములై, సర్వశ్రేయో దాయకములైన సారస్వతాలయములై జంబూద్వీప మంతటను ప్రఖ్యాతిజెందినవి.

అట్టి విద్యాలయములలోని ఆచార్యులు మహాసమర్థు లుండెడివారు. నూతనవిజ్ఞానమును సృష్టించగలిగి బహుమేధావులై శిష్యులయందు విజ్ఞానాంకురములను వెలయించ గలిగియుండెడి వారు. నేటి విజ్ఞానశాస్త్ర పరిశోధకులకు ఎంతమాత్రమును తీసి

పోనివారై యుండెడివారు. నాగార్జునుడు, ఆర్యదేవుడు దిఙ్నాగుడు మొదలైనవా రట్టివారె. నలందా, విక్రమశిల విద్యాలయములలో ౩౦౦౦ - ౫౦౦౦వరకు విద్యార్థు లుండెడివారు. వారు జీతములను కట్టుట యనునది యెరుగరు ; విశ్వవిద్యాలయములు రాజులచేత, ధనాధికులచేత పోషింపబడుచుండెను.

నాటి విద్యలలో వృత్తి విద్యలని ప్రత్యేకించి ఏవియును లేవు. జీవితోపాధి కొరకు చదువు నేర్చుకోవలసిన నేటి సమస్య నాడులేదు. నాటి దేశపరిస్థితులే వేరు. ప్రజల దృక్పథమే వేరు. విద్య విద్యకొరకే, శీలముకొరకే, గుణముకొరకే, ధనార్జనము కొరకుకాదు. ప్రతివారికిని ఉచితమగు, పారంపర్యమగు వృత్తి యుండెను. జీవయాత్ర సౌమ్యముగా గడచిపోవుచుండెను. ప్రజలు సర్వసమర్థులైన తమరాజుల పాలనమున స్వాతంత్ర్యము కలిగి యుండెడివారు. ఇట్టి మహోన్నతస్థితి క్రమముగా కాలానుసరణమై క్షీణించినది. దేశమునకు స్వాతంత్ర్యము పోయినది. పరతంత్రత హెచ్చినది. ప్రజలకు శక్తి సామర్థ్యములు దిగనారినవి. పూర్వసంప్రదాయముల యాదార్థ్యగ్రహణముపోయి, మూఢవిశ్వాసములు, అజ్ఞానము, దురాచారములు పెచ్చుపెరిగినవి. అట్టి స్థితిలో దైవవశమున మన దేశము ఆంగ్లేయ పరిపాలనములోనికి వచ్చినది. పాశ్చాత్య విద్యావిధానము, ఆంగ్లేయభాషలోఏర్పాటు కాబడినది. నేటిఉన్నత విద్యాలక్ష్యములు, విధానములు, అన్నియును పాశ్చాత్యుల ఉన్నత విద్యాలక్ష్యములకు, విధానములకు అనుకరణములే. ఈవిద్యావిధానమే నేడు ప్రపంచమందంతటను

వ్యాపించియున్నది, నేటి ప్రపంచస్థితి యంతయు దీనిపరిణామమే యనవచ్చును. కనుక పాశ్చాత్యోన్నత విద్యావిధాన లక్షణములను గురించి కొంత తెలిసికొనుట అవసరము. పాశ్చాత్య నాగరకతకు పాశ్చాత్యోన్నతవిద్యావిధానమునకు మూలము విజ్ఞానము - సైన్సు. ఈవిజ్ఞానమునేడు శాఖోపశాఖలుగా పెరుగుచున్నది. దానివలన నాగరకత సర్వతోముఖముగా విజృంభించుచున్నది ఇదికేవలము విజ్ఞానయుగమని పిలువబడుచున్నది ఉన్నతవిద్య లన్నింటికి విజ్ఞానము జీవగఱ్ఱ. వేదాంతము, సారస్వతము మనస్తత్త్వశాస్త్రము, మొదలైనవానికంటె విజ్ఞానశాఖలకే నేటి విశ్వవిద్యాలయములయందు ప్రాముఖ్యముగలదు. విజ్ఞానవృద్ధివలన వ్యక్తమైన నూతన విషయములయొక్క ఉపయోగమువలన దేశముయొక్క ఆర్థికస్థితి పెరిగినది. వాణిజ్యము, పరిశ్రమలు, వ్యాపారములు వృద్ధియైనవి. అనేక నూతన జీవనోపాధులు, వృత్తులు ఏర్పాటైనవి. ఐహికవాంఛలు, జీవితము గడుపుటకు కావలసిన వస్తుసముదాయము, హెచ్చిపోయినది. లాభమునకై వాణిజ్యమునందు ప్రతిదేశీయులకు పోటీలు ప్రారంభమైనవి. ఆ పోటీలలో జయమును పొందుటకై వైజ్ఞానికముగా విశ్వవిద్యాలయములు తోడ్పడినవి. జీవిత సమరోత్సాహము పెచ్చుపెరిగినది. దానికి తోడునీడయై విజ్ఞాన విద్యావిధానము నిలిచినది. మానవుల దృష్టి సంకుచితమైపోయినది. స్వలాభాపేక్ష హెచ్చినది. కొద్దిమంది లాభమునకై పెక్కుమందికి నష్టము వచ్చునట్టి ప్రయత్నములు సాగినవి. వాణిజ్యవృద్ధియే పరమాశయమై నిలిచినది. ఏదేశమువారు ఆదేశముయొక్క క్షేమలాభ

ములను మాత్రమే పెంపొందింప జూచుకొనిరి. దేశాభిమాన మనుభ్రమ కనులఁ గప్పుటచేత విజ్ఞానవేత్తలు విశాలదృష్టి లేనివారైరి. విజ్ఞానము తుదకు పెనుభూతమై, విజ్ఞానవేత్తల నావహించి, సంకుచిత దృష్టితో రాజ్యాంగములను నడపు రాజకీయవేత్తల ప్రోద్బలమునకు లోనై వారి చెప్పుచేతలలో నడచి. లోకము నంతము చేయునట్టి మారణయంత్రములను సృష్టించినది; సృష్టించుచున్నది. విజ్ఞానవృద్ధి సర్వమానవసౌభాగ్యముకొరకు అను పరమసత్యము నెరిగియు విజ్ఞానాధికులు తప్పుదారులను బట్టియున్నారు. ఆత్మశక్తిని దారపోసి, తపస్సుచేసి, సాధకులైనగాని విజ్ఞానవంతులు ప్రకృతి రహస్యములను గ్రహింపనేరరు. అట్టివారైన మహర్షులవంటి సత్యద్రష్టలగు విజ్ఞానవేత్తలు కూడ నేడు ప్రపంచమారణమునకై, సర్వధ్వంసమునకై తోడ్పడుట, దీక్షవహించుట చాల జుగుప్సాకరము. ఈకారణముచేత ఉన్నత విద్యాలక్ష్యములు క్షీణించినవి. బలవంతములగు స్వాతంత్ర్యదేశములయం దంతటను మానవ స్వభావము పెడమార్గమును పట్టియున్నదని చెప్పుటలో అతిశయోక్తిలేదు.

మరియు ఈ విద్యావిధానము కారణముగా పారతంత్ర్యమునకు లోనైన దేశములందు వేరువిధమగు మార్పులు కలిగినవి. ఉన్నత విద్యాధికులలో నూతనచైతన్యము, వికాసము కలిగినది. స్వాతంత్ర్యాభిలాష అంకురించినది. పరిపాలకులకు పరిపాలితులకు నడుమ వైమనస్య మేర్పడి దేశమందు గొప్పసమస్య పుట్టినది. మరియు దేశసంప్రదాయములకు భిన్నమగు పాశ్చాత్య సంప్ర

దాయముల నభ్యసించిన విద్యాధికులు సామాన్య ప్రజలకు వేరై పోయిరి. తామధికులమని భ్రమించుచున్నారు. అందుచేత సంఘ బలము సంఘగుణము తగ్గినవి. పారంపర్యముగవచ్చు వృత్తికి క్షేమము కలిగినది. దేశీయవిద్యలు, వృత్తులు క్షీణించినవి. దేశీయ విదేశీయ నాగరకతల సంఘర్షణచేత అనేకమైన నూతన సమస్యలు పుట్టి దేశమున అశాంతిని గలిగించుచున్నవి.

ఏమైననేమి అన్నిదేశములయందు సమస్యలు పెచ్చుపెరిగినవి. అంతర్జాతీయ సమస్యలు తలలెత్తినవి. ఉన్నత విద్యాలక్ష్యముల జారవిడుచుటచేత ప్రపంచక్షోభమునకు దారిపడి సాగుచున్నది.

వీనిని ప్రతిఘటించుటకే నేడు అంతర్జాతీయ మహాసభలు సాగుచున్నవి. జాతీయ దృక్పథమును అంతర్జాతీయదృష్టికి మరల్చి ప్రపంచ శాంతియే పరమలక్ష్యమని గుర్తించి బలవంతములగు దేశములవా రందరు అట్టి తీర్మానమును ఆచరించిన గాని ప్రపంచమునందు శాశ్వత శాంతి సంభవింపజాలదు.

ఇక మనదేశమందు ఉన్నతవిద్యయందు కలుగవలసిన మార్పులను గొన్ని చెప్పెదను. దేశమందు దారిద్ర్యము అజ్ఞానము అనారోగ్యము తాండవించుచున్నవి. ప్రజాసామాన్యమునకు సుఖములేదు. దేశమందలి సర్వసంపదల నుపయోగించుకొను ఏర్పాటులు లేవు. కర్మాగారములు, పరిశ్రమాగారములు వాణిజ్యము, వ్యవసాయము మొదలైనవి మనదేశమందు చాల తక్కువస్థితిలో నున్నవి. నాగరకతగల దేశములలోవలె, మన దేశము సర్వవిధముల నభివృద్ధిలోనికి త్వరలో రావలెను. దీనికై

విద్యావిధానమునందు చాల మార్పులు రావలెను. ఉపాధ్యాయుల స్థితి వైజ్ఞానికముగాను, ఆర్థికముగాను మార్పులు చెందవలెను. విద్యాలయములందలి విధానమందు మార్పులు రావలెను.

ముఖ్యముగా జాతిమత భేదములు పాటించక దేశభక్తులై, మానవసౌభ్రాత్రమే పరమలక్ష్యమై, మానవకోటిలో తామొకర మనుజ్ఞానముతో, విద్యార్థులు తయారుకావలెను. ఇట్టి మార్పు లన్నియును సాగుటకై ఒక విపులమగు ప్రణాళికను ప్రజానాయ కులు కలసి, తయారుచేసి అచిరకాలములో ఆచరణలోనికి తీసి కొని రావలెను.

పరిహార మార్గము లన్నియును భౌతికమార్గమునకు చెంది నవి. సర్వసామాన్యములు. వీ నన్నింటికంటెను ఉత్కృష్టమైన దియు, సర్వశ్రేయోదాయకమైనదియు వేరొకటి గలదు. ఆ పరమ సాధనము ఆధ్యాత్మికమైన విషయము. భారతవర్షము ఆధ్యా త్మికశక్తికి పేరు పొందినది. భారతదేశముయొక్క మహోన్న తస్థితి కంతకు ఆధ్యాత్మికతత్త్వమే పట్టుకొమ్మ. ధర్మము, సత్యము, క్షమ, అహింస దీనికి ఆధారములు. వీనిని విడనాడుట నేల విడిచి సాముచేయుట. ఈసనాతనమగు భారత సంప్రదాయము అవలంబింపక ఆదిభౌతిక మార్గముల విజృంభించుటచేతనే నేటి విద్యావిధానములకు గొప్పకొరత కలిగినది. ప్రపంచక్షోభములకు కారణమైనది. కేవలము బుద్ధిబలము, పశుబలము, యంత్రబలము నారాధించుటచేతనే స్థిరమగుప్రయోజనములేదు. భూతశక్తులు అణు శక్తులు ఇతర భౌతికశక్తులు ఎన్నింటిని స్వాధీనము చేసికొన్నను,

వానిని హింసాత్మకములుగా ఉపయోగించినన్నాళ్లు అవి మరింత చేటునకే కారణములై తీరును. హింసాత్మకమగు నేటి మానవ స్వభావము అహింసాత్మకముగా మారవలెను. విజ్ఞానవేత్త తన అంతరంగమును పరిశీలించుకొని, మానసిక తత్త్వవిచారణ తీవ్ర ముగా చేసి, ఆత్మవేత్తయై, ఆత్మశక్తియొక్క మాహాత్మ్యమును తెలిసికొనినగాని ఈ ప్రపంచమందు శాంతినెలకొనజాలదు. మానసిక విద్యలే మహోన్నతవిద్యలు. ఆత్మవిచారమే పరమ సాధనము. ఆత్మ శక్తే, ఈశ్వరశక్తి.

సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై,
తేజస్వినా వధీతమస్తు, మావిద్విషావహై.........

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## రా మ న్ ఇ ఫె క్టు

సర్ అష్‌టోష్ ముఖర్జీగారి యాహ్వానము నంగీకరించి, పాలిట్ ప్రొఫెసర్ ఆఫ్ ఫిజిక్సు పదవిలో కలకత్తా విశ్వవిద్యాలయ ములో ఆచార్య రామన్ 1917 లో ప్రవేశించినారు. కలకత్తాలో బౌబజారు వీధిలోని ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది కల్టి వేషన్ ఆఫ్ సైన్సు అను సంస్థలో, భౌతికశాస్త్ర (Physics) పరి శోధనలు చేయుటకు రామన్ ప్రారంభించెను. అందే వారి నివా సముకూడ. వారును వారి సహాయ పరిశోధకులును విరామము లేకుండ అహోరాత్రములు పనిసాగించుచుండిరి.

1921 వేసవిలో బ్రిటిష్ సామ్రాజ్యములోని విశ్వవిద్యాలయముల మహాసభ ఆక్స్ఫర్డులో జరిగెను. కలకత్తా విశ్వవిద్యాలయమువారు రామన్ గారిని ఆసభకు పంపిరి. సముద్రజలముల యొక్క నిర్మలమైనట్టి గాఢమైనట్టి చక్కని నీలిరంగు ఆకాశముయొక్క సుందరమగు శ్వేతనీలివర్ణమును, ఆప్రయాణములో రామన్‌ను మిక్కిలి ఆకర్షించినవి. వివిధ సముద్రముల యందలి నీటిని ఆయన పరిశీలన నిమిత్తమై ఎత్తిపెట్టుకొనెను. కొంతవరకు స్టీమరు మీదనే పరిశోధనలు సాగించెను. ఈ నీలి వర్ణములు కలుగుటకుగల కారణములు గురించి రేలేప్రభువు (Lord Rayleigh) చేసిన పరిశోధనలు సంతృప్తికరముగా లేవనియు, ఈప్రకృతి విశేషముల గురించి ఇంకను శ్రద్ధగా పరిశీలింపవలసి యున్నదనియు నిశ్చయించుకొని కలకత్తాకు తిరిగి రాగానే వివిధములగు ప్రయోగములను రామన్ ప్రభృతులు చేయ మొదలిడిరి. ఇట్లు 1921 నుండి 1928 వరకు చేసిన తీవ్రపరిశోధనా ఫలితమే రామన్ ఇఫెక్టు. దీనిని 1928 ఫిబ్రవరి 28 తేదీనాడు రామన్ ప్రకటించినాడు. గతించిన 1953 ఫిబ్రవరి 28 వ తేదీనాటికి ఇరువదియైదు సంవత్సరము లైనది. రామన్ ఇఫెక్టు యొక్క రజతోత్సవము మద్రాసులోను, ఇతర విజ్ఞాన కేంద్రములయందును వైభవముగ జరిగినది.

భౌతిక శాస్త్రములో ప్రకటితమైన మహత్తర విషయములలో రామన్ ఇఫెక్టు ఒకటి. ప్రపంచమందలి వివిధ పరిశోధనా కేంద్రములలో దీనిని గురించి అనేకులు శాస్త్రజ్ఞులు కృషి

సలిపి అనేకములగు నూతన శాస్త్ర విశేషములను సుమారు 30,000 శాస్త్రపత్రములలో (Scientific Papers) ప్రచురించి యున్నారు. అణువులయొక్క నిర్మాణమును (Structure of molecules) నిర్ణయించుటలో రామన్ ఇఫెక్టు సులభమైన సాధనముగా పరిణమించినది. ఈఅణునిర్మాణవిషయము భౌతిక, రసాయనశాస్త్రముల మూల విషయములలో ముఖ్యమైనది. ఈ నిర్మాణముల వలన తెలియగల శాస్త్రవిషయములు, ఇతర ప్రయోజనములు చాలకలవు. ఈఇఫెక్టును సోపపత్తికముగా తెలిసికొనుట (Theory) చాల క్లిష్టమగు విషయము. ఇది భారతీయులకేగాక ఆసియాఖండము నంతకును ప్రఖ్యాతితెచ్చిన విషయము. దీని గురించి తేటమాటలలో లీలగా చెప్పుటకై ప్రయత్నించెదను.

రామన్ ఇఫెక్టు గురించి ఒక్కమాటలో చెప్పవలెననిన — 'వెదజల్లబడిన వెలుతురులో వర్ణభేదము కలుగుట రామన్ ఇఫెక్టు' అని చెప్పవలెను. దీని భావమును బాగుగ తెలిసికొనుటకు కొంత వ్యాఖ్యానము అవసరము.

సూర్యకాంతిలో ముఖ్యమైనవి ఏడురంగు లున్నవి. గాజు పట్టకములో (Prism) సూర్యకాంతి ప్రవేశించి బైటికి వచ్చినపుడు పట్టకముచేత విభజింపబడి ఈ ఏడురంగులు ఇంద్రధనుస్సులోని రంగులవలె, వరుసగా గోచరించును. గాజుపట్టకముతో నిర్మింపబడిన స్పెక్ట్రాస్కోపను పనిముట్టుతో సూర్యకాంతిని పరిశీలించినచో ఈఏడురంగులేగాక వానియందంత ర్భాగములైయున్న పెక్కు రంగులు-ఎరుపు మొదలుకొని నీలలో

హిత వర్ణము (Violet) వరకు ఒక వర్ణమాలగా (Spectrum) కనబడును. దీపపుకాంతినిగాని, ఇతరకాంతులనుగాని స్పెక్ట్రాస్కోపుతో పరిశీలించినప్పుడు అందలి రంగులు ఒకమాలగాగాని, మధ్య మధ్య ఖాళీలతో కొన్నిరంగులు మాత్రమేగాని కనిపించును. పాదరసపు ఆవిరిని గాజుగొట్టములో నింపి విద్యుత్తును ప్రవేశపెట్టినచో గొట్టమంతటనుండి కాంతి ప్రసారమగును. దీనిని పాదరసపు దీప (Mercury Vapour Lamp) మందురు. ఇందు నాలుగైదు రంగులు మాత్రమే ఉండును. వానినన్నిటిలో కాంతివంతమైనది ఆకుపచ్చ రంగురేఖ (Green line). కొంత తక్కువకాంతి గలది నీలలోహితపురంగురేఖ (Violet line).

సూర్యునినుండిగాని, దీపములనుండిగాని, వెలువడు వెలుతురు ఆకాశమందు తరంగరూపమున ప్రసారమగుచుండును. కంటికి గోచరించే వెలుతురులో (visible light) ఎరుపురంగు తరంగములు అన్నిటికంటె పొడుగైనవి. నీలలోహితతరంగము లన్నిటికంటె పొట్టివి.

ఒక గుండ్రటిగాజుబుడ్డిలో బెన్‌జీన్‌వంటి ద్రవపదార్థమును నింపి దానినొక చీకటిగదిలోనుంచి, కిటికీతలుపులోని సన్నటి రంధ్రముగుండా సూర్యకాంతిని, తూర్పునుండి పడమరకు బుడ్డిగుండా పోనిచ్చినచో పడమరకు వెళ్ళే సూర్యకాంతికాక, సూర్యకాంతికంటె బాగుగ తక్కువ కాంతిగల అతి సుందరమైన నీలివర్ణము బెంజీనుద్రవమునుండి తక్కిన అన్నిదిక్కులకు ప్రసారమగును. నిర్మలమైన ఏఇతర ద్రవమునైనను గాజుబుడ్డిలో పోసి

నప్పుడు ఆ ద్రవమునుండికూడ అన్ని వైపులకును నీలిరంగు వెదజల్లబడును. ఇట్లు వెదజల్లబడిన కాంతిని కాంతిజల్లు (scattered light) అందురు; ఈ వెదజల్లుటను scattering అని diffusion అని అందురు. ఇట్టి కాంతిజల్లులవలన ప్రకృతిలో కొన్ని సుందరదృశ్యములు కలుగుచున్నవి.

ఆకాశములో కొన్నిమైళ్ళవరకు గాలి (air) నిండియున్నది. సూర్యకాంతి ఈ గాలిలోనికి ప్రవేశించుచుండును. దానివలన ఆకాశము అన్నివైపులకు లేతనీలి వర్ణముతో గోచరించుచుండును. ఆకాశములోని గాలి ఎంతనిర్మలముగా ఉండిన ఎంతధూళి, దుమ్ము, లేకుండిన అంత ఎక్కువగా నీలివర్ణకాంతి వెదజల్లబడుచుండును. ఇందుచేతనే శరత్కాలమందు ఆకాశము మిక్కిలి కాంతిమంతముగా ఉండును. గాలిలోని అణువుల (air molecules) వలన ఈనీలిరంగు కలుగుచున్నదని రేలే ప్రభువు (Lord Rayleigh) మొట్ట మొదట ప్రతిపాదించెను.

బెంజీను మొదలగు ద్రవములనుండి గోచరించు నీలికాంతి కూడ ఆద్రవముయొక్క అణువుల(liquid molecules) వల్లనే కలుగుచున్నదని రామన్ నిశ్చయించెను. ఇట్లే సముద్రపు నీటి అణువుల వల్లనే గాఢమైన నీలిమందు వర్ణముతో సముద్రము కనిపించుచున్నదని ప్రయోగముల మూలమున రామన్ మొట్ట మొదట (1921) నిర్ధారణ చేసెను.

మరియు, హిమాలయములవంటి ఎత్తైన పర్వతముల యందలి లోయలలో నెమ్మదిగా దిగజారు పెద్ద పెద్ద మంచు

ఖండముల (glaciers) గుండా సూర్యరశ్మి ప్రవేశించునప్పుడు చేత నీలిమను వెదజల్లుచు మంచు ఖండములు గోచరించును. ఈనీలికాంతిని మంచు అణువులు (molecules of ice) వెదజల్లు చున్నవని నిశ్చయింపబడినది. ఈఉదాహరణమువలన వాయు, ద్రవపదార్థములు, వెలుతురును లోనికిచొరనిచ్చు ఘన పదార్థములు (gases, liquids and transparent solids) కాంతిని వెదజల్లునని స్పష్టమైనది. పదార్థమందలి అణువులు కాంతిజల్లున కెట్టికారణమో కొంత తెలిసికొందము.

పదార్థములన్నియు అణువుల సమూహములు. అణువులు, ఒకచోట స్థిరముగా ఉండవు. అటునిటు అతిస్వల్పముగా అన్ని వైపులకు కొట్టుమిట్టాడుచుండును. సూర్యకాంతి, ఈ అణువుల పైని పడగానే అణువులన్నియు స్పందించును. ఈ స్పందనముచేత అణువులు శక్తిమంతములై తమకు సహజమైన కాంతిని అన్ని వైపులకును వెదజల్లును. తమస్థానములలోనే స్థిరముగా అణువులు నిలిచియున్నచో వివిధాణువులు వెదజల్లు వెలుతురు గోచరము కాకుండ అణగిపోవుననియు, అణువులు ఎంత ఎక్కువగా, గజిబిజిగా, కొట్టుమిట్టాడుచున్నట్లైన అంత ఎక్కువగా వెలుతురు అణగిపోవుటమాని, కాంతిమంతముగా గోచరించుననియు, గణితముచేత నిర్ణయించవచ్చును. అందుచేతనే వాయుపదార్థములలోని అణువులు వెదజల్లుకాంతి ద్రవపదార్థము వెదజల్లు కాంతికంటెను, ద్రవపదార్థములు వెదజల్లుకాంతి ఘనపదార్థములు వెదజల్లు కాంతికంటెను తీవ్రముగా ఉండును. వాయుపదార్థముల

లోని అణువులు ఎక్కువ సంచలనము కలిగి యుండును. అంత కంటె ద్రవములలోను, అంతకంటె ఘనపదార్థములలోను అణువులు తక్కువ సంచలనము కలవిగా ఉండుటయే కాంతితీవ్రత లోని భేదములకు కారణము.

1923 — 25 మధ్యకాలములో బౌబజారులోని భవనములో పరిశోధనలు సాగినవి. పతనకాంతి (incident light) లోని రంగులలో ఒక రంగుమాత్రమే కాంతిజల్లులో గోచరించుచున్నదని, ప్రపథమున రామన్ భావించెను. కాని కొన్ని ప్రయోగములను బట్టిచూడగా పతనకాంతిలోలేని రంగులుకూడ కాంతిజల్లులో కవబడుచున్నవను సందేహము క్రమముగా బలపడుచు వచ్చినది. పతనకాంతి రంగులలోలేని కొన్నిరంగులు కాంతిజల్లులో ఉండవచ్చునని 1923 — 25 ల మధ్య, స్మెకేల్, క్రేమర్సు, హైజన్‌బర్గ లను భౌతికశాస్త్రవేత్తలు గణితముచేసి చూపిరి. రామన్ చేయుచున్న ప్రయోగములో గోచరించిన విశేషమే ఇది. పెక్కుద్రవ పదార్థములనుండి వెడలు కాంతిజల్లులలో ఈ విశేషము గోచరించినది. గ్లిసరీనుతో చేసిన ప్రయోగములలో బాగుగ స్పష్టముగా గోచరించినది.

ఇది ఇట్లుండగా, వెలుతురుయొక్క స్వభావములో ద్వంద్వమేర్పడి యున్నదని కాంప్టను, 1925 లో, ప్రయోగమూలమున స్పష్టపరచెను. ఆకాశమందు వెలుతురు తరంగములుగా ప్రసారమగుచున్నదని అనేక ప్రయోగములచేత చాలకాలమునుండి నిర్ణయింపబడిన విషయమే. కాని, కాంప్టనుచేసిన ప్రయోగము

కారణముగా వెలుతురు కణరూపములో గోచరించుచున్నదని నిశ్చయింపబడినది. వెలుతురు తరంగరూపములోను, కణరూపములోనుకూడ ఉండునని నిర్ధారణ మైనది. కాంతికణమునకు ఫోటాను (Photon) అని పేరు—(light particle). ఈ నూతన ప్రయోగ ఫలితమునకు కాంప్టను ఇఫెక్టు అనిపేరు. ఇది గొప్ప విషయము. ఈ ప్రయోగములో పదార్థముమీద పడిన వెలుతురు (incident radiation) కంటికిగోచరించ నటువంటి నీల లోహితపురంగుకంటె మిక్కిలి తక్కువ తరంగదైర్ఘ్యము (wave length) కలిగినటువంటి, ఎక్సుకిరణములు (X rays, X radiation). అట్లుపడిన ఎక్సుకిరణముల కారణముగా పదార్థమునుండి కాంతిజల్లు పుట్టును. ఆకాంతిజల్లులోని కిరణము లను పరీక్షించిచూడగా పతనఎక్సుకిరణముల తరంగదైర్ఘ్యము కంటె ఎక్కువకొలతగల ఎక్సుకిరణము లున్నవని విరూపింపబడినది. అనగా క్రాంప్టనుచేసిన ఎక్సుకిరణముల కాంతిజల్లు ప్రయోగమువలన, పతనకిరణముయొక్క రంగుకంటె భిన్నమైన-ఎక్కువ తరంగదైర్ఘ్యముగల—కిరణము పుట్టుచున్నదని, అనగా వర్ణభేదము కలుగుచున్నదని, స్పష్టమైనది. రంగుభేదమే వర్ణభేదము. తరంగపు కొలతలలో కలిగినభేదమే రంగుభేదము. ఒక్కొక్కరంగు తరంగమునకు ఒక్కొక్క కొలతఉండును. ఒక్కొక్క రంగు, ఒక్కొక్క గీతలాగున, రేఖవలె గోచరించును.

ఈ విషయము వెల్లడికాగానే కాంతిజల్లు ప్రయోగములలో సందేహాస్పదముగా కనిపెట్టుచు వచ్చిన విశేషవిషయముకూడ

క్రాంప్టను ఇఫెక్టువంటిదేమో నిర్ధారణచేసి చూడవలెనని రామన్ నిశ్చయించెను. ప్రయోగములలో ఉపయోగించు పరికరములలో ముఖ్యమైన మార్పులనుచేసెను. పెక్కురంగులుగల సూర్య కాంతిని, పతనకాంతిగా ఉపయోగించుటకు మారుగా దూరదూర మున, రెండు మూడు రంగులు మాత్రమేకల పాదరసపు దీప కాంతిని పతనకాంతిగా ఉపయోగించెను. కాంతిజల్లులోని రంగు లను విభజించి పరీక్షించుటకుగాను స్పెక్ట్రాస్కోపు నుపయో గించెను. మరియొక ముఖ్యమైన మార్పునుకూడ చేసెను. పతన కిరణము తూర్పునుండి పడమరకు పదార్థముగుండా పోవుచున్న ప్పుడు దానికారణముగా వెడలు కాంతిజల్లును తూర్పు పడమరలకు లంబముగా (Perpendicular) నున్న ఉత్తర దక్షిణ దిక్కుల నుండి పరీక్షించుట కేర్పాటు చేసెను. అనగా స్పెక్ట్రాస్కోపును దక్షిణోత్తరముగా ఏర్పాటుచేసి కాంతిజల్లును ఆ దిక్కులో పరీక్షించెను. ఇట్టి ఏర్పాటులో ఫలితములు చాల మేలుగా ఉండెను.

ఇట్టి ఏర్పాట్లనుచేసి, పదార్థమునుండి వెలువడిన కాంతి జల్లును పరీక్షించిరి. కాంతిమంతమైన ఆకుపచ్చని పాదరసపు దీప ములోని తరంగమును పతనతరంగముగా ఏర్పరచిరి. ఈకాంతి మంతమైన తరంగమే కాకుండ, దాని కిరుప్రక్కలను తక్కువ కాంతిగల రంగుతరంగములు స్పెక్ట్రాస్కోపులో కనబడినవి. పతనతరంగముకంటె పొడుగుగల, పొట్టియైన, నూతనతరంగ ములు, అనగా క్రొత్తరంగులు—కాంతిజల్లులో నున్నవని తేలినది. కాంతిజల్లుయొక్క వర్ణమాల నడుమ కాంతిమంతమగు పతన

కాంతిరేఖ ఉండును. దీనిని రేలేరేఖ (Rayleigh line) అందురు. ఇందు రంగుమార్పు లేదు. ఇరుప్రక్కలనున్న తక్కువ కాంతిగల రేఖలను రామన్‌రేఖ లందురు. (Raman lines). ఎక్కువ తరంగదైర్ఘ్యముగలదానిని స్టోక్సురేఖ (Stoke's line) అని, తక్కువతరంగపు కొలతగలదానిని, ఏన్టిస్టోక్సురేఖ (Anti-Stoke's line) అని అందురు. ఈ రెండు రేఖలు రామన్ రేఖలలో భేదములే. కాంతిచెల్లులో రంగుభేదము—ఎక్కువ, తక్కువ కూడ — ఉండునని ప్రయోగముల మూలమున 1928 ఫిబ్రవరి 28 నాడు ప్రప్రథమమున శాస్త్రలోకమునకు రామన్ వెల్లడించెను. ఈ నూతన విషయమునే (Discovery) రామన్ కాంతిజల్లు (Raman scattering) అని, రామన్ ఇఫెక్టు (Raman effect) అని అందురు. ఇది కంటికి కనిపించు వెలుతురునకు సంబంధించిన కాంప్టను ఇఫెక్టు వంటిది. (Raman effect is an analogue of Compton effect in visible light). మరియు అంతకంటె నిగూఢమైనది. రంగుమార్పులో పతనతరంగముకంటె తక్కువ కొలతగల రంగుపుట్టునని రామన్ ఇఫెక్టు ప్రప్రథమమున వెల్లడి చేసినది.

పదార్థముయొక్క ఉష్ణోగ్రత (Temperature) పీడనము (Pressure) మొదలగు భౌతికావస్థల ననుసరించి దానిలోని అణువుల శక్తి ఏర్పడియుండును. అణువులశక్తి సామాన్యాయి (Average) మీద ఇంత అని చెప్పవచ్చును. అణువులన్నిటికిని ఈ సామాన్యాయి శక్తి ఉండదు. కొన్నింటికి తక్కువగాను,

కొన్నింటికి ఎక్కువగాను ఉండును. తక్కువ శక్తిగలవి కొంత శక్తిని గ్రహించుటకు ప్రయత్నించుచుండును. ఎక్కువ శక్తి గలవి కొంతశక్తిని విడుదలచేసికొనుటకై ప్రయత్నించుచుండును. అట్టి అణువులలోనికి వెలుతురు ప్రవేశించినప్పు డేమిజరుగు నను విషయము తెలిసికొనవలసి యున్నది. వెలుతురు కిరణములలో అసంఖ్యాకములైన కాంతికణము లుండును. ఒకరంగులోని కణములన్నియును సమానమగు శక్తికలవిగానే యుండును. శక్తి తగ్గినచో రంగు తగ్గును. తరంగపు కొలత హెచ్చును. (వెలుతురు కణరూపముతో గోచరించునని పైని జెప్పియుంటిని. వందలి కాంతికణములకు శక్తి యుండును.) పదార్థములోనికి కాంతి ప్రవేశించినప్పుడు ఈ శక్తిమంతమగు కాంతికణములకును అణువులకును మధ్య సంఘర్షణ జరుగును. తక్కువ శక్తి గల అణువులు కాంతికణములనుండి శక్తిని లాగుకొనును. ఎక్కువ శక్తిగల అణువులు కాంతికణములకు తమశక్తిని కొంత ఇచ్చి వేయును. అందుచేత పదార్థమునుండి బైటికివచ్చు వెలుతురులో కొన్ని కాంతికణములు పూర్వముకంటె తక్కువ శక్తిమంతము లైనవియు, కొన్ని ఎక్కువ శక్తిమంతములైనవియు ఉండును. తక్కువశక్తిగల కణములు పతనకణములకంటె రంగు తగ్గినవి గాను, ఎక్కువ శక్తిగల కణములు రంగు ఎక్కువగాను ఉండును. శక్తినేమియును కోల్పోని కణములుకూడ పదార్థమునుండి వెలువడుటచేత రంగుమార్పులేని వెలుతురుకూడ ఉండును. కాంతిజల్లుయొక్క వర్ణమాలలో రంగుమార్పులేని వెలుతురే రేలేరేఖ; శక్తితగ్గిన కాంతిరేఖయే స్టోక్సు రామన్‌రేఖ

శక్తిహెచ్చిన కాంతిరేఖయే ఏంటిస్టోక్సు రామన్‌రేఖ. ఏంటిస్టోక్సు రామన్ రేఖలు స్టోక్సు రామన్‌రేఖలకంటె కాంతి హీనముగా ఉండును. ఉదాహరణకు, ఏంటిస్టోక్సు రేఖయొక్క కాంతి తీవ్రత (Intensity) స్టోక్సురేఖయొక్క కాంతితీవ్రతలో నాల్గవవంతైనచో, సామాన్యమైన శక్తికంటె హెచ్చుశక్తిగల అణువులసంఖ్య సామాన్యమైన శక్తికంటె తక్కువ శక్తిగల అణువులసంఖ్యలలో నాల్గవభాగము మాత్రమే ఉన్నదని గణితము సిద్ధాంతీకరించుచున్నది. అందుచేత, ఒకపదార్థమునుండి వెలువడు రామన్‌రేఖలయొక్క తారతమ్య కాంతితీవ్రతనుబట్టి ఆ పదార్థ మందలి అణువులలో శక్తి పంపకము ఏరీతిని చేయబడియున్నది, కొంత గ్రహించవచ్చును. మరియు, రేలేరేఖయొక్క తరంగ దైర్ఘ్యమునకును స్టోక్సురేఖ తరంగదైర్ఘ్యమునకునుగల భేద మెంతో, రేలేరేఖ తరంగదైర్ఘ్యమునకును ఏంటిస్టోక్సురేఖ తరంగ దైర్ఘ్యమునకునుగల భేదముకూడ అంతే. అనగా, రంగుభేదము హెచ్చు ఐనప్పుడు, తగ్గియున్నప్పుడుకూడ సమానాంతరము కలదిగానే ఉండును. ఈ రంగుభేదము పదార్థమున కొకరీతిగా ఉండును. ఈ భేదము పదార్థమందలి అణువుల గుణములపై నాధారపడి వాని గుణమునుబట్టి స్వభావమునుబట్టి నియమితమై యుండును. అందుచేత కాంతిజల్లులలోగల రంగుమార్పులను కొలిచి వానినిబట్టి ఏ పదార్థమువలన ఈమార్పులు కలుగుచున్నవో నిర్ణయింపవచ్చును. మరియు పదార్థముయొక్క ఉష్ణోగ్రతనుబట్టి ఈ రంగుమార్పులలో సూక్ష్మముగా భేదము కలుగుచుండును. నీటి

పదార్థము. ఆవిరి, ద్రవరూపములలో ఉన్నప్పుడు, కలుగు రంగు మార్పులలో ఈషద్భేదము కనిపించును.

కంటికి కనిపించునట్టి రంగులలో ఎరుపు రంగుగల తరంగము మిక్కిలి పొడుగైనది. ఇంతకంటె పొడుగైన తరంగములను ఇన్‌ఫ్రారెడ్ తరంగములందురు. ఇవి కంటికి కనబడవు. అట్టి ఇన్‌ఫ్రారెడ్ కాంతి తరంగములను బెన్‌జీన్ వంటి ద్రవములో ప్రవేశపెట్టినప్పుడు కొన్ని తరంగములను బెంజీను తనలో లీనము చేసికొని-ఎబ్‌జార్బు (absorb) చేసికొని-మిగిలిన తరంగములనే ఆవలికి పోనిచ్చును. అందుచేత వెలువడిన కాంతిలో కొన్ని రంగులు లోపించియుండును. ఇట్లు లోపించిన తరంగములయొక్క కొలతలను లెక్కించవచ్చును. రామన్ ఇఫెక్టు వలన బెంజీనులోకలిగే రంగుభేదమును అనగా పతన తరంగముయొక్క కొలతకును, కాంతిజల్లులోని రామన్ రేఖల తరంగపు కొలతలకున్నుగల అంతరమును, లెక్కించవచ్చును. ఇట్లు లెక్కించగా తేలిన చిత్రమేమనగా - ఇన్‌ప్రారెడ్ వర్ణమాలలో బెంజీను ఎబ్‌జార్బు చేసిన తరంగములయొక్క కొలతలు రామన్ కాంతిజల్లులో కలిగే రంగుభేదముయొక్క కొలతలు సమానములు-అవి. ఇతర ద్రవ, వాయు, పదార్థములతో చేసిన ఉభయప్రయోగముల యందు కూడ ఇట్లే గోచరించినది. అనగా పదార్థముయొక్క అబ్జార్ష్పను వర్ణమాలలో లోటుగాఉన్న తరంగములకును రామన్‌కాంతి జల్లులోని రంగుభేదమునకును అవినాభావసంబంధ మున్నదని తేలినది. అబ్‌జార్ష్పను వర్ణమా

బిలో లోటుగా ఉన్న తరంగముల కొలతలనుబట్టి ఆపదార్థము యొక్క అణువుల నిర్మాణమును గణితముచేత నిర్ణయించ వచ్చును. వాయు, ద్రవ పదార్థములయొక్క అణువుల నిర్మా ణము, లేక కట్టడము (Structure) తెలిసికొనుటకు అబ్జార్ష్పను వర్ణమాలలు చాల సహాయపడుచుండెను. కాని, ఈ వర్ణమాలలు కంటికి గోచరించని వగుటచేత ఇతర సాధనములచేత వానిని స్పర్శించవలసియుండెను. ఇది కొంత కష్టమైనకార్యము. రామన్ కాంతిజల్లుల పరిశోధనవలన ఈ విషయమును తెలిసికొనవచ్చునని నిర్ధారణ ఆగుటచేత, రామన్ కాంతిజల్లులను కంటితోచూచి పరి శీలించ వీలుండుటచేత. ఈకార్యము సులభసాధ్య మగుచున్నది. మరియు ఎబ్జార్ష్పను వర్ణమాలలలో గోచరించని నూతనవిష యములుకూడ రామన్ కాంతిజల్లు పరిశీలనవలన తెలియుచున్నవి. అందుచేత, పదార్థములోని అణువుల నిర్మాణవిషయములు సులభ తరములైనవి.

రామన్ కాంతిజల్లులలో కనిపెట్టిన విషయములు అనేక ములు. వీని యుపయోగములు అనేకములు. ఇంతవరకు రంగు మార్పు ఏలాగున జరుగుచున్నదో, అణువులయొక్క శక్తిభేద ముల తారతమ్య మెట్లు తెలిసికోవచ్చునో, అణువుల నిర్మాణమును తెలిసికొనుటెట్లో మాత్రము లీలగా చెప్పితిని. భౌతికశాస్త్ర సంబంధమైన ఉపయోగము లింక నెన్నో కలవు. భౌతికశాస్త్ర మునకంటె రసాయశాస్త్రములో రామన్ ఇఫెక్టు వలన కలిగిన సంచలనము, పరిశోధనలు చాల ఎక్కువగా యున్నవి. అదివరకు

బోధకాని రసాయనిక రహస్యములెన్నో రామన్ ఇఫెక్టు వలన సుబోధకములైనవి. ఈపరిశోధనా ఫలితముగా ఫిజికల్ కెమిస్ట్రీ అనే శాఖవంటి కెమికల్‌ఫిజిక్సుఅను శాస్త్రశాఖ ఒకటి నూతనముగా పెద్దదై పురోగమించుచున్నది. అనేకములగు అపురూప పదార్థములయొక్క — సైక్లోహెగ్జేన్, సైక్లోప్రోఫేన్ మొదలైనవాటి యొక్క — అణునిర్మాణము సంపూర్తిగా నిర్ధారణ చేయబడినది.

స్ఫటికముల (Crystals) లోని నిర్మాణ రహస్యములు చాలవరకు రామన్ ఇఫెక్టువలన బోధపడినవి. అన్నిటికంటె ముఖ్యముగా వజ్రముగురించిన పరిశోధనలు రామన్ చాల చేసినాడు. వజ్రమునకు అనేకోష్ణోగ్రతలు కల్గించి దాని కాంతిజల్లులలో కలిగే రంగుమార్పులను పరీక్షించినాడు. ఆయన అనుచరులు దీనివిషయమై చాల ప్రయోగములను చేసినారు. స్ఫటిక సంబంధమైన గతిశాస్త్ర (Crystal dynamics) రీత్యా, గణితముచేసి వాని ఫలితములకును ప్రయోగముల ఫలితములకును గల సామ్యమును గ్రహించినారు. వీని నన్నిటిని బాగుగా పరీక్షించి ఘనపదార్థములయొక్క తత్త్వము (Theory of solid state) గురించిన నూతనవిషయములను, రామన్ ప్రతిపాదించినాడు. ఈ విషయములో పరిశీలనలు జరుగుచున్నవి.

ఇట్లే అనేక శాస్త్రవిషయములలో రామన్ ఇఫెక్టు ఉపయోగపడి శాస్త్రజ్ఞానమును సర్వతోముఖముగ అభివృద్ధి చేయుచున్నది. ప్రపంచమందలి అనేక పరిశోధనా కేంద్రములలో రామన్ ఇఫెక్టు గురించిన ప్రయోగములు, గణితములు,

సాగుచునే యున్నవి. బెంగుళూరులో రామన్ ఇన్స్టిట్యూటు అను దానిని రామన్ స్థాపించినాడు. అచ్చటనే, సహచరులతో పరిశోధనలు సలుపుచున్నాడు.

---

## విశ్వశిల్పము

పాశ్చాత్య దేశములందు భౌతికశాస్త్రవిజ్ఞానము శాఖోపశాఖలుగా విస్తరించి అనేకరీతుల పెంపొందుచున్నది. అందు ముఖ్యముగా గతార్థశతాబ్దిలో అద్భుతములును, ఆశ్చర్యములును అగు గొప్ప విశేషములు కనిపెట్టబడినవి. అట్టివిషయములు అనేకరీతులుగా ప్రజల కుపయోగకరము లగుచున్నవి. ఈనూతనోపయోగముల మూలకముగా ప్రపంచనాగరకతలో చిత్రమైన మార్పులు అతివేగముగా ఏర్పడుచున్నవి. సంఘముయొక్క జీవితపద్ధతి మార్పుచెందుచున్నది. జరగినమార్పులయొక్క తత్త్వమును తెలిసికొనజాలుటకు పూర్వమే క్రొత్తమార్పులు పైన పడిపోవుచున్నవి. ఇది యిట్లుండ, అతిసులభముగాను, శీఘ్రముగాను శత్రువులను సంహరించుటకై నూతన శాస్త్రవిజ్ఞానమును ప్రభుత్వములవారు ఎప్పటికప్పుడే ఉపయోగము లోనికి తీసికొనివచ్చుచున్నారు. వీనినిబట్టి శాస్త్రజ్ఞానమువలన క్షేమము కంటె ఉపద్రవము హెచ్చుగా కన్పట్టుచున్నది. ఇట్టి దుస్థితి కొద్దిసంవత్సరములనుండి దినదినాభివృద్ధి పొందుచున్నది. శాస్త్రశోధనశక్తి మనకు వశ్యమై, మనము చెప్పినట్లు కట్టుబడియుండవలె గావి, పిశాచమై మనలనే మ్రింగుట కారంభించిన సర్వనాశ

నము తప్పదుకదా! ఇట్టి యుపద్రవమునుండి బైటపడుట కేమి యుపాయ మనే గొప్పసమస్య మానవజాతిని వేధించుచున్నది. ఇట్టిదుస్థితికికారణమేమి? నివారించుటెట్లు? అని బుద్ధిమంతు లంద రును గాఢాలోచనలు చేయుచు అనేక సాధనములను సూచించు చున్నారు. ఒకగొప్పశక్తి నెట్లుపయోగించవలెనో తెలియనివాని చేత నుంచినప్పుడు, వా డాశక్తిని దానియిష్టమువచ్చినట్లు పోని చ్చును. దానివలన కీడు తప్పదు. ఇట్లే శాస్త్రవిజ్ఞానముయొక్క స్వరూపము జనసామాన్యమునకు బొత్తిగా తెలియనిస్థితి రాను రాను హెచ్చగుటచేత బాధలకు కారణ మగుచున్నదని చెప్పక తప్పదు. నేటి విద్యావిధానమువలన జనసామాన్యమునకు తగి నంత లాభము కలుగుట లేదు. శాస్త్రవిజ్ఞానము జనులలో చాలి నంతవరకు విస్తరించుట లేదు. ఎంతో నాగరకుల మనిపించు కొను పాశ్చాత్యదేశీయులకే ఇట్టిగతి పట్టియున్నది. దీనికి కారణ మేమనగా అచ్చటి విశ్వకళాపరిషత్తులలోనుండి గొప్పగొప్ప విశేషములను కనిపెట్టుచున్న శాస్త్రవేత్తలందరును ఆశాస్త్రములను కొందరికి మాత్రమే బోధ చేయుచున్నారుకాని సామాన్యజను లతో ఎట్టి సంబంధమును కలిగించుకొనుటలేదు. ఇదియే సంఘము యొక్క దుస్థితికి మూలకారణము. అందుచేతనే కొందరు గొప్ప శాస్త్రజ్ఞులు పాతపద్ధతులను వదలి, శాస్త్రవృద్ధికొఱకుమాత్రమే కృషిసల్పుటలు మాని, సులభమార్గమున శాస్త్రవిషయములను లోకులకు తెలుపుటకై బద్ధకంకణు లైరి. అట్టివారిలో అగ్ర గణ్యులు సర్ జేమ్సు జీన్సు, ఎడ్డింగ్టన్, మిల్లికన్, జూలియన్ హక్సులే మొదలైనవారు.

విద్యుచ్ఛక్తి నిచ్చు యంత్రములు, విద్యుద్దీపములు, రైళ్ళు, విమానములు, టాకీలు, గ్రామఫోనులు, రేడియోలు మొదలైనవి మనజీవితమునకు ఎంతో వన్నెను కల్పించి, మార్పు కలిగించి, అనేకసౌకర్యముల నిచ్చి, మన మనోభావములలోను, జీవితపద్ధతులలోను చిత్రవిచిత్రములగు మార్పులను కల్పించి జీవితములను తారుమారు చేయుచున్నవి. క్రొత్తరుచులు, పనులు, ఊహలు అలవాటగుచున్నవి. పల్లెటూరికాపురములు పొత్తిగా వ్యత్యయమైపోవుచున్నవి. ఇట్టిమార్పులవలన నష్టము లేకుండుటకు మన బుద్ధులుకూడ విశాలములై, జరుగుమార్పుల నిజస్థితిని తెలిసికొనతగినవిగా మారవలెను. అంతవరకు సంఘమున తొట్రుపాటు తప్పదు. కనుక జనసామాన్యమున కుపయోగపడునట్లుగా, అనేక విషయములను సులభశైలిలో ఉపన్యాసముల నిచ్చుటయును, పుస్తకముల వ్రాయుటయును జీన్సు మొదలైనవా రారంభించినారు. దీనివలన జనబాహుళ్యమునకు శాస్త్రవిషయములు అందుబాటు కాగలవు. దానిచేత లోకులకు మనోవికాసముకలిగి, లాభము కలుగునని అభిప్రాయము. ఇంకను, ప్రభుత్వనిర్వహణమందు పాల్గొనువారికి శాస్త్రాభిలాష హెచ్చి, అందలివిషయములను గ్రహించి సరియగుత్రోవల బట్టుదురనియు అనగా తెలివిగలిగి తమకును, లోకమునకును క్షేమమునిచ్చు మార్గములలో మాత్రమే, ఆజ్ఞానము నుపయోగించెద రనియు, ఆకారణముచేత లోకమునకు కల్యాణమగు ననియు ఆశ.

౧౯౨౯ వ సం. లో సర్ జేమ్సుజీన్సుగారు "The Universe around us" అను పుస్తకమును వ్రాసిరి. అది

౧౯౩౧ లో ఒకసారి, ౧౯౩౪ లో ఇంకొకసారి ముద్రితమైనది. "తనతోటిదే లోకము" అనుసామ్యమున, ఈ విశ్వమంతకును భూమియే ఆధారభూతమని కొన్నివందల సంవత్సరములక్రిందటి వరకును అభిప్రాయ ముండెడిది. కొపర్నికసు అనుమహామేధావి కాలమునుండి పాశ్చాత్యులలో ఈఅభిప్రాయము మారినది. సూర్యుని ఆధారముగా అనేకగోళములు - గ్రహములు - తిరుగుచున్నవనియు, అందలి ఒకసాధారణగోళము మనము నివసించు భూమియనియు నిశ్చయింపబడినది. రానురాను ఇట్టి సూర్యుని వంటివే నక్షత్రము లన్నియు నని తెలినది. ఈ అసంఖ్యాకములగు నక్షత్రములకు ఆధారమేమి, సంబంధమేమి, స్వరూపనిర్మాణము లేమి, ఒక్కొక్కదాని వేడి, వెలుగు, బరువు, విస్తీర్ణత ఏమి, ఒకదానినుండి ఇంకొక దానికి, లేక మనవద్దనుండి ఒక్కొక్కదానికి దూరము లెంతెంత అను అనేక విషయములగురించి పరిశోధనలు జరుపబడినవి. అందు ముఖ్యముగా యునైటెడ్ స్టేట్సులోని కేలిఫోర్నియాయందలి విల్సనుపర్వతశిఖరమందున్న నక్షత్ర పరిశోధనాగారమున ఈ పరిశోధనలు చాల జరుపబడినవి. అందు ౧౦౦ అంగుళముల వ్యాసముగల దూరదర్శిని (100 inch Telescope) యంత్రము కలదు. దాని సహాయముచేత ఊహింపుటకైనను వీలులేనట్టి వింతవిజ్ఞానము లభించినది. అందలి ముఖ్యవిషయము లేవనగా (౧) నక్షత్రవీథి, తారాపథము. (Milky way) అని మనము వాడునట్టిది ఒక నక్షత్రలోకమనియు (Galaxy), అందు అనేకములు సూర్యునికంటె పెద్దవి, ప్రకాశమానములైనవి నక్షత్రములు కలవనియు, ఈ తారాపథము.

గుండ్రని బిళ్ల (disc) వలె నిలపెట్టిన ట్లుండుననియు, ఈగేలక్సీ మధ్యభాగమున చేరి సూర్యుడున్నాడనియు (౨) ఈనక్షత్రలోకము వంటివి ఇంకను అనేకములు గలవనియు, ఒకదానికంటె ఒకటి దూరదూరమున ఉన్నవనియు, (౩) ఎంతదూరమువరకు ఈలోకములు వ్యాపించియున్నవో చెప్పుట కింకను సాధ్యమగుట లేదనియు, దూరదర్శినీ యంత్రములను ఇంకను పెద్దవిగా నిర్మించిన కొలది ఇంకను దూరముననున్న నక్షత్రమండలములను గుర్తించ గలుగుదుమనియు, (ఇందు చేతనే ౨౦౦ అంగుళముల దూరదర్శిని నిర్మింపబడినది.)ఇట్టివిషయములనుబట్టి యావద్విశ్వమును, అనగా బ్రహ్మాండమంతను, ఆవరించియున్న ప్రదేశముయొక్క పరిమితి అనంతమా యన్నంత పెద్దదనియు, ఆ ప్రదేశ మహాసముద్రమందు నక్షత్రలోకములన్నియును ద్వీపములవలె నున్నవనియు, గ్రహింపవలసి వచ్చినది. ఇంతియకాక ఇంక నెన్నియో విశేషాంశములు గలవు. వానిని తెలిసికొనవలెనన్న నక్షత్రముల గురించి అనేక విషయములు తెలిసికొనవలసి యున్నది. నక్షత్రముల పుట్టుక, పెరుగుట, పరిణామము, నక్షత్రములయందలి ద్రవ్యము (Matter) యొక్క స్థితిగతులు, ఆ ద్రవ్య మెట్టిద్రవ్య బీజముల చేత నిర్మింపబడినది అనునవి. ద్రవ్యనిర్మాణమును గురించి పరిశోధనలు జరుగుచున్నవి. అవి యెట్టివనగా,

(౧) ద్రవ్యము అనేక రూపములు కలది. వీనిని రసాయనశాస్త్రజ్ఞులు పరీక్షించి ద్రవ్యప్రపంచమంతయు 92 మూల ద్రవ్యముల (elements) చేత నిర్మింపబడినదనియు, (౨) ప్రతి

మూలద్రవ్యమును అణువుల (molecules) క్రింద, పరమాణువుల (atoms) క్రింద విభజించవచ్చుననియు, (౩) ఎలక్ట్రాను, ప్రోటాను, న్యూట్రాను అను సూక్ష్మాణువులవలన అణువులు నిర్మింపబడినవనియు, (౪) అణువులయొక్క బరువు పెరిగినకొలది, అందలి సూక్ష్మాణువుల సంఖ్య పెరుగుచుండుననియు, (౫) ప్రతి అణువునకును మధ్యభాగమున కేంద్రకము (nucleus) ఉండుననియు, దానియందు ప్రోటానులు, న్యూట్రానులు గుమిగూడి యుండుననియు, కేంద్రకమును చుట్టి వివిధ దీర్ఘవృత్తములలో (ellipses) ఎలక్ట్రానులు తిరుగుచుండుననియు, ఇది సూర్యుని చుట్టు తిరుగు గ్రహములపంటిదనియు, (౬) పరమాణువుల బరువు పెరిగినకొలది వాటి నిర్మాణశిల్పము చిత్రచిత్రరీతుల సమ్మిశ్రితమైన యద్భుతకట్టడమువలె నుండుననియు మొదలగునవి.

ఇక నక్షత్రమెట్టిదో విచారింతము. నక్షత్రములయొక్క పైభాగము కొన్నివేల డిగ్రీల వేడిమికలది. నక్షత్ర నాభిభాగమందలి వేడిమి కొన్నివందల లక్షల డిగ్రీలుండును. ఈ విపరీతమగు వేడిమి కారణముగా అందలి ద్రవ్యము పరమాణు, సూక్ష్మాణురూపములో ఉండును. ఈ యసంఖ్యాకమగు పరమాణువుల సంఘర్షణ, త్రొక్కుడు మొదలగువానివలన నక్షత్రముయొక్క ప్రమాణము, బరువు, వెలుగు, వయస్సు కనిపెట్టవచ్చును. ఇట్టి నక్షత్రములలో సూర్యు డొకడు. సూర్యగోళభారము అనేకకోట్ల టన్నులు. అట్టి సూర్యగోళములు అనేక

కోట్లు గల కట్టడము ఒక నక్షత్రమండలము (galaxy). అట్టి మండలము లెన్నియో విశ్వమందున్నవి. అందుచేత ఈ విశ్వము విస్తీర్ణతయందే కాక, భారమునందుకూడ అనంతమా యని యోచింపదగియున్నది. అట్టి మహావిశ్వప్రపంచమున ఒక్కొక నక్షత్రమును అతిసూక్ష్మమగు ప్రదేశము నాక్రమించి అతి సూక్ష్మమగు బరువును గలిగి (విశ్వముయొక్క విస్తీర్ణతను, భారమును బట్టి చూచినప్పుడు) యున్నవనియు, విశ్వశిల్పము నందు నక్షత్రము ద్రవ్యమందలి అణువువంటిదనియు చెప్ప వచ్చును.

శాస్త్రమువలన నక్షత్రములయొక్క గుణవిశేషములను, వానివలన నక్షత్రలోకములయొక్కయు, అందుచేత విశ్వము యొక్కయు గుణములను గుర్తింపగలుగుచున్నాము. మహ త్పదార్థమగు విశ్వముయొక్క స్వరూపవికారములు గుర్తించుటకై అతి సూక్ష్మములగు అణువులయొక్క స్వరూపగుణవిశేషములు కావలసి వచ్చుచున్నవి. అతి సూక్ష్మములగు ద్రవ్యాణువుల యొక్క శిల్ప మెంత చిత్రమును, గూఢమును నై యున్నదో అట్లే ఈ యనంతవిస్తృతమైన విశ్వశిల్పముకూడ అతి విచిత్రమును, అతి నిగూఢమును నై కన్పట్టుచున్నది.

ఈ విశ్వముయొక్క విస్తీర్ణత గురించిన విషయము చాలా అద్భుతమైనది. దేశము (Space) కాలము (Time)అను నీరెంటియందు విశ్వమెట్లు విస్తరించి యున్నది అనునది పెద్ద సమస్య. "దేశము అనంతము, కాలము అనాది, అనంతమును.

రెండింటికిని ఏవిధమైన సంబంధమునులేదు. ఈ విశ్వమందలి చైతన్యము, నడన, అంతయును దేశకాలములయందు కలుగు చున్నది" అని 40 సంవత్సరముల క్రిందటివరకును శాస్త్రజ్ఞు లూహించియున్నారు. కాని ఐన్‌స్టయిన్ అను మహామేధావి ఈ దేశకాలముల గురించి బాగ తర్కించి సాపేక్ష (Relativity) వాదమును (Theory) కల్పించినాడు. ఈ వాదమున దేశకాలము లకు పరస్పరసంబంధము చెప్పబడియున్నది. దేశకాలములు అనంతములుకావు, అత్యధికమగు విస్తీర్ణతగలది. దేశకాలము లను వేర్వేరుగా భావింపక రెండింటిని చేర్చి దేశ-కాలము (space-time) అని ఏకభావముతో ఊహించవలెనని ఐన్‌స్టయిన్ సిద్ధాంతము. దేశ-కాల మనగా, ఈ రెండును దేనియొక్క వికారములో అది యని గ్రహింపవలసియున్నది. కాని దేశమును, కాలమును వేర్వేరుగా గ్రహించినరీతిగా ఈ దేశకాలైక్యమును మనము మనమున చిత్రించుకొని గ్రహింప వీలులేదు. ఇది గణితముచేత నిర్మింపబడిన యొక వింతవిషయము. దీనిగుణము లను తెలిసికొనుటకు గణితమే శరణ్యము, గణితమే సర్వమును. దీనిని మనయూహచేత గ్రహించుటకు, నిరూపించుటకు, ఇద మిత్థమనుకొనుటకు వీలులేదు. విశ్వనిర్మాణ పద్ధతిలోను అణు నిర్మాణపద్ధతిలోను ఇట్టి క్రొత్తవిషయములే కాన్పించుచున్నవి. అందుచేతనే సుబోధకములుకావు. రానురాను బ్రహ్మాండ తత్త్వ మును విచారించుటలో, ఊహాప్రపంచమున గణితమును కల్పించి దానిమూలమున ఒక్కొక విశేషము గ్రహింపబడుచున్నది. కాని, ఇదివరకువలె భౌతికశాస్త్ర చర్చలలో నడచుపద్ధతుల ప్రకారము

ప్రత్యక్షములకును, ఇంద్రియములకును, బుద్ధికిని సుగ్రాహ్యము లను అగు విషయములు కనిపించుట తగ్గిపోవుచున్నది.

దేశ-కాలముయొక్క గుణగ్రహణము అతిక్లిష్టమైనను కొంత విచారింతము. దేశ-కాలముయొక్క ఒకగుణవిశేషమే న్యూటను చెప్పిన గురుత్వాకర్షణసూత్రము (Law of Gravitation) అని సాపేక్షసిద్ధాంతమువలన ఏర్పడుచున్నది. బంతికి గుండ్రతన మెట్టిగుణమో, దేశ-కాలమునకు ద్రవ్యాకర్షణ యనునదియును అట్టిగుణమే. అందుచేతనే గ్రహములు సూర్యుని చుట్టు వంపుగలిగిన కక్ష్యలలో పోవుచున్నవట. ద్రవ్యసంపర్కము చేత దేశ - కాల మందు గొగ్గి కలుగుచుండునట, వంపు ఏర్పడు చుండునట. ఇట్టి విపరీతగుణములు దేశ-కాలమునకు గణితముచేత కలుగుచున్నవి. మరియును ఈ దేశ-కాలమందే విశ్వమంతయును ఇమిడియున్నది. ఈ దేశ-కాలముయొక్క స్వరూపనిరూపణమే విశ్వముయొక్క స్వరూప నిరూపణమునకును సాధనము. ఈ విశ్వముయొక్క పరిమాణము కొంతకాలము పెరుగుచు కొంతకాలము తగ్గించు, నుండు స్వభావము కలదని ఈ వాదము చెప్పుచున్నది. ప్రస్తుతకాలమున విశ్వము విస్తరిల్లుచున్నదని (Universe is now expanding) పరిశోధనలవలన ఊహించవలసి వచ్చుచున్నది. విశ్వనిర్మాణతత్త్వము (Cosmogony) ను ధీశాలులగు శాస్త్రజ్ఞులు ఐన్‌స్టయిన్, డిసిట్టర్, లమాత్రే, మిల్నె మొదలైనవారు పరిపరివిధముల పరిశీలించు చున్నారు.

మరియు ఐన్ట్సయిన్ సాపేక్షవాదముతో దేశకాలముల కెట్లు అవినాభావము కల్పించినాడో అట్లే ద్రవ్యము (matter) శక్తి (energy) వీనికిన్ని అభేదప్రతిపత్తి నిరూపించినాడు. ఇంతద్రవ్యము మాయమైనచో ఇంతశక్తి పుట్టునని లెక్కగట్టి చూపినాడు. ఈ నిరూపణవలన విశ్వమందలి ఒక గొప్ప విషయమునకు ఉపపత్తి గోచరించినది. కోట్లకొలది నక్షత్రమండలము లెంతకాలమునుండియో వెలుతురును, వేడిమిని వెదజల్లుచున్నవి. ఆశక్తియంతయు నెట్లు పుట్టుచున్నది? ఏమగుచున్నది? అను ప్రశ్నలకు సరియైన సమాధానము దీనివలన లభించినది. నక్షత్రములనుండి వెలువడు తేజస్సు ఆగోళములయందలి ద్రవ్యము నశించుటచేత కలుగుచున్నదని నిర్ధారణ చేయబడినది. సూర్యుడు వెదజల్లు తేజశ్శక్తినిబట్టి ప్రతి దినమునను కొన్నివేలటన్నులు బరువుగల ద్రవ్యమును అతడు కోల్పోవుచున్నాడని లెక్క తేలుచున్నది. సూర్యగోళముయొక్క బరువు ఈ బరువుకంటె ఎన్నో లక్షల కోట్ల రెట్లుండుటచేత సూర్యగోళమున కెట్టియాపద రానైయున్నదో యన్నచింత ఇప్పుడవసరములేదు.

ఒక విశేషవిషయము చెప్పవలసియున్నది. ఈమధ్య నాలుగైదేండ్లనుండి హైడ్రజనుబాంబు అను ఘోరాతిఘోరమగు మారణసాధనమును గురించి మనము ఎంతో వినుచున్నాము. ఈబాంబులో హైడ్రజనుగాలి హీలియము గాలిగా మారుచున్నది. ఈమార్పులో కొంతద్రవ్యము మాయమై వేడిమి, వెలుతురుగా ప్రసరించుచున్నది. ఇట్టి క్రియాకలాపమే సూర్యాదినక్షత్రగోళములయందు అనుక్షణ

మును కొన్నివేలకోటిసంవత్సరములనుండి జరుగుచున్నది. ఆగోళములన్నియును మహత్తరములగు హైడ్రోజను బాంబులే. సూర్యగోళమట్టిదే. అది మనకు సుమారు ఒకకోటిమైళ్ళ దూర మందుండుటచేత ఆ మహత్తరశక్తి, సౌమ్యరూపమునుపొంది, మన భూగోళవాసులయొక్క క్షేమలాభములకై ఉపయోగపడుచున్నది. సూర్యగోళమునుండి వెలువడు శక్తివలననే, బొగ్గునుండి, పెట్రోలు మొదలగు నూనెలనుండి పుట్టుచున్న శక్తియు, నీటిశక్తి (Water Power) వాయుశక్తి, మొదలగు శక్తులన్నియు నాగరకప్రపంచమున కంతకు నాధారభూతములగు వేడిమి, వెలుతురు, విద్యుత్తు మొదలగు శక్తులన్నియు, కలుగుచున్నవి. ఈపరమాణుశక్తి ప్రాణపదమై, శాంతియుతమై, ప్రపంచపోషణ కాధారభూతమగుచున్నది. ఇది ఒక యద్భుతమగు విషయము.

సూర్యగోళమునుండి వెలువడు తేజశ్శక్తిలో స్వల్పాతిస్వల్పమగు భాగము మాత్రమే భూగోళమును చేరుచున్నది. తక్కినదంతయు ఏమగుచున్నది? ఇట్లే కోట్లకొలది ఉన్న నక్షత్రగోళములనుండి వెలువడు తేజశ్శక్తి ఏమగుచున్నది? విశ్వమందున్న నక్షత్రగోళము లాక్రమించిన స్థలము విశ్వాంతరాళమాక్రమించియున్న స్థలములో ఇంతయని యెన్నదగినంతలేదు. అందుచేత అనంతకోటి నక్షత్రగోళములనుండి వెలువడు తేజశ్శక్తి యంతయు విశ్వాంతరాళములోనికే ప్రసారమగుచున్నది. అట్టిచో అదేమగుచున్నదను సందేహము పుట్టుచున్నది. దీనికి తగిన సమాధాన మింకను దొరకలేదు. కాని విపరీతమగు చల్లదనము

గల విశ్వాంతరాళములో ఈతేజస్సు పోయిపోయి మిక్కిలి తేలిక యగు ద్రవ్యముగా ఘనీభవించుచున్నదేమోయని కొందరూహించు చున్నారు. ఇట్టి ద్రవ్యమే క్రమముగా దట్టమై దూదిపింజ రూప ముతో విశ్వాంతరాళమందు కోటికోటిమైళ్ళదూరమున గోచ రించు నెబ్యులాలను బ్రహ్మాండములకు బీజ మగుచున్నదని వారి యూహ. దీనినిబట్టిచూడగా నక్షత్రగోళములనుండి ద్రవ్య మంత రించి తేజశ్శక్తిగామారి విశ్వాంతరాళములో ఎచ్చటనో తిరిగి ద్రవ్యరూపముగా ఘనీభవించి నెబ్యులాలుగా రూపొందుచున్నదని ఊహింపవలసియున్నది. ఈ నెబ్యులాలే క్రమముగా గట్టిపడి నక్షత్రలోకములుగా మారుచున్నవని శాస్త్రము చెప్పుచునట్లున్నది. ఇట్లు ద్రవ్యము శక్తిగాను, శక్తి ద్రవ్యముగాను మారుచు ఒకమహా పరివర్తనచక్రములో పరిభ్రమించుచున్నవని చెప్పవలసియున్నది!

పరమాణుశిల్పమునకు విశ్వశిల్పమునకు కొంత పోలిక యున్నదని చెప్పియుంటిని. ఈరెండింటికినిగల తారతమ్యమును గురించి కొంతవివరించవలసియున్నది. పరమాణువులోని ఎల క్ట్రాను, ప్రోటాను, న్యూట్రానులమధ్యగల శక్తుల (forces) యొక్క స్వభావము విద్యుదయస్కాంత శక్తుల (electro-magnetic forces) వంటిది. వీనియొక్క స్వరూపస్వభావ ములు శక్తి కణవాదము (quantum theory) ను బట్టి నిర్ణ యింపబడుచున్నవి. ఇది సూక్ష్మప్రపంచమునకు సంబంధించిన విషయము. దీనియందలి గతిశాస్త్రము శక్తి - కణ గతిశాస్త్రము (quantum dynamics). ఇది స్థూలమగు ప్రపంచమందలి,

అనగా విశ్వమండలి, పెద్దపెద్ద ద్రవ్యఖండములకు సంబంధించునట్టి గతిశాస్త్రమునకు (Celestial Mechanics) వ్యత్యయమైనది. ఈవిషయము పైనొకచోట చేర్కొనబడినది. మరియు విశ్వమండలి ఖండఖండములమధ్యగల శక్తి ద్రవ్యాకర్షణశక్తి (gravitational force). దీనిస్వరూప స్వభావములన్నియు దేశ - కాలముల కంటినియమ్ (Continium) యొక్క గుణవిశేషములు. ఇవి సాపేక్షవాదమునుబట్టి నిర్ణయింపబడినవి.

అందుచేత సూక్ష్మప్రపంచ స్వభావము, స్థూలప్రపంచ స్వభావము ఒకదానికొకటి పొందని మూలతత్త్వములమీద ఏర్పడియున్నట్లు కన్పించుచున్నది. ఇది కేవల మసందర్భమని, ప్రకృతియొక్క మూలతత్త్వములో భిన్నత్వ ముండనేరదని విభిన్నములుగా గోచరించు ఈతత్త్వములు ఏదో ఏకతత్త్వముయొక్క భిన్నరూపములై యుండవలెనని గాఢవిశ్వాసముతో ఐన్స్టయిన్ పరిశ్రమించి రెంటిని సమన్వయింపగల ఐక్యక్షేత్ర సిద్ధాంతమును (Unified Field Theory) ప్రతిపాదించినాడు. ఈసిద్ధాంతము ప్రత్యక్షనిదర్శనములచేత నిరూపింపబడగలదని, ఈఐక్యక్షేత్రగణితమునుండి శక్తి - కణ వాదముయొక్క సూత్రములను, గురుత్వాకర్షణసూత్రములనుకూడ తెలిసికొనవచ్చునని నమ్ముచున్నారు. ఇది భౌతికశాస్త్రజ్ఞానమంతకును భేదరహితమగు ఏకైకసిద్ధాంతముగా నిశ్చయింపబడగలదని ఆశించుచున్నారు.

---

# క్షేత్రయ్య

ఆంధ్రదేశమందలి సంగీత సంప్రదాయములలో క్షేత్రయ్య పదములు గొప్ప స్థానము నలంకరించుచున్నవి. ఆకాలమందలి రక్తి రాగములకు సర్వాలంకారశోభితమగు స్వరూపమును కల్పించి, పదములను పాడి సంగీత సంప్రదాయమునకు క్రొత్త వెలుగులు, రమ్యత, రంజకత్వము కల్పించి, క్షేత్రయ్య వాగ్గేయ కారులకు మార్గదర్శియైనాడు.

క్షేత్రయ్య కృష్ణాజిల్లా దివితాలూకాలోని మొవ్వగ్రామస్థుడు. సంగీత సాంప్రదాయ ప్రదర్శినిలో ఇతడు తెలుగు బ్రాహ్మణుడని, "మువ్వపురి" వాస్తవ్యుడని యున్నది. కీర్తిశేషులైన సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారు క్షేత్రజ్ఞునిగురించి వ్రాయుచు నార్త్రార్కాటు జిల్లాలోని "మూవపురి" (Moovapura) వాసియని వ్రాసినారు. నార్త్రార్కాటులో అట్టి ఊరు నేడు కానరాదు. వీరిని అనుసరించో ఎట్లో ఇటీవల కొందరు చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి తాలూకా లోని "మువ్వపురి" యని వ్రాయుచున్నారు. అక్కడ 'మువ్వల వారి పల్లె' ఒకటుండెనని రివిన్యూ రికార్డులో కలదు. కాని అదికూడ నేడులేదు. అక్కడ వెలసిన గోపాలదేవుని ఆలయము లేదు. ఆ చుట్టుపట్ల క్షేత్రయ్య పదము లెవరికిరావు. ఆ సంస్కార సంపర్కములు కానరావు. కృష్ణాజిల్లాలో మొవ్వ గ్రామ మున్నది. అదే 'మువ్వ'. ఆయూరిలో గోపాలదేవుని ఆలయమున్నది. దేవుడు మొవ్వగోపాలుడు. క్షేత్రయ్య పదములను మువ్వ

గోపాల ముద్రతో వ్రాసియున్నాడు. ఆయూరి వారందరును క్షేత్రయ్య మాయూరివా రనున్నారు. వారి వంశస్థులమనువారు రెండుకుటుంబములవారున్నారు. మరియు మువ్వకు అతిసమీప మున కూచిపూడి యను గ్రామము కలదు. అక్కడివారు సుప్రసిద్ధులైన కూచిపూడి భాగవతులు. వారు నాట్యకళానిపుణులు. వారికి క్షేత్రయ్య పదములు పాడుట, అభినయించుట, అందలి అలంకారశాస్త్రవిషయములగు నాయికానాయక భావములగురించి, విశేషార్థముల గురించి వివరించుట అనుశ్రుతముగా వచ్చుచున్నది. వారివద్ద 1874 లో అచ్చొత్తిన క్షేత్రయ్య పదముల పుస్తకములున్నవి.

మువ్వగోపాల పదములలో అక్కడక్కడ ఇతరదేవుళ్ళ పేళ్ళుకూడ చేర్చబడియున్నవి. ఆదివరాహ, శ్వేతవరాహుడు - తంజావూరుజిల్లా వరహూరులోని స్వామి - 'తిల్లగోవిందుడు, తిల్లగోవిందరాజ' - చిదంబరములోని గోవిందరాజస్వామి, కడప వెంకటేశుడు, కరిగిరివరద. కంచివరద - కంచివరదరాజస్వామి, శ్రీవెంకటేశుడు - తిరుపతివెంకటేశ్వరస్వామి. ఇట్లేన సుమారు ఇరువది క్షేత్రములలోని దేవుళ్ళను పేర్కొనినాడు. దీనిని బట్టి ఈ కృతికర్త అనేక క్షేత్రములకుపోయి భక్తిపారవశ్యమున ఆదేవుళ్ళయెదుట పదములను పాడినాడని చెప్పవలసియున్నది. ఇన్నిక్షేత్రములు తిరుగుటచేత, అట్టిపని తరచు చేయుచుండుటచేత క్షేత్రయ్య అని క్షేత్రజ్ఞుడని పేరువచ్చినట్లు చెప్పుదురు. దీనితో అసలుపేరేదో మరుగుపడినది.

పుంప నరసింహకవి రచితమగు 'ఆంధ్రకౌముది' అను ప్రాతపుస్తకమందు, ఈ క్రింది పద్య ముదహరింపబడి యున్నది.

తముదామె వత్తు రర్థుల
క్రమమెరిగిన దాతకడకు రమ్మన్నారా
కమలమ్ము లున్నచోటికి
భ్రమరమ్ముల అచ్యుతేంద్ర రఘునాధనృపా.

ఏమని రమ్మనగా నాసభకు వచ్చితివని ఫలోక్తిగా క్షేత్రయ్యను రఘునాథభూపతి అడుగగా ఆశువుగా సభలో సమాధానముగా క్షేత్రయ్య చెప్పిన పద్యమిది. రఘునాథుని కాలములో వచ్చినప్పటికి అతని కుమారుడగు అచ్యుతవిజయరాఘవుని కాలములోనే పదములు చెప్పినట్లు క్రిందిపదమునుబట్టి చెప్పవలసి యున్నది.

కాంభోజి — త్రిపుట

(దేవగాంధారి — ఆది, అని కొందరు)

ప॥ వేడుకతో నడచుకొన్న విటరాయడే॥

అ॥ ప॥ ఏడు మూడు తరాలనుండి యెందునాగాని యెవతె
కూడుకొని మువ్వగోపాలుడు కృపగల్గినావిభుడు ॥వే॥

౧. మధురతిరుమలేంద్రుడు - మంచి బహుమానమొసగి
యెదుట గూర్చుండుమని యెన్నిక యిమ్మనెనే
యిదిగో రెండువేల పదములిపు డెంచుకొమ్మనిన
చదురుమీదనే మున్న సామికి సంతోష మింతింతగాదె ॥వే॥

౨ ఆశమీర తంజాపురినేలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానే బహుమానమిచ్చె నావేళ ॥వే॥

౩ బలవంతుడై గోలకొండ పాదుషా బహుమానమిచ్చి
తులసిమూర్తితో వాదడలచె నావేళ
వెలయ మువ్వగోపాలుడు వెయ్యిన్నేనూరుపదములు
నలువది దినములలోన నన్నుగలసి వినిపించెనే ॥వే॥

తిరుమలనాయకుడు 1623—1659 ల మధ్య విజయరాఘవుడు 1633—73 ల మధ్య, నాటి గోలకొండనవాబు అబ్దుల్లాకుతుబ్షా 1622—72 ల మధ్య రాజ్యములు చేసిరి. దీనిబట్టి క్షేత్రయ్య 1633 ప్రాంతములకు తంజావూరు వచ్చినాడని తెలుచున్నది. రఘునాధుని రాజ్యాంతమందని, పైనుదహరించిన పద్యమునుబట్టి 1633 నకు కొంచెము ముందని భావించవలెను.

పైపదమునుబట్టి 4500 పదములు లెక్కకువచ్చుచున్నవి. ఇవి ఎవరికంకితములో తెలుపబడలేదు. కాని మూడవచరణములో పాదుషాసభలో "తులసిమూర్తి" అనువారితో వాదు కలిగినట్లును మువ్వగోపాలు నను గ్రహమున 40 దినములలో 1500 పదములు చెప్పినట్లున్నది. అందుచేత మువ్వగోపాలుని కంకితములా అవి సందేహించవలసియున్నది. కాని నేడు దొరకు పదములలో సుమారు 320 మాత్రమే మువ్వగోపాలాంకితములు,

12 విజయరాఘవునిమీదివి. 3 తుపాకుల వేంకటకృష్ణునిమీద చెప్పినవి.

సంగీత సంప్రదాయప్రదర్శినిలో క్షేత్రయ్యగురించివ్రాయుచు శ్రీసుబ్బరామదీక్షితులవారు, తమవద్ద 500, ల పదములు స్వర పరచిన వున్నవని, అచ్చొత్తించెదమని వ్రాసినారు. ఆపని పూర్తి కాకుండగనే వారుకీర్తిశేషులైనారు. కర్ణాటకసంగీతమునకు గొప్ప లోటు కలిగినది. వారి వారసులవద్దగాని, మరియెచటనుగాని, అవి లభ్యముకాలేదు; ఎప్పుడు లభ్యములగునో!

పదకవిత్వములో క్షేత్రయ్య అగ్రగణ్యుడు అని చెప్పవలెను. పదకవిత్వమునకు పెక్కు మెఱుగులు ఇతడు దిద్దినాడు. ఇతను తన పూర్వీకుల పదములను బాగుగా తెలిసి వారిని అనుసరించినా డనుట కుదాహరణములు రెండు.

I. తాళ్ళపాక అన్నమయ్య

కటకటా అయ్యో కాంతవింత యేపుదురా
అటుమటగాదు నీయానసుమ్మీ విజమయ్యా ॥కటకటా॥
కోరిన నిన్నేకాని కోపించినా నిన్నేకాని ।
కసరినా నిన్నేకాని కాదన్నా నిన్నేకాని
కొనియాడినా నిన్నేకాని గుంపించినా నిన్నేకాని
పవివిన్నా విన్నేకాని పాడినా నిన్నేకాని ।
మనసిచ్చి యలమేలు మంగపతి వేంకటేశ
యెనసితివి మాచెలినింక నేచనేమిటికయ్యా ॥కటకటా॥

క్షేత్రయ్య —

బిలహరి — త్రిపుట.



ప॥ ఇంత తెలిసియుండి ఈగుణమేలరా ॥ఇంత॥

అ॥ ప॥ పంతమా ముద్దుగోపాల నాసామి ॥ఇంత॥

చెలికత్తెవైనా నీవే చెలువుడవైనా నీవే

తలచిచూడ నాపాలి దైవమునీవే ॥ఇంత॥

అంతరంగమైన నీవే ఆదరించినా నీవే

చింతించిచూడ నాజీవనము నీవే ॥ఇంత॥

నా నేరుపైనా నీవే నమ్మిక లిచ్చినా నీవే

యానగా బలికెద నాయానందమైన నీవే ॥ఇంత॥



II. పురందరదాసు —



పున్నాగవరాళి — అటతాళము.

ప॥ బుద్ధిహేళే గోపి నిన్న ముద్దుకందగె ॥బుద్ధి॥

అ॥ ప॥ సద్దుమాడదె బందు — ముద్దనిట్టు హోదనమ్మ ॥బుద్ధి॥

చ॥ గంధ కస్తూరి పునుగు — చందదింద పూసికొండు

మందహాస దిందబందు — ఇందిరేశను

సింహశయన తాబందు — మందిరవొళగె పొక్కు

సందు గొందు గళపాడికే—సరసవాడి హోదనమ్మ ॥బుద్ధి॥

దీనిని తెలుగున ఇట్లనవచ్చును

ప॥ బుద్ధిచెప్పు గోపీ నీముద్దుబిడ్డకు ॥బుద్ధి॥

అ॥ ప॥ సద్దుచేయక వచ్చి ముద్దుపెట్టి పోయెనమ్మ ॥బుద్ధి॥

చ॥ గంధము కస్తూరి పునుగు అందముగా పూసికొని
మందహాసముతో వచ్చి ఇందిరేశుడు
సింధుశయనుడు వచ్చి మందిరములో జొచ్చి
కందుగొందులు వెదకి సరసమాడి పోయెనమ్మ ॥బుద్ధి॥

క్షేత్రయ్య —

శంకరాభరణము — చాపుతాళము.

ప॥ ఎవ్వడే యోభామ వాడెవ్వడే ॥ఎవ్వడె॥
అ॥ ప॥ ఎవ్వడే నేను ఐవ్వళించినవేళ బువ్వబాణమువేసి రవ్వ చేసిపోయ్యెనే ॥ఎ॥
పట్టపగలు వాడు వచ్చి బలుదిట్టగ నాయిల్లుచొచ్చి ముద్దు పెట్టి పోయెనే

ఇట్లే మూడు పాదములలో రెండు పదములకు పోలిక లున్నవి.

పదములందు జానుతెలుగు క్షేత్రయ్య ధారాళముగా వాడినాడు. ఇందు అన్నమయ్య మార్గమును పూర్తిగా అనుకరించినాడు. తాళ్ళపాక అన్నమయ్యగారి రెండవకుమారుడైన పెదతిరుమలాచార్యులవారి రెండవకుమారుడగు చినతిరువెంగళనాథుడు, తాతగారు సంస్కృతమున వ్రాసిన సంకీర్తన లక్షణమును తెలుగులో పద్యములలో రచించెను. దానిని "సంకీర్తన నామక పదసంప్రదాయంబు" అని అన్నాడు. అందలి ఈ కంద పద్యానుసారముగా భాషలోని దేశీయతను, జాతీయతను, నుడి.

కారమును, పలుకుబళ్ళను, గ్రామ్యోక్తులను పాత్రోచితముగా క్షేత్రయ్య తనపదములయందు పొంకముగా పొందుపరచినాడు.

క॥ పదములు శ్రుతిగారవస
మ్మదమున మధుర మనోజ్ఞవాక్య మిశ్రములై నన్
విదితార్థన్ గ్రామ్యోక్తులు
పదిలముగా పొంకమెసగ పలుకగ జెల్లున్.

ఉదాహరణములు :— అయ్యాసీ. వచ్చేసి, పొయ్యాసి; నవ్వులంటి యున్నావేమో ; నావద్దుమాకు ఈసారి; పేదసాదల కిడియూరా - యిందు పిన్నపెద్దలెవరు లేరా - యీవీధివారెల్ల సింత వాదనేగాని - వామఫిర్యాది ధరణిలో లేదాయె ; అన్న దమ్ము లెడబాయనీ - ఆపదూరైతేకాని ; చలపట్టి ఇంతరాదు ; చేపట్లుకావచ్చునా మీలోమీకు.

లోకోక్తులు :— అరటాకుముల్లు సామ్యము; కలిపోసిన ఉట్టి వంకలుచూచే వయ్యాయ్యో; పామాడిజోగివలె పోయె నా బ్రతుకు: బావిలోని నీరు వెల్లువపోయ్యానటవే.

క్షేత్రయ్య ఇతరకవుల ననుకరించెను. 1. ‘ కాయజుని తలిరు పదనుకత్తులమ్మాయీ చెలులు ’ అనునది శ్రీనాథుడు. కాశీఖండములో వ్రాసిన, " కంచియఱవతఁలసమాస్త్రుఖడ్గలతలు " అనుదానికి అనుకరణ.

2. యదుకులకాంభోజి — ఆదితాళము, పదము. " ఎంత చక్కనివాడె నాసామి - వీడెంత చక్కనివాడే " అనుదానిలో ‘ తళుకారు చెక్కుటద్దములవాడే ’ " మెఱుగు చామనచాయ-మేన

పుడువాడే" "కొదమసింగపు నడుము కొమరమరువాడే" అని ప్రయోగించియున్నాడు. ఇది చామకూరు వెంకటకవియొక్క విజయవిలాసములోని సుభద్ర అర్జుని వర్ణించు సుప్రసిద్ధమగు పద్యమును పోలియున్నది. (ఎగుభుజంబులవాడు)

క్షేత్రయ్య స్వాతంత్రముగా చిత్రవిచిత్రమైన పోకడలు చూపియున్నాడు. ఈవర్ణన ఎంతభావగర్భితముగా ఉన్నదో చూడుడు.

ప॥ ఇన్నివిధముల పూజించేరసామి - యింతిని నను
గూర్చుమీ ॥ఇ॥

అ॥ ప॥ నిన్నెంతోగా వేడుకొన్నందుకా నా - సెంజలిదీర్చు సామీ
॥నాసామీ ॥ఇ॥

౧. కన్నె మోము నేను కనుగొనగలిగిన
పున్నమొక్క ప్రొద్దుండేర సామి।

మోము పున్నమచందురువంటిది; కనుక పున్నముపాస ముండుట.

కన్నులు ముద్దాడగలిగిన నే జంట
కలువపువ్వుల బూజించేర సామి।

రెండు కండ్లు రెండు కలువలవంటివి; కనుక జంటకలువ పువ్వులతో పూజించుట.

ఇట్లే మూడు చరణములలోను సొగసైన పోకడలు పోయి నాడు 'క్షేత్రయ్య'.

క్షేత్రయ్య గొప్ప ఆలంకారికుడు. అతని పదములన్నియు అలంకారశాస్త్రమునకు హృద్యములగు గొప్ప లక్ష్యములు. కవి రత్న భానుదత్తమిశ్రునిచేత, 16 వ శతాబ్దపు రెండవభాగమున వ్రాయబడిన "రసమంజరి" యను సంస్కృతగ్రంథములో 230 పైగా నాయికాభేదముల లక్షణము తీయబడినవి. లక్ష్యము లుగా శ్లోకములు వ్రాయబడినవి. ఈ అలంకారశాస్త్రము కూచి పూడిలోని నాట్యశాస్త్రవేత్తల పఠనపాఠములలో ముఖ్యమైనది. ఇది క్షేత్రయ్య చదివియుండును.

వెంకటగిరి సంస్థానములో ఒక మహానుభావుడు తనపేరు చెప్పకయే "శృంగారరసమంజరి" అని ఒక వ్రాతగ్రంథములో రసమంజరికి క్లుప్తముగా తెలుగున తాత్పర్యము వ్రాసి ప్రతిలక్షణ మునకు లక్ష్యముగా క్షేత్రయ్య పదముల నిచ్చియున్నాడు; ఆంధ్ర సాహిత్యమునకు మహోపకారమొనర్చినాడు. క్షేత్రయ్య పదములు భానుదత్తమిశ్రుని శ్లోకములకంటె ఎంత మిన్నలై హృద్యము లైన లక్ష్యములో చదివి అనుభవించినగాని తెలిసికొనలేము.

మరియు క్షేత్రయ్య సుప్రసిద్ధుడగు జయదేవుని రచన బాగా ఎరిగినవాడై యుండెననికూడ తోచుచున్నది. 18 వ అష్ట పదిలో 'హరి రభిసరతి వహతి మధుపవనే' అనుదానిలో కల హాంతరిత లక్షణమున పతిని ప్రణయకోపమున తిరస్కరించి తరువాత పరితపించు రాధను దూతిక మందలించుట, అనునయిం చుట కలదు. తరువాత 'స్నిగ్ధేయత్పరుషాఽసి' యను శ్లోకములో రాధ దుశ్చేష్టలను దూతిక మందలించును. ఈ భావములే తోడి

రాగములో "ఏమని మాటికివే కోమలి నీకోపము కొల్లిపోవద్దా" అను పదమున కనవచ్చును. ఇంక సప్తశిఖాలక్షణమునకు లక్ష్యము వ్రాయబడినది.

సంగీతమునకు జీవము రాగము. దాని స్వరూపస్వభావము లెట్లు ఏర్పాటు చేయవలెనో. పల్లవి అనుపల్లవి చరణములలో రాగవ్యాప్తి ఎట్లు చేయవలెనో ప్రప్రథమమున స్పష్టపరచి క్షేత్రయ్య తన ప్రతిభను వ్యక్తపరచినాడు. ఎత్తుగడ, తరువాతి నడక, స్వరసంచారములు, కూడికలు, పోకడలు చూపుచు రాగము యొక్క జీవకళను పదములు చిప్పిలచేయుచుండును. క్షేత్రయ్య చిత్రించిన రాగస్వరూప మతిసుందరము, మనోహరము. పదము లను విలంబకాలములో పాడుటచేత అందలి సాహిత్యభావముతో, రాగభావము ఏకమై, ప్రతి స్వరముయొక్క రూపము పూర్తిగా వ్యక్తమై, అక్షరక్షరమందు రాగసుధ ఒలుకుచు కర్ణపేయమై రససిద్ధి కలుగును.

ఆకాలములోని రక్తిరాగములనే (40) క్షేత్రయ్య వాడి వానిని తీర్చి దిద్దినాడు. రాగస్వరూపములకు పునాదులను ఏర్పరచి దివ్యహర్మ్యములను నిర్మించినాడు. ఒక్కొక్కరాగములో అనేక పదములను పాడెను. భావానుగుణముగా రాగచ్ఛాయల ననువదించెను. ఎత్తుగడలు, వివిధములగు సంచారములు, ఆయాభావములను పోషించుచుండును. తోడిలో 'ఏమంటినమ్మా' యను పదములో దైన్యము, శోకము కలవు. ఎత్తుగడ ఆధారషడ్జము దగ్గరనుండి జాలికలిగించు రాగచ్ఛాయ కలిగియున్నది. ఈపద్ధతినే

"ఏమిదాగినావో" అను కృతిని త్యాగయ్యవారు రచించి మెరుగు లను దిద్దినారు. షడ్జమునకు క్రిందకుపోయి ఇంకను దీనభావమును వెల్లడించినారు.

నాయకునియెడ యొనర్చిన యుపచారములకు నాయికను కఠినముగా ప్రియసఖి మందలించు సందర్భములోని "ఏమని దూరితివే" అను తోడి రాగపదములో ఎత్తుగడ ఆధారషడ్జమునకు బాగా పైకిపోయి తారషడ్జము నందుకొన్నది. నాయకి నాయకుని మీద కోపముచేత పరుషముగాడినదని ధ్వనించునట్లుగా "దూరితివే" యన్నచోట రాగసంచారములో ని స రి స, ని స రి స యని ముందుకు వెనుకకు స్వరముల నూపు లాడించినారు. ఇట్టి భావానుగుణములైన హృద్యమైన పోకడలతో క్షేత్రయ్య పదములు నిండియుండును.

మరియు కొన్ని పదములలో "మేరగాదు రమ్మనవే" అను సహానరాగపదములో, రాగముయొక్క స్వరూపమునంతయు క్షేత్రయ్య ఒక్కమారుగానే చిత్రించినాడు.

పదములు అభినయమున కనుగుణములై, విలంబకాలములో తాళజటిలముకలిగి, త్రిపుట, ఆట, చాపు, జంపె తాళములెక్కువగా ఉపయోగము కలిగి, యుండును. 7, 5, 3 అక్షరయుక్తములై విషమగతి కలిగి ఎదురెత్తులు, విరుపులు కలిగి నాట్యమునకు చైతన్యమును ఇచ్చుచుండును. క్షేత్రయ్య నాటిన సంగీత కళాంకురములను త్యాగయ్యగారు, దీక్షితులవారు, శ్యామశాస్త్రిగారు

పెంపొందించిరి. ఇట్లు కర్ణాటకసంగీతము సర్వతోముఖముగా అభివృద్ధిపొందినది.

క్షేత్రయ్యనాట్యవిద్యావిశారదుడు. కైశికీవృత్తి ప్రధానమగు నాట్యకళయందు - అభినయకళయందు, శృంగారరసనిలయము లగు నాయకీ, నాయక లక్షణములయందు సంపూర్ణప్రజ్ఞ నేర్చిన వాడని చెప్పవలసియున్నది. ఈతడు పదములను పాడి, భావము నభినయించుచు ఆడి, నృత్యగీతవాద్యాత్మకమగు సంగీతమును అనుభవించి రససిద్ధిపొందిన సంగీతవేత్త యని చెప్పుట కేమియును సందేహమక్కరలేదు.

అలంకారశాస్త్రమునకు కృష్ణాతీరవాసియగు క్షేత్రయ్య గొప్ప లక్ష్యగ్రంధమును వ్రాయగా ఇదేకాలమందు గోదావరీతీర వాసియగు జగన్నాథపండితరాయలు ఢిల్లీ దర్బారులో ఆస్థానకవిగా నుండి రసగంగాధరమను గొప్ప అలంకార లక్షణగ్రంధమును వ్రాసినాడు. వీరిద్దరు తెలుగువారై అలంకారశాస్త్రమున కమూల్యమైన సేవచేసి దేశమునకు ప్రఖ్యాతిగడించిన ప్రతిభాశాలులు.

## త్యా గ రా జ స్వా మి

దేశముయొక్క ప్రత్యేకత, గొప్పతనము దాని సంస్కృతినిబట్టి గ్రహించవచ్చును. విద్యలలోను, కళలలోను సంస్కృతి ఇమిడియుండును. భారతదేశమందు విద్యలలో అధ్యాత్మవిద్య, కళలలో సంగీతము మిక్కిలిముఖ్యమైనవి. సంగీతకళద్వారా అధ్యాత్మ సత్యమును తెలిసికొనుట సనాతనమార్గములలో ఒకటి.

అట్టి మార్గముచేత యోగిమైతరించిన శ్రీత్యాగరాజస్వామి సిద్ధి పొంది నేటికి నూరేండ్లు పూర్తియైనవి.

త్యాగరాజు దేశముయొక్క పుణ్యముచేత అవతరించిన మహాపురుషుడు. మహాపురుషుడగుట కనేక కారణము లుండును. అన్నిటికంటె బలవత్తరమైనది పూర్వజన్మసంస్కారము. వంశ సంప్రదాయము, దేశకాలపరిస్థితులు దీనికి సహాయములు. రామ విగ్రహపూజ, భాగవతపారాయణ త్యాగరాజునకు తాతతండ్రుల నుండి వచ్చినవి; ఉత్తమవంశమున జన్మించినాడు త్యాగయ్య. త్యాగయ్యగారు నివసించిన తిరువయ్యారు భారతీయవిజ్ఞానకేంద్ర ములలో ఒకటి. సమీపములోనున్న మేలటూరు, శూలమంగళము మొదలగుగ్రామములలో వీధినాటకము లాడుట విరివిగా ఉండెను. తంజావూరు ఆస్థానవిద్వాంసులు వీణాచార్యులునైన శొంఠివెంకట రమణయ్యగారు తిరువయ్యారులోనే నివాసము చేయుచుండిరి. వీరు త్యాగయ్యగారికి గురువులు. త్యాగయ్యగారి మాతామహులగు వీణకాళహస్త్యయ్యగారు సంగీతవిద్వాంసులు. త్యాగయ్య తల్లిగారు పురందరదాసు రామదాసుల భక్తికీర్తనలు చక్కగాపాడెడివారు, త్యాగయ్యగారి శారీరము మృదుమధురమై, త్రిస్థాయి సులువుగా పలుకుచుండెను. పాటయందు వాక్శక్తి, సమ్మోహనముగ పాడగల శక్తి స్వభావముగా త్యాగయ్యకు ప్రసాదింపబడినవి. ఇలవేల్పగు శ్రీరాముడు ఆయన కిష్టదైవము. తారకమంత్రమును బాల్యమందే ఉపదేశమునుపొంది నడివయస్సువచ్చునరికి తొంబదియారుకోట్లు జపించి మంత్రసిద్ధి పొందిరి. వీణావాద్యనిపుణుడు ; సంగీత

శాస్త్రము బాగుగ నెరిగినవాడు. నారదమహర్షి స్వరార్ణవగ్రంథ మును ప్రసాదింపగా త్యాగరాజు సంగీతవిద్యలో నిస్సంశయమైన కూలంకషప్రజ్ఞ సంపాదించెను. గొప్పసంగీతవేత్తలు, వాగ్గేయ కారులు నైన శ్యామశాస్త్రి, దీక్షితులుగార్లు ఆయనకు సమకాలికులు. ఇట్టి బ్రహ్మాండమైన సందర్భములో జన్మించి, పెరిగిపెద్దవారైన త్యాగయ్య మహాభక్తుడు, గొప్పసంగీతవేత్త, అసమానమైన వాగ్గేయకారుడు, జ్ఞాని, విరాగి యై వెలయుటలో ఆశ్చర్య మేమున్నది !

ఇన్నివిధముల ప్రతిభావంతుడైన త్యాగరాజస్వామిగురించి ఎంతైన చెప్పవచ్చును. కాని, కొన్ని విషయములగురించియే క్లుప్తముగా చెప్పెదను. త్యాగరాజు సంగీతబ్రహ్మ ; ఇతడు చేసిననూతనసృష్టి అద్భుతము. ప్రాచీనోత్సవసంప్రదాయమునకు దగినపాటలు, భజనపద్ధతికి అనుకూలములై, పదయమకములు గలిగి ప్రవాహమువలె పరుగిడు సంస్కృతాంధ్ర దివ్యనామములు, రక్తిరాగములలోపాడి క్రొత్తమెరుగులను దిద్దినాడు. ఉత్కృష్టమగు సాహిత్యమును, దివ్యమైన సంగీతమునకు జతజేసి పంచరత్నము లను నిరుపమానమగు సంగీతశిల్పములను త్యాగరాజు సృజించెను. ఈయవగేయరచనలో నివి అగ్రస్థానము నలంకరించుచున్నవి.

సాహిత్యపంజరములో చిక్కుకొనిన సంగీతమను చిలు కను సాహిత్యబంధములనుండి విడిపించి, సాహిత్యము నప్రధా నముచేసి, సంగీతములో స్వేచ్ఛావిహారము సలుపుటకు వీలుగా కృతులను వ్రాసినాడు. ఈ కృతులు సంగీతప్రపంచములో నూతన

ములు, సుందరములు నైన దివ్యభవనరాజములు. మరియు అభ్యాసకులకు, విద్వాంసులకు కూడ నభ్యసింప వీలైన, సులభములు కష్టములు కష్టతరములు నగు పలుతరగతుల కృతులను వ్రాసి సంగీతమును సర్వాంగసుందరముచేసి మహోపకార మొనర్చినాడు. ఈ విషయములో నితని కితడే సాటి.

ఈ నూతన సృష్టివలన పాటకునికి స్వేచ్ఛ, సౌలభ్యము ఏర్పడుటయేగాక ప్రతి కృతిలోను జాగా చేసికొని మనోధర్మమును, భావోద్రేకమును, చూపించుట కవకాశము కలిగినది.

త్యాగయ్యగారి కృతులకు సంగతులు అని మనము చెప్పుకొనునవి జీవము. కృతులలో సంగతులు వేయుట యనునది త్యాగరాజస్వామి యొక్క సృష్టి. సాహిత్యమందలి భావమును ఎన్నివిధముల రసోచితముగా వ్యక్తము చేయవచ్చునో అన్నివిధముల చేయుటకై అనుకూలమగు రాగభావములను సాహిత్యముతో జతచేసి పాడుటను సంగతులు వేయుట యందుము.

ఆకాలములో ప్రచారములో లేని ఖరహరప్రియ, హరికాంభోజి, చక్రవాకము, షణ్ముఖప్రియ మొదలగు రాగములను త్యాగరాజు ఉద్ధరించెను. సుమారు నలుబది మేళకర్తరాగములకు, వాని జన్యరాగములకు కృతులు వ్రాసి లక్ష్యములను త్యాగరాజు కల్పించెను. భక్తిపూరితుఁడై, అంతరాత్మచే నుద్బోధితుడై, రసావేశముతో నిండి పొంగు హృదయముతో అనేక మనోభావముల వెల్లడించుటలో నూతనరాగములను త్యాగయ్య సృష్టించి

నాడు—నవరసకన్నడ, కుంతలవరాళి, బహుదారి. జయంతశ్రీ, గరుడధ్వని, రాగపంజరము, స్వరావళి మొదలైనవి.

సంగీతమును త్యాగయ్య తాళబంధమునుండి గూడ విడి పించినాడు; ఎదురెత్తు నడకలు, అడ్డదిడ్డపు వక్రతాళగతులు కృతులలో నుపయోగించలేదు. చాలవరకు ఆదితాళమునే వాడి నాడు. భావరాగములను అనుసరించునట్లు తాళమును వెనుకభాగ మున నుంచి, వినునపుడు వెంటనే రసస్ఫూర్తియగునటుల భావ రాగతాళముల మేళవించి త్యాగరాజు కృతులను నవరూపముగ రచించినాడు.

త్యాగయ్య మనోధర్మములు, ఆశయములు, మానవత్వము, మహత్తరమైనవి. తన బాధలను రామునితో చెప్పుకొను కృతులు వినునపుడు ఆబాధలు మనవేయనిపించును. చాటుమాటులేని యమా యక వ్యక్తిగా త్యాగయ్య గోచరించును. "నాదుపై పలికేరు నరులు" "కరుణ జూడవమ్మ" అను కృతులలో ఊరివా రన్న గారితోకలిసి అకారణముగా తన్నెటుల నిందించుచుండిరో చెప్పు కొనును. "రామరామ గోవింద రక్షించు ముకుంద" అను కృతిలో లోకరీతి విరుద్ధమని, కానికాలము వచ్చెనని బాధపడును. "కొలు వమరెగదా కోదండపాణి" "సంగీతజ్ఞానము" "సొగసుగా మృదంగ తాళము" అను కృతులలో తానన్నివేళలయందు జాగ రూకుడై రాము నెట్లు సేవించునో రాముని సన్నిధి నెట్లు పాడు కొనునో తెలియగలదు.

"సంసారులైతేనేమయ్యా" అను కృతిలో

"జ్ఞానవైరాగ్యములు హీనమైనట్టి భవ - కాననమున తిరుగు
మానవులు సదా
ధ్యానయోగయుతులై నీ నామము బల్కుచు - నానాకర్మఫల
ములు దానము చేయువారు"

అనియు, సంసారులైతే నేమయ్యా, అనుచు ఇష్టే తక్కిన
పర్వములలో సంసారియై తానెట్లు సాధన చేయుచున్నాడో
చెప్పెను. "కారువారు" అను కృతిలో, దేశము జలసమృద్ధి,
సస్యసమృద్ధి కలిగి ప్రజలకు అఖిలవిద్యాపారంగత, దీర్ఘాయువు
బలము, గర్వములేని సాధుత్వము కలిగి ఉండునట్లుగా రాజ్య
పాలన ముండవలెనని చెప్పెను.

"సీతమ్మ మాయమ్మ" అను కృతిలో సర్వజగత్తునకు
సీతమ్మ తల్లి, శ్రీరాముడు తండ్రి, తక్కినవారు సోదరులు,
బంధువులు అనును. లోకమంతయు ఏకకుటుంబమనే విశాలభావ
మును వ్యక్తపరచును. మతభేదములు, దైవభేదములు
త్యాగరాజున కెంతమాత్రమును కిట్టవు. "ద్వైతము సుఖమా,
అద్వైతము సుఖమా", అని, "పరదైవముల జూచినంతనే
భావమున నీవై పరగెదవయ్యా" "బంటురీతి కొలువియ్యవయ్య"
ఇదే చాలు పదివేలు అనును.

అనేక జీవితసమస్యలకు సమాధానముల నిచ్చి, తలి
దండ్రులవలె, ఆచార్యునివలె, సోదరునివలె బోధించును. మత
మండలి, సంఘమండలి దురాచారములను, చెడునడతలను ఎత్తి
చూపి సంస్కారముల నుపదేశించును.

"యజ్ఞాదులు సుఖమనువారికి సముల జ్ఞానులు గలరా" అని, అట్టి కర్మలను చేయుట అసురత్వమని, ఆత్మ హింసయని ఖండించును.

"మనసునిల్ప శక్తిలేకపోతే" తపస్సు, పూజ, నదీస్నానాదు లప్రయోజన మనును. "మనసు స్వాధీనమైన యాఘనునకు మరి మంత్రతంత్రమేల" అనును. "శివదర్శనము చేయతరమా" అను కృతితో ఆలయములకు పోవువారి విషయ లోలత, విపరీతచిత్తవృత్తుల నధిక్షేపించి, శివదర్శనమునకు ప్రవృత్తి మార్గము కాదని, అంతర్వృత్తియే మార్గమని దానిని సాధింపవలెనని అనును.

త్యాగయ్య గొప్ప వాగ్గేయకారుడే గాక, గొప్ప కవికూడ. త్యాగరాజు కవిత్వవిశేషముల కొన్నిటి నుదహరించెదను. "మేరు సమానధీర" "అలకలల్లలాడగ" మొదలగు కీర్తనలలో బాలుడగు శ్రీరాముని కండ్లకు కట్టినట్లు వర్ణించును.

'ఉపమ', 'ఉత్ప్రేక్ష' అలంకారములు మనోహరముగ, స్వాభావికముగ ఉండును. "బంటురీతి కొలువియ్యవయ్య" అను కృతిలో, రోమాంచములే ఘనకంచుకమని, రామభక్తుడనునది ముద్రబిళ్ళయని, రామనామమే ఖడ్గమని, ఆ కత్తితో కామ క్రోధాదులను శత్రువులను నేలకూలవేయవచ్చునని అనును.

"నాదసుధారసంబిలను నరాకృతాయె" అను కృతిలో శ్రీరాముని కోదండమునకును సంగీతస్వరూపమునకును గల

చక్కని పోలికలను చెప్పును. * "సుందరి విన్ను" అనే ఆరభి కృతిలో "కలకలమను ముఖకళలనుగని కలువరాజు భువికి రాడాయె" "నీలావణ్యముగని అలనాడే వలరాజుకానకపోయె" "నిలువరమగు నీ గంభీరముగని జలరాజు జడవేషుడాయె" "జననీ! నీవిడునవ్వుకాంతినోర్కి శివుడు అనుపమానవహాసభ్రుడాయె" అని పలువిధముల సాహిత్యములో సాధారణముగ కానరాని ఉత్ప్రేక్షలను వరుసగా కురిపించినాడు.

త్యాగయ్య కవిత జాతీయములతో, సామెతలతో సులభముగా బోధపడుచుండును. "రూకలు పదివేలున్న చేరెడు నూకలు గతి" "కోకలు వెయ్యున్న కట్టుకొనుట కొకటె" "ఊరేలిన తా పండుకొనుటకు మూడు మూరలావే" "నూరుభక్షణములిచ్చిన నోటికెంతో అంతే" "పేరునిండి పారిన పాత్రకు తగునీరే" అని అనును.

త్యాగరాజు కవిత్వములో శృంగారవర్ణన సకృతు. ఉన్న చోట్ల లలితముగాను, ముద్దుగాను, భక్తిపూరితముగాను ఉండును. "కలకలమను ముఖకళగల సీత, కులుకుచు వోరకన్నుల జూచే విన్ను, కనకన రుచిరా" అనును. మరియు, "బంగారుమేటి పాన్పుపై, భామామణి జానకి శృంగారించుకుని, చెలువొందు

---

* స్వరములు యారొకఘంటలు వరరాగము కోదండము
ధురనయదేశ్యము త్రిగుణము విరతగతి శరమురా
సరసనంగతి సందర్భముగల గిరములురా
ధర భజనే భాగ్యమురా త్యాగరాజు సేవించు ॥వా॥

నిన్నుకని, పొంగుచు మల్లికల పూజించేవేళ, శ్రీహరి ! సంగీతము పాడుమనుముసామి, త్యాగరాజుతో" అని భక్తిశృంగారమును రసవంతముగా వర్ణించును.

సంగీతనాటకరచనలో ఇతడు మేటి. "ప్రహ్లాద భక్తి విజయము", 'నౌకాచరిత్రము', "సీతారామ విజయము" అను మూడు సంగీతప్రధానములగు నాటకములను వ్రాసెను. అందు చిత్రసంఘటనలను కల్పించి, పాత్రపోషణచేసి కవితాశక్తిని త్యాగరాజు వ్యక్తపరచినాడు.

త్యాగరాజు మహాభక్తుడు, బ్రహ్మవేత్త, దాసత్వము, ఆత్మార్పణ, శరణాగతి ఇతని ముఖ్యమైన భక్తిమార్గములు. కర్మ, భక్తి, జ్ఞానమార్గములను సంగీతముతో మేళవించి నిజమును నెరిగిన బ్రహ్మవేత్త, త్యాగరాజు. కర్మశుద్ధి, వాక్శుద్ధి, మనశ్శుద్ధి సాధనచే పొంది, భక్తితో పరబ్రహ్మమగు శ్రీరాముని ఆరాధించినాడు. ఈ యనుభవములన్నిటిని తన్మయత్వముతో పాడి త్యాగరాజు ధన్యుడైనాడు. శుద్ధతత్త్వమగు నాదము నుపాసించి బ్రహ్మవేత్త యైనాడు. ఇట్లనేకరీతుల, ప్రతిభావంతుడగు త్యాగరాజస్వామి లోకోపకారము నొనర్చిన సాత్వికాతిశయ సంపన్నుడు.

మన దేశము ఆత్మవిద్యకు పుట్టినిల్లై యుండియు కాలస్థితిని బట్టి ఆ సంస్కారమును కోల్పోయినది. ఇట్టి తరుణమందు సంగీతయోగియై వెలసిన శ్రీ త్యాగరాజస్వామివారిని సంస్మ

రించుకొనుట మహాభాగ్యము. ఆయన కీర్తనలను పాడుకొని అందలి విజ్ఞానామృతమును గ్రోలి నూతన చైతన్యమును పొంది మన మందరము ధన్యుల మగుదముగాక !

## త్యాగరాజుని ఆధ్యాత్మిక సందేశము

బ్రహ్మజ్ఞానము వలన మోక్షము కలుగునని శ్రుతులు ఘోషించు చున్నవి. నిర్గుణ బ్రహ్మోపాసన సులభ సాధ్యము కాదు. సగుణ బ్రహ్మోపాసనము అందుబాటులో నుండగలదు. సగుణ మనగా నామరూపములు కలది. నామావచ్ఛిన్నం బగు బ్రహ్మమునకు శబ్దబ్రహ్మ మని పేరు. "శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి" అని శాస్త్రము. ఈమార్గము నవలంబించిన శ్రీత్యాగరాజస్వామి నాదయోగి. నాదోపాసకుడు. సంగీతమును పరమార్థ సాధనగా జేసికొని, నాదబ్రహ్మము నుపాసించి ముక్తిని బొందవచ్చునని తేట మాటలలో బోధించినాడు. "నాదోపాసనచే శంకరనారాయణ విధులు వెలసిరి" అని పాడినాడు. నాదము శుద్ధ చిన్మాత్ర స్వరూప మనియు, ఆ చిన్మాత్రయే ఆయా గుణోపాధి భేదములతో త్రిమూర్త్యాత్మకముగా వెలసినదనియు కలదు. ఈసందర్భములో ఒక ఇతిహాసము కలదు. సృష్ట్యాదిలో ఆది నారాయణుని నాభినుండి సకలలోక నివాస మగు పద్మ మొకటి పుట్టినదనియు అందు వెలసిన బ్రహ్మ. కర్తవ్యము తెలియక దిక్కులు చూచుచుండగా నొక నాదము వినవచ్చెననియు, దాని నన్వేషించగా నాదమూల మగు శుద్ధ చైతన్య జ్యోతి సాక్షాత్కరించె ననియు, అందు త్రిగుణములు రూపొందెననియు, బ్రహ్మకు

సృష్టి విజ్ఞాన ముదయించెననియు పురాణప్రసిద్ధి. దీనిని బట్టి త్రిమూర్తుల నామ, రూప, గుణవికాసమునకు నాదమే ఆశ్రయమని చెప్పవలసి యున్నది. ఈ పరమార్థమునే త్యాగరాజస్వామి పై వాక్యములో సూచించియున్నారు. ఇట్లు విశ్వమంతయు నాదాశ్రయమని చెప్పుటయే గాక జ్ఞాన స్వరూపుడగు శంకరుడు నాద స్వరూపుడని, అందుచేత నాదము జ్ఞానాత్మక మైనదని దాని ఉత్పత్తి క్రమమును చెప్పియున్నారు. "నాద తను మనిశం శంకరం నమామి మే మనసా శిరసా మోదకర నిగమోత్తమ సామవేద సారం వారం వారం సద్యోజాతాది పంచ వక్త్రజ సరిగమ పధనీ వర సప్తస్వర విద్యాలోలం—" "ఆకాశ శరీరం బ్రహ్మ" యను శ్రుతి వాక్యము సుప్రసిద్ధము. ఈవిషయమునే "ఆకాశ శరీరం బ్రహ్మమనే ఆత్మారాముని తా సరి జూచుచు లోకాదులు చిన్మయము"లని వేరొక చోట పాడినారు. "నాద సుధారసం బిలను నరాకృతా యెరా' అనుటలో ఉపాసనా దైవమగు పరబ్రహ్మ స్వరూపుడగు రాముడే తాను పాడుకొను సంగీత స్వరూపుడని, సాధనము, సాధ్యము ఒక్కటేయను తత్త్వవిషయమును తేలిక మాటలో పొందుపరచినారు. మరియు "రాగ సుధారస పానము జేసి రాజిల్లవె ఓ మనసా। యాగ, యోగ, త్యాగ, భోగ ఫల మొసంగే (రాగ సుధారస పానము) సదాశివ మయమగు నాదోంకార స్వరవిదులు జీవన్ముక్తులు—" అని చెప్పిరి. సదాశివుడు శుద్ధ చైతన్య రూపుడు — నాదము శుద్ధ చైతన్య రూపము, అని తాత్పర్యము. సంగీతమునకు ప్రధానాంగము రాగము. రాగోపాసన శుద్ధ చైతన్య రూప సాక్షాత్కారమును కలిగించు నన్నారు. అట్టి

షష్ఠ స్వరూపములో ఓంకార మొక్కటే నిలిచి యుందునన్నారు. దీని నుపాసించి తత్త్వవేత్తలు జీవన్ముక్తు లగుదురని చెప్పినారు. ఓంకార జనిత సప్తస్వరమయమైన రాగ సుధారస పానము శివానంద మొసగును. యాగమువలన చిత్త శుద్ధియు, యోగము వలన మానసేంద్రియముల ఏకాగ్రతయు, త్యాగముచే వైరాగ్య పూర్వకమగు జ్ఞానమును, భోగము వలన అనుభవ రూపమగు ఆనందమును కలుగును. ఈయానందము కేవలము విషయ రూప కము కాదు; యాగ, యోగ, త్యాగ యుక్తమై, ధర్మబద్ధమై, భోగ రూపమును పొందినట్టిది.

ఈనాద స్వరూపమగు సంగీతము 'నిగమోత్తమ సామ వేదసారం' — "వేదానాం సామవేదోస్మి" అని శ్రీకృష్ణ వాక్యము. "సామభ్యోగీత మేవచ సామ వేదాదిదం గీతం" అని నాట్యశాస్త్రము.

నాదస్వరూపుడగు శంకరునియొక్క సద్యోజాత, అఘోర, తత్పురుష, ఈశాన, వామదేవ యను నైదు ముఖముల నుండి నాదము పుట్టును. ఇట్టి పరమేశ్వరాత్మకమగు శబ్దబ్రహ్మము సర్వ వ్యాప్తమై యుండుటచే మనుష్యదేహమందుకూడ అది ఎట్లుత్పత్తి యగుచున్నదో వేరొకచోట ఇట్లు చెప్పినారు. "నాభిహృత్కంఠ రసన నాసాదుల యందు శోభిల్లు సప్త స్వర సుందరుల భజింపవే మనసా." శంకరుని పంచవక్త్రముల వికాసమును ప్రకాశింప జేయునట్టివే మానవ దేహమందలి నాభి హృత్కంఠ రసనాదులు. మరియు "మూలాధారజ నాద మెఱుంగుటే ముదముగ మోక్ష

మురా। కోలాహల సప్తస్వర గృహముల గుఱుతే మోక్షమురా" అని త్యాగరాజస్వామి చెప్పియున్నారు. మనుష్యుని ప్రయత్నము కారణముగా మూలాధార చక్రములో 'ప్రాణానిలసంయోగము వలన' మొట్టమొదట 'పర' అను పేరుగల శబ్ద ముద్భవిల్లును. ఈ శబ్దము నాభియందలి మణిపూర చక్రము చేరి 'పశ్యన్తి' అనబడును. ఆ శబ్దమే హృదయమందలి అనాహత చక్రమును చేరి నిశ్చయాత్మకమగు బుద్ధితో చేరి 'మధ్యమ' అనబడును. అదియే కంఠ రసనాదుల యందు వ్యక్తమై నోటినుండి 'వైఖరి' యను పేరుతో వెలువడుచున్నది. ఇట్లు దేహమందు మూడు వంతులు అజ్ఞాతముగాను ఒక వంతు వైఖరీ రూపమున జ్ఞాతముగను నాద స్వరూప ముండును. ఇట్టి నాదోత్పత్తి క్రమ మెరుగుటయే మోక్షమని త్యాగరాజస్వామి చెప్పియున్నారు. దీనికిని రాజయోగ సాధనచే నిర్వికల్ప సమాధిని పొంది మోక్షమును సాధించుటకును సామ్యము కలదు. మూలాధార చక్రమందు ప్రాణశక్తి ప్రజ్వలమై పై కెగయుచు క్రమముగా షట్చక్రములను, మూడు గ్రంథులను–భేదించి సహస్రారమును జేరుటచే పూర్ణ సమాధి కల్గునని పెద్దలు చెప్పుదురు. అందు చేతనే "స్వర రాగ సుధారసయుత పానము స్వర్గాపవర్గము" అని త్యాగయ్యగారు గానము చేసినారు.

మరియు పంచముఖములగు పంచ స్థానముల నుండి పుట్టినట్టి అతిసూక్ష్మ, సూక్ష్మ, పుష్ట, అపుష్ట, కృత్రిమము లను పేరు పొందిన నాదము అతిమందర, మందర, మధ్య, తార,

అతితార మను నైదు స్థాయిలు కలదిగా సంగీతమున వ్యవహ రింప బడుచున్నది. మొదటిది, చివరిది మనుష్యులకు దుస్సా ధ్యములగుటచే త్రి స్థాయులే-మంద్ర, మధ్య, తారములు-వాడు కలో నున్నవి. మరియు, సూక్ష్మముగ పరిశీలించినచో ' అ ' కార ముచ్చరించి నప్పుడు-' ఆ ' యని దీర్ఘముగా ధ్వని చేసి నప్పుడు-ఈ శబ్దమును పోషించుటకై నాదము కంఠమును, హృద యమును దాటి నాభి గతమగు చుండుననీ, అట్లే ' ఊ ' యని ఉచ్చరించి నప్పుడు నాదము అంత లోతునకు పోక మధ్యనే యుండుననీ. ' మ ' యన్నప్పుడు కంఠ నాదము లీ యుచ్చార ణను పోషించుచున్నవనీ, ' మ్ ' అనినచో ఇంకను ఊర్ధ్వ ముఖమై నాదము అనురణము పొందుననీ తెలిసికొనవచ్చును. అందుచేత అకార, ఉకార, మకారములు చేరిన ' ఓం ' కారమను ప్రణవ నాదము నాభి హృత్కంఠ రసనాదుల యందు సర్వతో ముఖముగా నిండి యుండునట్టిదని తెలుచున్నది. ఇందుచేతనే ఓంకారము సప్త స్వరములకు, వర్ణములకు (అక్షరములకు) ఆది కారణ మందురు. ' ప్రాణానిల సంయోగము వలన ప్రణవ నాదము సప్త స్వరములై బరగ ' యని త్యాగరాజు చెప్పి యున్నారు, మరియు ఆజ్ఞా చక్రమునకు (అ + ఉ + మ్) ఓం కారము బీజాక్షర మని, మొదటి దైదు చక్రముల యందొం క్కొక్కటి, పృథ్వి మొదలైన. తత్త్వము లుండగా ఈయాజ్ఞా చక్రమందు అన్నితత్త్వము లిమిడి యున్నవని, ఇట్లే గాయత్రీ దేవి యొక్క పంచ ముఖముల కాంతులన్నియు ఈ చక్రమందు

నించియున్నవని కూడ చెప్పుట కలదు. ఈ ప్రణవనాదమే 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' యన్నట్లు బ్రహ్మ స్వరూపమని చెప్పబడు చున్నది. ఇట్లు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి యను నాల్గు పాదములు గల ప్రణవ నాదము నుండి గాయత్రి మంత్రము, వేదములు, ఇతిహాసములు పుట్టినవని చెప్పబడినది.

ఓంకార నాదము నుపాసించిన మోక్షము సాధించ వచ్చునని, ఇదియొక మార్గమని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. "ఓం ఇత్యే తదక్షర ముద్గీథ ముపాసీత" "ఏషాం భూతానాం పృథివీరసః। పృథివ్యాపోరసః। అపామోషధయోరసః ఓషధీనాం పురుషోరసః। పురుషస్య వాగ్ రసః। వాచో ఋగ్ రసః। ఋచః సామ రసః। సామ్న ఉద్గీథో రసః। స ఏష రసానాం రసతమః పరమః పరార్థో అష్టమోయ ఉద్గీథః॥ సర్వసారములలో ఉత్తమము, సారవంతమగు ప్రణవము నుపాసించవలెనని తాత్పర్యము.

ఇట్లే స్మృతి కర్తయగు యాజ్ఞవల్క్య మహర్షి కూడ సామగానమును చిత్త శుద్ధితో చేసినచో బ్రహ్మ సాక్షాత్కారమగునని చెప్పినాడు. మరియు వీణావాదన తత్త్వము నెఱిగి శ్రుతి జాతి విశారదుడై, తాళ జ్ఞానమును కలిగియున్న సంగీతోపాసకునకు మోక్షప్రాప్తి అప్రయాసముగా కలుగునని చెప్పియున్నారు. అందుచేతనే ఈరహస్యములు తెలియని గాయకులను త్యాగరాజు విరసించినాడు.

"వర రాగ లయజ్ఞులు తామనుచు వదరేరయా ।
స్వరజాతి మూర్ఛన భేదముల్ స్వాంతమందు దెలియక
యుండిన॥వ॥
దేహోద్భవం బగు నాదముల్ దివ్యమౌ ప్రణవాకారమనే
దేహం బెఱుగని మానవుల్—" వ॥

భక్తాగ్రేసరుడైన నారద మహామునిని స్తుతించుచు "శ్రీనారద, నాద సరసీరుహ భృంగ— వేదజనిత వర వీణావాదన తత్త్వజ్ఞ" అని సంబోధించినారు.

ఇట్లు త్యాగరాజస్వామి అనేకవిధముల నాదోపాసనా విషయము—నాదోత్పత్తిక్రమము, ఓంకార ప్రాధాన్యము, స్వరజాతి మూర్ఛనా విషయముల గురించి వివరించి యున్నారు. ఆ యుపాసనా సాధనము గాన మెట్లు చేయవలెనో చెప్పినారు.

(1) "సొగసుగా మృదంగ తాళము జతగూర్చి నిను చొక్కజేయు ధీరు డెవడో॥ నిగమ శిరోఽర్థము గల్గిన నిజవాక్కులతో స్వర శుద్ధముతో॥ యతి విశ్రమ సద్భక్తి విరతి ద్రాక్షారస నవరసయుత కృతిచే భజియించే యుక్తి త్యాగరాజుని తరమా శ్రీరామ॥"

(2) "నిద్దుర నిరాకరించి ముద్దుగ తంబుర బట్టి। శుద్ధమైన మనసుతో సుస్వరముతో । పద్దు తప్పక భజియించు—॥"

(3) "బహుజన్మములకు పైని జ్ఞానియై బరగుట మోక్షమురా । సహజభక్తితో రాగ జ్ఞాన సహితుడు ముక్తుడురా ఓ మనసా॥"

(4) సంగీత జ్ఞాన మను బ్రహ్మానంద సాగర మీదని దేహము భూమి భారము॥"

(5) ఇంత కన్నా నంద మేమి—అడుచు నాదమున బాడుచు యెదుట రా వేడుచు మనసున గూడి యుండేది చాలు॥ శ్రీహరి కీర్తనచే దేహేంద్రియ సమూహములు మరచి సోహమైనదే చాలు। నీ జపముల వేళ నీ జగములు నీవై రాజిల్లు నయ త్యాగరాజనుతచరిత్ర॥"

ఇట్లీ చివరి కృతిలో సంగీత సాధనయొక్క పరమ పర మార్థమును తా ననుభవించినది వెల్లడించినారు.

[II] త్యాగరాజు వేదాంత రహస్యములను తెలిసిన జ్ఞాని. అద్వైతము నెట్లు స్థాపించినాదో చూడుడు.

ద్వైతము సుఖమా అద్వైతము సుఖమా॥ చైతన్యమా విను సర్వసాక్షీ విస్తారముగాను చెప్పుము నాతో॥

ద్వైతము జీవేశ్వర భేదమును చెప్పును. అద్వైతమా రెంటికి నభేదమును చెప్పును. ఆత్మ, శుద్ధ చైతన్యరూపము; సర్వమును తెలిసికొను శక్తికలిగి సర్వసాక్షి యను సంకేతము కలది. అందుచేత ఏది సుఖమని ప్రశ్నించి, వెంటనే సర్వసాక్షీ! చైతన్యమా! యని సంబోధించుటచేత అద్వైతమునే త్యాగ రాజులవారు స్థిరపరచినారు. మరియు చరణములో ఆకాశాది పంచ భూతముల యందు, బ్రహ్మశివాదుల యందును, భగవద్భక్తుల

యందును ఎట్టి భేదమునకు పోవేయక సమానముగానే "బాగా రమించే త్యాగరాజార్చిత" యనుటచేత రాముడు సర్వసాక్షిగా చైతన్యరూపుడై ఒక్కడే రమించు చున్నాడని అద్వైతసిద్ధాంత మును దృఢపరచినారు.

మరియు "పేదాకిని సంచరించుదురా—అన్ని తానను మార్గ మునను జనితే నన్ను పీడను భార మనేవు। తన్ను బ్రోవరా సదా యంచే ద్వైతు డనేవు" అన్న కృతిలో అన్నీ తానేయను అద్వైత మార్గమును బట్టితే "నీకు నాకు అభేదము గనుక నన్ను రక్షింప నక్కరలేదని, నన్ను విడనాడుట నీకు భారమని" అనేవు. పోనీ "నన్ను బ్రోవుము" అంటే "ఆమగో నీవు ద్వైతుడవై పోతివే యని ఆక్షేపింతువు. "ఇంకెలాగ నయా నే నెట్లు నీతో సంచ రించుచుందును, అను" క్లిష్ట ప్రశ్నను సూచించినారు. కాని ఇందు లోనే దీనికి సమాధానము కూడ ఇమిడియున్నది. "దేహ బుద్ధి చేత నేను నీకు దాసుడనై ద్వైతుడైతిని; జీవ భావముతో—ఆత్మ భావముతో—నేనే నీవని అద్వైతుడనైతిని అను నట్టి శ్రీ శంకర భగవత్పాదుల సిద్ధాంతమును బ్రహ్మవిద్యారసిక సార్వ భౌముడగు శ్రీత్యాగరాజస్వామి వ్యంగ్యముగా పల్కి, పై వికల్ప ప్రశ్నము లకు సిద్ధాంతమును నిరూపించినారు." ఈరహస్య విషయమును శ్రీకాంచి కామకోటి పీఠాధిప జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదుల వారు సెలవిచ్చి యున్నారు. ఈసమాధానము నకు మూలమగు శ్రీశంకరాచార్య వచనమిది—

"దేహ బుద్ధ్యాతు దాసోహం జీవబుద్ధ్యా త్వదంశకః ।
ఆత్మ బుద్ధ్యా త్వమేవాహం ఇతివేదాంత డిండిమః ॥"

ఈ అద్వైత భావము ననేకచోట్ల గానము చేసినారు—త్యాగయ్యగారు.

పరమాత్ముడు వెలిగే ముచ్చట బాగ దెలుసుకోరె ॥ప॥
హరియట, హరుడట, సురలట, నరులట,
అఖిలాండ కోటులట యందరిలో ॥ప॥
గగనానిల తేజోజల భూమయమగు, మృగ ఖగ నగ
తరు కోటులలో
సగుణములలో విగుణములలో సతతము సాధు త్యాగ
రాజార్చితుడిలలో ॥ప॥

ఇట్లెన్నో చోట్ల చెప్పినారు. మరియు మోక్షసాధనకు కావలసిన విషయము లెన్నిటినో వివరించినారు. అందొక్క విషయమును మాత్రము చెప్పి ముగించుచున్నాను.

"శాంతము లేక సౌఖ్యము లేదు—దాంతునికైన, వేదాంతునికైన ॥శాం॥" ప్రాపంచికములైన సుఖదుఃఖములచేత కలవరమొందక చిత్తస్థైర్యము కలిగి సమత్వము పొందుటను శాంతి యందుము. లౌకిక, పారమార్థికములగు గొప్పతనము లెన్ని యున్నను శాంతము లేనిదే వాటి సుఖానుభూతి కలుగదు, అని ఘంటాపథముగా చెప్పినారు.

"విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకార స్సశాంతి మధి గచ్ఛతి ॥"

అహంకార మమకార రాహిత్య పురస్సరంబగు సర్వ కర్మ సన్యాసము శాంతికి అంతరంగ సాధనముగా విధింప బడుచున్నది.

"ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ : నైనాం ప్రాప్యవిముహ్యతి
స్థిత్వాఽస్యామంతకాఽలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥"

శాంతియే బ్రహ్మ స్థితి యనియు, దాని నెప్పుడు పొందిన నప్పుడే బ్రహ్మ భావాపత్తి రూపమగు బ్రహ్మ నిర్వాణమును పొంద నగునని సాంఖ్య యోగమునందు శ్రీకృష్ణ భగవానుడు పార్థునకు ఉపదేశించి యున్నాడు.

అట్టి సర్వోత్కృష్టమగు శాంతిని గురించి శ్రీత్యాగరాజ స్వామి బాగా ఎఱుక గలిగిన వాడని చెప్పక తీరదు.

ఇట్లు ప్రస్థాన త్రయ మందలి ఆధ్యాత్మ యోగ విషయ ముల నెన్నిటినో శ్రీత్యాగరాజస్వామి తన కృతుల యందు పొందుపరచినాడు.

## ఆంధ్రుల నాట్యకళ - కూచిపూడి కళావైభవము

నాట్యకళ చాల ప్రాచీనమైనది. మానవ ప్రకృతికి అతి సన్ని హితమైనది. సంతోష, దుఃఖాదులు కలిగినప్పుడు మానవ ప్రకృతి తన మనోభావములను వ్యక్తపరచుచుండుట మనకందరకు అను భవమే. ఈ విషయము పిల్లలలోను, అమాయకులగు ప్రజల

లోను బాగుగా గోచరించుచుండును. ఆట, పాట, మాట యను నవి మానవ భావమును వ్యక్తపరచు మార్గములు. ఒక్కొక్కటె సమర్థములైనను, ఈ మూడు చేరినచో చెప్పవలసినదేమున్నది? భావప్రకటన సర్వసంపూర్ణము కాగలదు. శ్రావ్యవిషయము కంటె దృశ్యవిషయము బాగుగా అనుభవమునకు వచ్చుట మన కందరకు తెలిసిన విషయమే. ఈ రెండును — దృశ్యము, శ్రావ్యము — చేరిన భావప్రకటనకే నాట్యమనిపేరు. అందుచేత ఈ నాట్యకళ అతి ప్రాచీనమైనదేకాక సర్వసమర్థమైనదికూడ. సంగీత, శిల్ప, చిత్రలేఖనలను లలితకళ లన్నిటికంటె సమర్థము, సమగ్రము నైనది. అట్టి నాట్యకళ మానవజాతి కంతకును సర్వ సామాన్యమై ప్రబలుచు వచ్చినది. కాని దేశకాలముల ననుసరించి దేశదేశముల యందు అనేకరీతుల వృద్ధిపొందినది. అన్ని దేశము లలోకంటె భారతదేశమందు నాట్యకళ మహోన్నతదశను పొందినది. అందు దక్షిణాపథమందు ఆంధ్రులలో ఈ నాట్యకళ గొప్ప స్థితికి వచ్చియుండెను. నేడు కూడ ఆంధ్రులు నాట్యకళలో సుప్రసిద్ధులుగా ఉన్నారు. తెలుగు నాటకరంగము రసవంతమైన చరిత్ర కలిగియున్నది. దీనికంతకును చాలాకాలమునుండి ఆంధ్రులలో ఈకళ విశిష్టత పొందియుండుటయే కారణమని చెప్పవలసి యున్నది. ఈయాంధ్రులే 10 - 15 వందల ఏండ్ల క్రిందటనే తూర్పు సముద్ర తీరమునుండి హిందూమహాసముద్ర మందలి సుమత్రా జావా బాలి ద్వీపములకు, కంబోడియా, శ్యామ ద్వీపములకు వలసపోయి, నావిక జీవనమును, వర్తకమును సలిపి వారి నాగరకత నచ్చట నెలకొల్పిరి. ఆ నాగరకతాచిహ్నములు

చేసుకూడ ఆ యా ప్రదేశములయందు ముఖ్యముగా నాట్యకళ యందు కనబడుచున్నవి.

ఆంధ్రజాతి యతిప్రాచీనకాలము నుండియు పేరు గాంచి యున్నది. చారిత్రకముగా ఆంధ్రులలో మొదట రాజ్యము నేలిన వారు శాతవాహనులు. వీరు బెజవాడ సమీపమునగల అమరావతి ధాన్యకటకములు రాజధానిగా నేర్పరుచుకొని విశాలమగు ప్రదేశము నేలుబడిలో నుంచుకొనిరి. క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దమునుండి క్రీస్తు తరువాత మూడవ శతాబ్దము వరకు శాతవాహనులు, వారి తరువాత ఇక్ష్వాకులు అను ఆంధ్రరాజులు ఈప్రాంతమందు రాజ్యపాలనము చేసిరి. అమరావతి, నాగార్జునుని కొండ శిల్పములనుబట్టి ఆకాలమం దాంధ్రులు సంగీత, నాట్యకళ లందు ప్రవీణులై యున్నట్లు కన్పట్టుచున్నది. స్త్రీపురుషుల ద్వంద్వనృత్యముల యొక్క, బృందగాన నృత్యముయొక్క, ఏకపాత్రల నృత్యభంగిమముయొక్క శిల్పఖండములు ఎన్నో ఆనాటి ఆంధ్రుల నాట్యకళా సామర్థ్యమును గూర్చి చాటుచున్నవి. తరువాతకూడా అజంతా, ఎల్లోర గుహలలోని చిత్రకళా శిల్పము లనుబట్టి, అనేక భావప్రదర్శనలతో నిండిన కుడ్య చిత్రములనుండి నాట్యకళా ప్రాభవము గోచరించుచున్నది. తరువాత క్రీ. శ. నాల్గవశతాబ్దమునుండి పల్లవులు దక్షిణమున కంచివరకు వ్యాపించి రాజ్యము చేసిరి. ఇట్లు చాల కాలము వారి యేలుబడిలోనున్న కంచి మొదలగు ప్రదేశములయందలి శిల్పఖండములు ఈయాంధ్ర జాతి వారికి నాట్యకళా నైపుణ్యమున్నట్లు తెలుపుచున్నవి. విష్ణు

కుండినులు, శాలంకాయనులు, బెజవాడ, వేంగీ, రాజమహేంద్ర వరము వరకు 5, 6, శతాబ్దములలో ఏలియుండిరి, ఉండవిల్లి గుహలు, ఈ నమోనాలోనే, ఈ రాజుల మేనల్లుడగు, మహేంద్ర వర్మ, కుడిమియామలై గుహలో చెక్కించిన సంగీత శిల్పములు, చిత్తన్నవాసన్‌లోని గుహలోని చిత్రకళా భంగిమలు - సంగీత నాట్యకళాభిరుచిని, ప్రావీణ్యమును చాటుచున్నవి. తరువాత వేంగి రాజ్యమేలిన చాళుక్యులు - ఆకాలమున నెలకొనబడిన భీమేశ్వ రాలయములు, ద్రాక్షారామము మొదలైనవి, శిల్పకళా నైపుణ్య మును చాటుచున్నవి. ఈ నృత్యశిల్పములను పరిశీలించగా నివి అన్నియును శాస్త్రసమ్మతములై నాట్యశాస్త్రమందు పేర్కొన బడిన కరణాంగహారములకు సన్నిహితములుగా కన్పట్టుచున్నవి. దీనినిబట్టి పైన పేర్కొన్న క్రీ. పూ. 3 వ శతాబ్దినుండి క్రీ. త. 7-8 శతాబ్దముల కాలమువరకు శాస్త్రవిషయమేదో ఒకటి అనుసర ణీయముగా నుండెనని చెప్పక తప్పదు. ఆ కాలమందు శాస్త్ర విషయమంతయు భారతదేశమున కొక్కటిగానే యుండెను. భరతుని నాట్యశాస్త్రమే తెలిసినంతవరకు పురాతనమైన గ్రంథము. శాతవాహనుల కాలము భరతనాట్య శాస్త్రమునకు పూర్వమైనది. భరతశాస్త్రము, ఆ కాలమునకు ఉన్న నాట్యకళా విషయమంతయు క్రోడీకరింపబడి వ్రాయబడిన గ్రంథము. అందుచే అంత కెంత కాలమునకు ముందో ఈ నాట్యకళ వెలసియుండి యుండవలెను. పాణిని అష్టాధ్యాయిలో కొన్ని నాట్యశాస్త్రములను పేర్కొనెను. ఆకాలమందు సంగీతము, నాట్యము, చిత్రలేఖనము మొదలగు లలితకళలే కాక చేతిపనులు కూడ శిల్పమనే పేరున వ్యవహరింప

బడేవి. నర్తక, గాయన, వాదక (వాద్యములయందు నేర్పరి) యను పేర్లు వాడబడినవి. సంగీతము నేర్చిన వారికి గాథక, గాయన, జార్ఝరిక యను పేర్లు వాడబడినవి. గాథలు సంగీతముతో పాడేవారు గాథకులై యుండవచ్చును. జర్ఝరియందు నిపుణులు జార్ఝరికులునై యుండవచ్చు. బహుశః ఈ జర్ఝరియే జాజరగా మారి యుండవచ్చు. జాజరపాటను నాచనసోముడు, శ్రీనాథుడు పేర్కొనియున్నారు. ఈ పాణిని క్రీ. పూ. 5 వ శతాబ్దకాలమువాడని, ఈయన నందరాజుయొక్క మిత్రుడని, అతని దర్బారులో నుండెనని "మంజుశ్రీమూలకల్పము" అను గ్రంథమందు గలదు. అందుచేత చాల పురాతనకాలమందే నాట్యకళ ఒక ఉన్నతదశకు వచ్చియుండెను. అది శాతవాహనుల నాటి ఆంధ్రులకు తెలిసియుండెను. ఇదిగాక 'గాథాసప్తశతి', వాత్స్యాయన కామసూత్రములు, ఆంధ్రులు నృత్తగీతములయందుత్తీర్ణులైనవారని చెప్పుచున్నవి. క్రీస్తుశకము పదియవ శతాబ్దమందలి పశ్చిమ చాళుక్యరాజగు రెండవ సోమేశ్వరుడు 'అభిలషితార్థ చింతామణి' యను గొప్ప గ్రంథమును వ్రాసియున్నాడు. అందు కొంతభాగము శిల్పమునకు, నాట్య సంగీతములకు సంబంధించి యున్నది. ఓరుగల్లు రాజధానిగా ఏర్పరచుకొని మూడు నాలుగు వందల యేండ్లు అఖండశ్రీతో రాజ్యమేలిన కాకతీయుల సామ్రాజ్యకాలమందు ఆంధ్రుల నాట్య సంగీత శిల్ప కళలు గొప్ప దశకు తేబడినవి. పాల్కురికి సోమనాథుడు బసవపురాణములోను, పండితారాధ్యచరిత్రలోను నాట్యకళను గురించి వివరించి యున్నాడు. దానినిబట్టి ఈకళ మార్గ, దేశ భేదములను పొందినట్లు

స్పష్టమగుచున్నవి. భరతుని నాట్యశాస్త్రము తరువాత దత్తిలుడు, కోహళుడు, నందికేశ్వరుడు, మతంగుడు నాట్యశాస్త్రములను వ్రాసిరి. వీటిని బట్టి కళ క్రమముగా ఎట్లు పెరుగుచు మార్పు చెందుచు వచ్చినవి తెలియుచున్నది. ఈ మార్పు పెరిగిన కొలది శాస్త్రీయమని, దేశీయమని భేదము పుట్టుచు వచ్చెను. పూర్వమునుండి శాస్త్రములో వ్రాయబడి ఆచరింపబడుచు, పండితులచేత అభ్యసింపబడుచు వారిచేత నేర్పబడుచు వచ్చినది శాస్త్రీయము. శాస్త్రబద్ధము కాక జనుల యొక్క సంతోష ఉద్రేక స్వభావములకు తగినరీతిని పెంపొందుచు జానపదులకు వినోదము లిచ్చునట్టిది దేశీయ మను పేరుతో వ్యవహరింపబడినది. కొన్ని వందలేండ్లగుసరికి దేశీయము సంస్కరింపబడి శాస్త్రీయ మగుచుండెను. క్రొత్తగా దేశనాట్య ముద్భవ మగుచుండెను. అట్లు జరుగుచున్నట్లు మతంగుని బృహద్దేశియను గ్రంథమునుండి గ్రహించనగును. అందు ఆంధ్రులయొక్క విశిష్టమగు దేశికళ చెప్పబడినది. అంతకుతరువాత 4-5 శతాబ్దములకు వ్రాయబడిన పండితారాధ్య చరిత్రలో దేశీయనాట్య విధానము ఎంతో పెరిగిపోయినట్లు స్పష్టమగుచున్నది. భరతుని నాట్యశాస్త్రమందు గల నాట్యశాస్త్ర వివరములను మార్గనాట్యముగా వర్ణించి, తరువాత దేశినాట్యమును వివరించియున్నారు. దానినిబట్టి ఆంధ్రుల కొక విశిష్టమగు నాట్య విధానము బాగా ఏర్పడి స్థిరపడినట్లు తెలియుచున్నది. అందుచేత క్రోడీకరించి వ్రాయబడిన నాట్య గ్రంథములు ఉండి యుండవలెను. అవి యేవో గోచరించుట లేదు. కాకతీయ దండనాథుడగు జాయసేనాపతి "నృత్త

రత్నావళి" యను నాట్య శాస్త్రమును సంస్కృతములో వ్రాసెను. అతని ప్రోత్సాహముననే ఓరుగల్లుకు 40 మైళ్ళలో గల పాలంపేటలోని రామప్పగుడ్లు నిర్మింపబడినవి. అందు సుందరతమమగు నృత్యభంగిమ శిల్పములు కలవు. అతని గ్రంథస్థ విషయములకివి వ్యాఖ్యానములా యున్నట్లున్నవి. ఇవిగాక ఓరుగల్లు (వరంగల్) లోని దేవాలయ మండపములందెన్నో గొప్ప నృత్య శిల్పము లున్నవి.

తరువాత శ్రీనాథుని కాలములో ఆంధ్రులలో నాట్య సంగీత కళలు బహు వ్యాప్తిగా శోభిల్లెను. పల్నాటివీరచరిత్రలో నలగామ రాజు యొక్క సభావర్ణనము, సభాప్రారంభమునకు పూర్వము నాట్యమేళమువారి రాక, వారి కుతుపవిన్యాసము, వారి నాట్యప్రదర్శనా వివరములు అతి మనోహరముగా శ్రీనాథకవి వర్ణించియున్నాడు. ఇట్లే కొండవీడు, రాజమహేంద్రవరము మొదలగు రెడ్లరాజ్యమందు ఆనాటి నాట్యకళావైభవ మెట్టిస్థితిలో నుండెనో శ్రీనాథకవి ప్రణీత గ్రంథముల యందు బాగుగ వర్ణింపబడినది. క్రీడాభిరామములోని మాచల్దేవివారాంగనా విషయము, ద్రాక్షారామములోని దేవదాసీల విషయము మొదలగు ననేకసందర్భములలో శ్రీనాథుడు తా కాలమునాటి నాట్యకళావైదగ్ధ్యమును అతి విపులముగా వర్ణించియున్నాడు. ఇట్లే క్రీ. శ. 13-16 శతాబ్దములలో వ్రాయబడిన యనేకాంధ్రకవుల గ్రంథములయందు నాట్యకళా విశేషములు బహు చక్కగా, ముఖ్యముగా దేశీయనాట్యరీతులు వర్ణితములైనవి. ఇవన్నియు సురవరపు ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల

సాంఘికవిషయకమగు గ్రంథమున వ్రాసియున్నారు. నాదెండ్ల మూలస్థానేశ్వరాలయములోని కులోత్తుంగ చోళదేవుని శాసనము, నాటి నాట్యకళయొక్క స్థితి, రాజులు, సంపన్నులు నాట్య మేళములకెట్లు దానాదికములు చేసిరో తెలుపుచున్నది.

నాట్యకళ అతి ప్రాచీనకాలమునుండి దేవదాసీలవలనను, నట్టువమేళములవలనను ప్రచారమగుచుండెను. దేవదాసీలు దేవాలయములకే వారి జీవిత మంకితమొనర్చుకొని దేవుని ఉత్సవములలో దేవుని యెదుట నాట్యమాడుచుండిరి. మరియొక తెగవారు నట్టువ మేళము లాకుచు రాజసభలలో నాట్యము చేయుచుండిరి. దేవదాసీ సంస్థ చాల ఉన్నతాదర్శములతో ఏర్పాటుచేయబడినది. ముముక్షువులై నాట్యకళయే ఒక యోగాభ్యాసముగా నెంచి, బహు చిన్నతనమునుండియు భగవంతునికే కన్యను అర్పణచేయుచుండిరి. పవిత్రజీవనము సల్పుచు భగవదారాధనయే నాట్యకళాసేవ యని, భగవంతుడే తన భర్త యని పూర్తిగా భావించి ఆ యారాధనయందు నిమగ్నురాలై నాట్యముద్వారా భగవంతునికి ఆత్మార్పణ సలుపుచు జీవిత పరమార్థమును పొందుట ఈ దేవదాసీ ధర్మజీవిత రహస్యము. ద్రాక్షారామ భీమేశ్వరాలయములో అమ్మవారిపేరు మాణిక్యాంబ. ఈ మాణిక్యాంబ ఆ యూరియందలి ఒక దేవదాసి యనీ, ఆమె పవిత్రజీవితముచేత నాట్యయోగమువలన భగవంతునిలో నైక్యమైన దని. అప్పటినుండి ఆమెను అమ్మవారుగా భావించి పూజాపునస్కారములు సలుపజొచ్చి రని చెప్పుదురు. అట్టి మహోన్నతమగు నాట్యకళ, సామాన్యుల

దేవళములోనిది ఔన్నత్యమును కోల్పోవఁజొచ్చినది. దానివలన ఈ కళ కొక దైన్యము సంప్రాప్తము కాజొచ్చినది. పవిత్రభావములతో దేవదాసీలు చేయు నాట్యమును చూచిన వారికి పవిత్రభావోదయమై ఆధ్యాత్మికదృక్పథము కలిగెడిది. కళాపతనము తగ్గగానే జనానీకమునకు ధర్మమార్గపోష తప్పుటయేగాక కళ నభ్యసించుటలోకూడ శాస్త్రవిదితమగు పరిమితులను కడదాకా నభ్యసించుటయందు దీక్ష తగ్గి కళకూడ క్షీణింపజొచ్చినది. ఈ విషయము కాశ్మీరమునుండి దక్షిణా పథమువరకు ఏకరీతిగనే పరిణమించినది. ఇది స్పష్టముగా గ్రంథస్థము చేయబడినది.* క్రీస్తుశకము పదియవ శతాబ్దము నకు పూర్వమందే కాశ్మీరము, మహారాష్ట్రము, ఆంధ్రదేశము మొదలగు ప్రదేశములయందు ఈ నాట్యకళను ఉత్తమస్థితిలో ఉంచుటకు, శాస్త్రమందలి విషయములన్నియును ఏలోటు లేకుండ నేర్పి ప్రచారమందుంచుటకు, నాట్యకళను పవిత్రముగా ఉంచుటకు ఒక ఉద్యమము ప్రారంభమైనది. దాని మూలకముగా నాట్య శాస్త్రము బ్రాహ్మణులే కూలంకషముగా అభ్యసింపజొచ్చిరి. అట్టివారిని బ్రాహ్మణమేళములని పిలుచుచుండిరి. ఆంధ్రదేశమం దీ పవిత్రాశయములతో ప్రారంభింపబడిన బ్రాహ్మణమేళములవారి ప్రధాననిలయము కూచిపూడి. ఇది కృష్ణాజిల్లాలో భీమనది యొడ్డున నున్నది. దీనిపూర్వనామము కుచేలపురము.

---

* 8 వ శతాబ్దమందు జాయాపీడుడను కాశ్మీరరాజుయొక్క యాస్థానకవియగు దామోదరగుప్తుడు "కుట్టనీమతము" అను గ్రంథమందు నట్టువుల ప్రదర్శనములు రసహీనములై విసుగు కలిగించుచున్నవని చెప్పియున్నాడు.

ఈ బ్రాహ్మణమేళములలో స్త్రీలు పాల్గొనరు. యువకులు పాల్గొందురు. వీరు సంస్కృతాంధ్రములందు పండితులై భరతుని నాట్యశాస్త్రము, నందికేశ్వరుని అభినయ దర్పణము, అలంకార శాస్త్రమును బాగుగనేర్చి నృత్త, నృత్య, అభినయ, సంగీత కళలను కూలంకషముగా నేర్చుకొనుచుండిరి. వీరు కూచిపూడి భాగవతులను పేరుతో చరిత్రలో కన్పట్టుచున్నారు.

ప్రప్రథమముగా పదునారవ శతాబ్దారంభమందు (1502 A.D.) వీరినిగురించి చరిత్రలో ఆధారముకనబడుచున్నది. విజయనగర సంస్థానాధీశ్వరులైన వీరనరసింహ రాయలవారి మన్ననలు పడసిరి. రాయల రాజ్యమందు జరుగుచున్న ఘోరసంఘటనలను ఈభాగవతులు వారి సంచారక్రమములో కళ్ళార చూచిన వాటిని నరసింహరాయల వారి యెదుట నాటకమును కట్టి యాడిరి. అందు పైని, యీ ఘోరములను జరుపు సామంతుని రూపు మాపబడినది. రాయలు భాగవతులను చాల మెచ్చుకొనెను. దీనిని బట్టి ఈ భాగవతుల దేశసేవా తత్పరత ఎంత గాఢమైనదో విశదమగుటయేగాక వారి విద్యాపాటవ మెంత గొప్పదో తెలియుచున్నది, వీరిరాక నెఱిగించగానే రాయలవారు "కూచిపూడి భాగవతులు సుప్రసిద్ధులు, వారిచే ఈరాత్రే రాణివాసమువారు, మేము, చూచునట్లు కేళికయేర్పాటు చేయుదురే" ననిరట. దీనినిబట్టి కూచిపూడి భాగవతు లంతకు కొన్ని వందల యేండ్లనుండియు దేశమందు ప్రసిద్ధికెక్కి యుండవలెనని యూహింపనగును, అందుచేత 12 వ, 13 వ శతాబ్దుల నాటికే వీరు దేశమందు విద్యావంతులుగ పరిగణింపబడుచుండిరని

ఊహించవచ్చును. వీరు నాట్య శాస్త్రమును కూలంకషముగా నేర్చినను. దేశాటనము చేయుచు ఆ కళ నాధారము చేసికొని శైవసంబంధమగు కథల నాడుచు వచ్చిరి. పాల్కురికి సోమనాథుడు చెప్పినట్లు పలువిధ శివలీలా నాట్యములు శివమత ప్రాబల్యము కల యారోజులలో బహుప్రచారములో యుండేవి. బుద్ధ జైన మత ప్రాబల్యము అణచివైచి శైవమతము, వీరశైవము, స్థాపింప బడిన రోజు లవి. అటుతరువాత కొన్నాళ్ళకు విష్ణులీలా నాటకములు ప్రబలియుండును. ఇది వైష్ణవ మతము పొడజూపినట్టి కాలము. వీటినే యక్షగానము లని పిలచుచుండిరి. వీటి పూర్వ స్వరూపములే శివలీలా నాట్యములై యుండవచ్చును. ఈ యక్షగానముల నాడు నట్టువ మేళములవారిలో ఒక తెగవారు యక్షులని యుండిరి. వారే జక్కులవారు. నేటికిని ఆ పేరుగల నట్టువ కుటుంబములవారు కలరు. యక్షగానముల నాడు నట్టువమేళములకు విభిన్నముగా, భాగవత పురాణాంతర్గతమైన భగవల్లీలలను జనబాహుళ్యమునకు భక్త్యావేశములు కలిగి ధర్మమార్గావలంబకులుగా ఉండుటకై, కూచిపూడి భాగవత మేళములవారు ప్రదర్శనములిచ్చుచు దేశాటనము చేసి కాలము పుచ్చుచుండిరని చెప్పవచ్చును. వీరు ఈనాట్యవిషయమందే గాక పగటి వేషములయందు కూడ చాలా ప్రసిద్ధికెక్కి యుండిరి.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము ఆదరించు ప్రభువులు లేకుండుటచే ఆంధ్రదేశ మందలి పండితులు, కళావేత్తలు తంజావూరు తరలిపోయిరి. 1561—1614 మధ్య కాల

కములో తంజావూరు నేలుచున్న అచ్యుతప్ప నాయకుడు ఈ వలస వచ్చినవారి నాదరించి, వారి జీవనోపాధికై ఒక యగ్రహారము నిచ్చెను. దానిపేరు అచ్యుతాపురము. ఇదే నేటి మేలటూరు. తెలుగు భాగవత మేళములవా రున్న యూరై యుండుట చేత కొంతకాలమునకు మేళములవారి యూరు మేలటూరుగా మారి యుండెనేమో!

ఈ మేళములవారు తెలుగులో వ్రాసిన నృత్య—నాటకముల నాడుచుండిరి. అనాది సిద్ధముగ, నాట్యశాస్త్రోదయమునాటినుండియు ఈ నృత్యనాటకములే పేర్కొనబడినవని, భరతాచార్యుడు అట్టి నాటకములనే, దేవతల విజయోత్సవమును చెప్పునాటిని, దేవతల వినోదమునకై యాడెనని తెలిసికొనుట ముఖ్యమగు విషయము. ఏలననగా, నాట్యప్రావీణ్యము బహుధా అట్టి నాటకములందే గోచరించగలదు. నాట్యకళలలో అట్టి నాటకమే అగ్రస్థానము నలంకరించుచున్నది.

మూడు వందల ఏండ్లక్రిందట వా రాడియున్న నాటకములు నేడు కానరాకపోయినను త్యాగరాజస్వామివారికంటె పెద్దవాడై సమకాలికుడైన మేలటూరి వేంకట రమణ భాగవతులు 150 ఏండ్లకు పూర్వము రచించిన తెలుగునాటకములను ఈ నాడు కూడ అచ్చటి బ్రాహ్మణమేళములవా రాడుచున్నారు. ఇట్టి నాటకములనే నేడును కూచిపూడిలోనివారు ఆడుచున్నారు. ఈ రెండు ప్రదర్శనములకును పోలికలు చాల కలవు. ప్రవేశదరువు, పాడే ర క్తిరాగములు, దేవాలయముల కెదురుగా వీధిలో తాటా కుల

ముగా నిర్మించిన రంగస్థలము, ఆరుబైట నేలమీద కూర్చుని చూచే జనసామాన్యము, జత రాగడాలు, శ్రుతిగా ఊదే తిత్తి గడ, మద్దెల, తాళపుచిప్పలు, గజ్జెలు, హంగుదారులు, ముఖ్యముగా పేర్కొనతగినవి.

ఇట్లు కూచిపూడి వారి నాట్యకళ తంజావూరు ప్రాంతమునకు వ్యాపించి వృద్ధిపొందెను. ఈ కాలమందే కూచిపూడి గ్రామమున కనతిదూరమందున్న మువ్వగ్రామమందు పదకర్తలలో ఉత్తముడని పేరుపొందిన క్షేత్రయ్యా వెలసెను. కూచిపూడిలో నాట్యకళను సమగ్రముగా నేర్చి, సంస్కృతాంధ్రములయందు, సంగీతమునందు, అలంకారశాస్త్రమునందు గొప్పపండితుడై రాజాదరణమునకై కూచిపూడి వారితోపాటు తంజావూరుచేరి విజయరాఘవుని కొలువులో తనవిద్యను ప్రదర్శించి సభవారిని సమ్మోహితులుగా జేసెను. వివిధ నాయికానాయకుల యొక్క చిత్తవృత్తులను అవస్థలను రసభావములను ప్రత్యక్షమగురీతిని క్షేత్రయ్య, పదములను పాడి ఆడెను. నాటినుండి సాత్వికాభినయమునకు మహోన్నత స్థానమేర్పడినది. భరతశాస్త్రమందలి రసభావ అధ్యాయములందు వివరింపబడిన సర్వవిషయములకు లక్ష్యములుగా ఈ పదము లుండుటచే తల్లక్షణము లన్నియును శాస్త్రమం దెంత దూరము చెప్పియున్నాడో అంతదూరము వరకు అభినయించి చూపుటలో క్షేత్రయ్యపదములు వీలుగానుండెను. అందుచేత దాక్షిణాత్య నాట్యకళలో ఒక గొప్పఅధ్యాయము నాడు ప్రారంభమైనది. ఇది కూచిపూడి వారి నాట్యకళాచరిత్రలో వసంతోదయము వంటిది

పేప, తంజావూరు ప్రాంతము వారందరు. ఈ నూతన విద్యను నేర్చిరి. నాటినుండి అభినయకళకు క్షేత్రయ్య పదములు పట్టు కొమ్మలైనవి.

ఇది ఇట్లుండగా ఈ పదాభినయనమువలన కలిగిన యను భవము నాట్యకళయందు ముఖ్యమైన మార్పు కొకదానికి దారితీసి యుండెను. అప్పటివరకును ఆడే నృత్య-నాటకములలో నటులు పెక్కురుండి, పెక్కురసములను ప్రదర్శించుటకు వీలుండెను. పదాభినయములో ఒక్కపాత్రమాత్ర ముండి, ఒక రసమునకే-విప్రలంభ శృంగారమునకే-శాస్త్రములో చెప్పిన సర్వ హావ భావములను ప్రదర్శించుటకు, రసానుభవమును పరిపూర్ణముగా పొందుటకును వీలుండెను. అందుచేత పదాభినయములో వలె ఒక రసమును సంపూర్ణముగా ప్రదర్శించునట్టి, శాస్త్రవిషయ మును నిశితముగా ప్రదర్శించగలిగినట్టి నృత్యనాటకము నొకదానిని సృష్టించిన బాగుండునను ఊహ కళాకర్తల కుదయించుటయం దేమియును సందేహముండుటకు వీలులేదు. అట్టి సందర్భములలో కూచిపూడికి చెందిన సిద్ధేంద్రు డను యోగిపుంగవుడు పారి జాత నాటకమును సృష్టించెను. ఇది నాటకముకాదు, కలాపము. సత్యభామయొక్క కలాపము. ఇందు ఏకపాత్రకే ప్రాముఖ్యము కలదు. తక్కిన ఒకరిద్దరకు ఏమియునులేదు. ఇందు విప్రలంభ శృంగారముయొక్క సర్వలక్షణములు ప్రదర్శింపబడును. కథాను క్రమమును బట్టి ఆనాయికయే అష్టవిధనాయికలలో పలురీతులను ఎట్లుపొందునో చిత్రముగా విదితమగును. ఒకసారి విరహోత్కం

రిత, ఒకచో ఖండిత, ఒకచో కలహాంతరితగాను, సామాన్యముగా స్వాధీనపతికగాను భామ గోచరించును. మరియు ఈభామాకలాప మున వరువులు కొల్లికట్టు, నృత్తరీతులు, నృత్యములు అనేక రూపముల విశిష్టత జెందియున్నవి. ఇందు శాస్త్రమునందు జెప్ప బడిన విషయము లెన్నో ప్రదర్శింపబడును. ఇంత సమగ్రముగా శాస్త్రవిషయమును చేర్చికూర్చిన ప్రదర్శనము భరతఖండమున ఇంకొకటి లేదనిన అతిశయోక్తి కానేరదు. నృత్యమందు కథక్ నాట్యకళలోను, నాజూకుతనములో మణిపురిలోను, రౌద్ర వీర రసాభినయములయందు కథకళిలోను మేలుతన మున్నది గాని, అన్ని విషయములను చేర్చి చూచినచో కూచిపూడివారి భామాకలాప నాట్యకళ సర్వోత్కృష్టమైనదని చెప్పితీరవలెను.

1675 ప్రాంతములలో ఈభామాకలాపము సృష్టింపబడి యుండును. ఈ మహోత్తమమైన కళ కలకాలము నిలిచి యుండవలెనని యెంచి మహాపురుషుడగు సిద్ధేంద్రుడు నాటి గోల్కొండప్రభువైన తానీషావద్ద కూచిపూడిని (కుచేలపురము) అగ్రహారముగా బడసెను. ఆయూరి బ్రాహ్మణకుటుంబములవారి వలన, తమ మగపిల్లలచేత ఒకసారియైనను భామాకలాపము సమగ్రముగా ప్రదర్శింపజేతుమను ప్రమాణములను పొందెను. అట్లే వారు వారి కర్తవ్యము తీర్చుకొని నేటివరకు వచ్చియున్నారు. అందుకని ఆగ్రామమును వారు నాటినుండి ఈనాముగా అనుభ వించుచు వచ్చుచున్నారు.

1690 ప్రాంతములో నారాయణతీర్థులవారు శ్రీకృష్ణలీలా తరంగిణిని వ్రాసిరి. ఆరచనలలో గోచరించునట్లు అవి నృత్త

ప్రధానములని చెప్పవలసియున్నది. ‘బాలగోపాల’ యను తరంగములో ఎన్నోశబ్దములున్నవి. తరంగమును అనేకతాళములలో విన్యాసములతో ఒక్కొక్కచరణ మొక్కొక్కరీతిని కూచిపూడివారు నృత్తమాడుదురు, ఇది నృత్తవిద్యలో గొప్పమెట్టులో చేసినట్టిది. ఈ విద్యలో వీరితో సమానులు లేరని చెప్పవలసియున్నది. సప్తతాళములేగాక వినాయకతాళము మొదలైన బాహా అక్షరముల వ్యాప్తి (72) గల తాళములలో ఎన్నో వినాయకతాళమువంటివి పేరు ప్రదర్శింతురు. అవన్నియు శాస్త్రవిషయికముగా చాల గొప్పవి. నేర్చుకొనుట చాల కష్టము. ఈ ప్రదర్శనము కత్తిమీద సాము. ఇవ్వే శ్లోకాభినయము, కందార్థములు, దశావతార నృత్యము, మండూకశబ్దము మొదలగు విషయములలోను, అష్టపదులు, అధ్యాత్మరామాయణ కీర్తనలను అభినయించి నృత్తమాడి తీర్మానములు పలురీతులతో చూపుటలోను కుచిపూడివారు అందెవేసిన చేయి.

దక్షిణాదిని భరతనాట్యమని సమగ్రముగా చెప్పదగినది వీరివిద్యయే. కాని ఇదంతయు బ్రాహ్మణులచేత అభ్యసింపబడుటచేత రాజసభలలో ఏకపాత్రాభినయమునకు ఇంత శాస్త్ర సంబంధమగు విద్యకు తావులేకపోవుటచేత, 150 ఏండ్ల క్రిందట, శరభోజి మహారాజు కాలములో, తంజావూరు రాజసభలో నాట్యకర్తలచేత నాజూకుగా రసభావోపేతముగా నృత్త నృత్య అభినయములకు తావుగా కలిగేటట్టు వడివేలు, పొన్నయ్య, చినయ్య అనువారు నేడు తంజావూరు నాట్యమని పేరు పొందిన ఏకపాత్రా

ప్రదర్శనమును చక్కగా కల్పించిరి. ఇదే నేడు భరతనాట్యమని కూడ పేరుగాంచినది. దాని కా పేరుకంటె తంజావూరు నాట్యమను పేరే తగినది. దీనిలో నేటి సంగీతమార్గము, నాజూకు తనము, తళుకు బెళుకులు ఉన్నవి. కూచిపూడి కళలో అంత నాజూకు తనము లేదు. కాని దానిలో 150 ఏండ్లకుపూర్వపు సంగీతనాట్యములయొక్క స్వరూపము గోచరించును. తంజావూరి నాట్యమందు అవి కానరావు.

ఇట్టి మహోన్నతమైన కూచిపూడివారి కళ ఆంధ్రుల కళో న్నతిని చాటుచున్నవి. అట్టి కళకు కొంతకాలమునుండి ప్రోత్సాహము లేకున్నది. అది పూర్ణముగా తెలిసిన పెద్దలు చాలవరకు గతించిరి. నేడు మిగిలియున్న వారితోనైన కలిసి ఆంధ్రులు మేల్కొని ఈ కళను నుద్ధరించవలసిన యావశ్యక మెంతైన గలదు. ఆంధ్రరాష్ట్రోదయమై ఒక సంవత్సరము దాటినది. కాని ఈవిషయమున అధికారులకు గాని, కళాప్రియులకు గాని, జన సామాన్యమునకు గాని ఏమాత్రమును దృష్టి ప్రసరించలేదు. త్వరలో అట్టి ప్రయత్నములు సాగవలసి యున్నవి.

## మార్గ - దేశి సంగీతములు

## (Classical and Popular Music)

భారతీయ సంగీతమునకు మూలములు, పునాదులు అతి ప్రాచీనములు, వేదమంత్రోచ్చారణలో సంగీతాంకురములు కన్పించుచున్నవి. సకాలములో వర్షముకురిసి, పంటలుపండి

ఈతిబాధలులేకుండ జీవితము సుఖముగా నడచుటకై వేదకాల మందలి మన పూర్వులు ప్రకృతిని అనేకరీతుల ఆరాధించి, కీర్తిం చిరి. దేవతాప్రీతికొరకు యజ్ఞయాగాదులను సలుపుచుండిరి. అట్టి ప్రార్థనలకు సంబంధించిన వేదగానము నియమబద్ధమై — ఉదాత్తానుదాత్త స్వరితబద్ధమై యుండెను. శ్రుతిస్వర భేద మేమాత్రము కలిగినను ఫలముచెడుననే నిశ్చయముతో వేద మంత్రోచ్చారణ కచ్చితముగా ఏర్పరుపబడినది.

ఋగ్యజుర్వేదములకంటె సామవేదోచ్చారణ సొంపై సామగానమని పేరొందినది. ఋగ్వేదము పెక్కువేల సామము లుగా కూర్చబడినది. సామములను గానార్హములుగా జేయుటకై ఓ, హో, హిమ్, వా, ఇహ, హువే, హాయ, యే, దివాః, అను స్తోభములను మధ్యమధ్య చేర్చిరి. ఈస్తోభముల కొక ప్రత్యేకిం చిన యర్థములేదు. మంత్రార్థమున కుచితములగునట్లు వీని నుపయో గింతురు : పిళ్ళారిగీతములలోగల అయ, ఇయ, తియ యను శబ్దములు ఈస్తోభముల కనుకరణములేమో !

ఋగ్వేదమునకుజెందిన ఉదాత్తానుదాత్త స్వరితములను మూడుస్వరములు క్రమముగా సామగాన ప్రారంభకాలమునకు నాలుగు స్వరములైనవి — ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ యనునవి, తరువాత మందర లేక పంచమయనునది చేర్పబడినది. తరువాత వీనన్నిటికంటె హెచ్చుస్థాయిగల స్వరము “క్రుష్ట” యనునది చేర్పబడెను. ఈయారు స్వరములకు అంత్యమున “అతిస్వార్య” మనునది చేర్పబడినది. ఇదేనేటి షడ్జము —

ఆరింటినుండి పుట్టిన ఏడవ అంత్యస్వరము. సామవేదమందలి సప్తస్వరములు అవరోహణ క్రమముకలవి—

ని, ధ, ప, మ, గ, రి, స, అని. సామగానముచేయు పద్ధతులు వివిధములుగా ఉన్నవి. కొన్ని సంప్రదాయములలో నాలుగు స్వరములతో వాడబడుచున్నవి. ఎక్కడోగాని సప్తస్వరములు వాడుట లేదు. నేటి కర్ణాటక సంగీతకీర్తా ఖరహరప్రియ, భైరవి రాగ స్వరములకు దగ్గరగా సామగానస్వరము లుండును.

సామగానకాలము తరువాత, సంస్కృతభాషలో రచింపబడిన ఆఖ్యానములగానము ప్రజలయుపయోగార్థమై చేయబడుచుండెను. ఇద్దరు గాయకులు వీణావాద్య సహాయముతో ఈ గానమును చేయుచుండిరి. దీనిని గాంధర్వగానమని, మార్గగాన మనియనుచుండిరి. సప్తస్వరములలోని గాంధారముతో ప్రారంభించి అవరోహణక్రమముగా గ, రి. స, ని, ద, ప, మ, యనుజాతిలో ఈగానముండెను. దీనిని గాంధర్వ జాతియని, గాంధర్వ గ్రామ మనియందురు. గాంధారదేశమందు ఎక్కువగా ప్రబలియుండుట చేత దీనికట్టిపేరు వచ్చియుండును. గాంధారదేశమునకు సంబంధించుటచేతనే గాంధారమని 'గ' స్వరమునకు పేరు.

ఇంచుమించు ఈ కాలమందే శివపరముగా స్తోత్రరూపమున సంస్కృతమున కొన్నిగీతములు వ్రాయబడి గానము చేయబడుచుండెను. వేదగానమువలెనే ఈగానమునుకూడ ఏమార్పును లేక నియమబద్ధముగా భక్తిశ్రద్ధలతో అనుసరించుచుండిరి. సంగీత రత్నాకరమందు ఈ మార్గ గీతములు కొన్ని స్వరములతో వ్రాయ

బడి యున్నవి. పరమార్థసాధనమునకై మార్గమును అన్వేషించు టకై ఉద్దేశింపబడుటచేత ఈ సంగీతమును మార్గసంగీతమనిరి. ఈ గానమందు చచ్చత్పుట, చాచ్చత్పుట మొదలైన మార్గతాళము లుపయోగించుచుండిరి.

మార్గసంగీతమునకు జెందిన గీతములగురించి, భరతుని నాట్యశాస్త్రమందు చెప్పబడినది. మాగధి, అర్ధమాగధి, సంభావిత, పృథులమనునవి నాలుగు గీతాభేదములు. వీని కుదాహరణములు సంగీతరత్నాకరమున గలవు. సామవేదజనితములగు "సప్త రూప" లేక "సప్తాంగ" యను పేరున ఏడు విధములగు గీతములు చెప్పబడినవి. ఒక్కొక్క గీతము ఒక్కొక్క భావ మును స్ఫురింపజేయుచుండెను. ఆ రసమునకు, ఆ సందర్భము నకు తగినట్లు ఆ గీతము పాడుచుండిరి. నేటి రాగభేదముల కివే అంకురములు. గాంధారగ్రామము అతి ప్రాచీనమైన స్వరసప్త కము. ఇది అంతరించి మధ్యమగ్రామము—మ, గ, రి, స, ని, ధ, ప, యనునది పుట్టెను, ఇదికూడ అంతరంచి స, రి, గ, మ, ప, ధ, ని, యను నేటి షడ్జగ్రామము వాడుకలోనికి వచ్చినది. ఇదంతయు మార్గసంగీత సంబంధముననే జరిగినది. ఈ గ్రామ ములనుండి ఒక్కొకదానికి ఏడేసి జాతులు పుట్టినవి. అవే రాగ ములకు పూర్వ స్వరూపములు. ఒక్కొక్క భావమునకు ఒక్కొక్క జాతిభేదము. ఇవి స్వరరూపములలోగాక లక్ష్యరూప ములలో — గీతములలో — వాడుకలో నుండెడివి. క్రమముగా ఈ భేదములు పెరిగినవి. సప్తస్వరములు గలవి, ఆరు, ఐదు

స్వరములు మాత్రమే కలవి — సంపూర్ణ, షాడవ, ఔడవ నామ ములు కలవి — తానములను పేరిట పేర్వాసైనవి. ఈ తానములు ఒక్కొక్కదానిని ఒక్క యజ్ఞకాలమందు గానము చేయుచుండిరి. ఆ యజ్ఞఫలము సిద్ధించవలెనన్న ఆ యజ్ఞనామకతానమునే గానము చేయవలెనని నియమము.

సీ. ఆయజ్ఞనామంబు లాతానములకేల
ఘటియించవలసె నేమి కార్యమనిన
లక్షణసంయుక్త లలితగాంధర్వంబు
నందు శ్రేయోనిధానంబులగుచు
షడ్జ మూర్ఛనలను శుద్ధతానంబులు
వేదచోదితములై వెలయుకతన
నేయజ్ఞనామంబు లేతానములకబ్బె
నాసిద్ధతానంబు లాశ్రయించి

గేయమొనరింతు రెట్టి వాగ్గేయకారు
లట్టివారికి నిత్య మాయజ్ఞఫలము
లబ్బునని గీతశాస్త్రజ్ఞులంద్రు భువిని
రామభూపాల ! జగదేక రమ్యశీల !

రాగతాళచింతామణి - తృతీయాశ్వాసము 84

సామగానమునుండి గ్రహింపబడిన సప్తస్వరములకు శుద్ధ స్వరములని పేరు. ఈ శుద్ధస్వరసప్తకము ఇరవైరెండు శ్రుతుల క్రింద విభజింపబడిన పద్ధతిని, భరతుడు నాట్యశాస్త్రమందు వివ

రించెను. సంగీత గ్రంథములలో మొదటిది, భరతశాస్త్రము. ఇది నేటికి సుమారు పదియారు, పదినేడువందల సంవత్సరముల క్రిందట వ్రాయబడినది. భరతుని కాలము నాటికి మార్గసంగీత మొక కళగా నేర్పడినది. గ్రామ, మూర్ఛనా, జాతిభేదములు మొదలగు ననేక విషయములు అందు వివరింపబడినవి.

మార్గసంగీతము యజ్ఞశాలలయందు, ఋషివాటికలయందును ప్రచారములో ఉండెను. ఇది దైవకార్యములయం దుపయోగింపబడిన పవిత్రగానము. ఇందు మార్పులు కలుగుటకు, స్వేచ్ఛకు, తావులేదు — వినోదమునకు చోటులేదు. ఇట్టి స్వేచ్ఛకు అనుకూలమైన సంగీతము బహుళముగా జనపదములయందలి ప్రజాజీవితమునవుట్టి వృద్ధిపొందినది. వారిమాటలలో, ఆటలలో, పాటలలో, వారిమనోభావములు, కష్టసుఖములు, అభిలాషలు, అమాయిక ప్రకృతులు చిందులాడుచుండును, జానపదుల పాటలలోని భావములు సర్వసామాన్యముగా అన్నిదేశములయందును ఏకరీతినే ఉండును. ఇవి మానవత్వమునకు చిహ్నములు. ఈజానపదగీతములందు నియమములు, శాస్త్రపద్ధతులు అంతగా ఉండకపోయినను బహుజన మనోరంజకములై, వినుటకింపై, చిత్రవిచిత్రగతులుకలవై చైతన్యముతో తొణికిసలాడుచుండును. ఇది కేవలము పామర రంజకమని భ్రమింపరాదు. ఇందలిమానవత్వము సంగీతవేత్తలను కూడ రంజింపజేయును. ఇది దేశవ్యాప్తమైనకళ. దీనిని దేశీయమని, దేశిసంగీతమని యందురు. మార్గసంగీతముతోపాటు దేశి సంగీతముకూడ దేశమందు వెలయుచునేయుండెను. సామవేద గానములోకూడ దేవతాస్తుతులేగాక వీరులగాథలకు జెందిన

గానముకూడకలదు. వీరలు మనుష్యులైనను, వారివలన కలిగిన యుపకారకారణముగా వారిని స్తుతించవలసిన యవసరము కలిగినది. ఇది జానపదగేయమార్గము. వేదకాలమందుకూడ సంగీతమందు ఇట్టి కలయికలు కనపించుచున్నవి. సంగీతశాస్త్రవృద్ధికి మార్గసంగీతమేకాక దేశిసంగీతముకూడ పునాది. ఇందలి హృద్యములగు సంగీతచ్ఛాయలను గ్రహించి మేళవించుకొనుట జరుగుచు వచ్చినది. ఇట్టిది, మానవాభ్యుదయమునకై పెక్కువిషయములయందు జరుగుచునే యున్నది. దేశిసంగీతము ప్రాకృతభాషలో, జానపదులవాడుకభాషలో, వ్రాయబడెను.

భరతునికాలమందు సంగీతము నాటకమున కంగముగా ఉండెను. అతను పేర్కొన్న సంగీతనాటకములలో ధ్రువములను పాటలు చెప్పబడినవి. అవి నాటకమందు వివిధస్థలములయందు వాడుటకై వివిధరీతుల కూర్పబడినవి. ప్రావేశికము, నైష్క్రామికము, ఆంతరము, ప్రాసాదికము, మొదలగుపేర్లు వినియోగమునుబట్టి వీనికి కలిగినవి. ఈధ్రువములే నేటి దరువులు. ఇవి ప్రాకృతగానమునుండి — జానపదులగానమునుండి — గ్రహింపబడినవి. వీనిని తరువాత సంస్కృతభాషలో వ్రాసిరి. వీనినే భరతుడుదహరించిన సంగీతనాటకములలో వాడిరి. అందుచేత సంగీతము రానురాను కళగా వృద్ధిపొందుచు వచ్చినప్పుడు దేశిసంగీతమును కూడ నాధారము జేసికొని యుండెనని చెప్పవలెను.

భరతునికాలము తరువాత క్రీ. శ. 5, 6 శతాబ్దములనాటికే మార్గసంగీతముయొక్క ప్రాబల్యముతగ్గి దేశిసంగీతము పెరిగినది.

భరతుని తరువాతివాడైన మతంగుడు బృహద్దేశియను సంగీత గ్రంథమును వ్రాసెను. అందు దేశిసంగీతము నిట్లు నిర్దేశించి యున్నాడు.

అబలాబాలగోపాలైః క్షితిపాలైర్నిజేచ్ఛయా ।
గీయతే సానురాగేణ స్వదేశే దేశిరుచ్యతే ॥

స్త్రీలు, బాలురు, గోపాలురు, క్షితిపాలురు వారివారి దేశములయందు స్వేచ్ఛగా ననురాగముతో పాడుకొని ఆనందించునది దేశిసంగీత మనెను. మతంగుడు మార్గసంగీతము గురించి చెప్పనేలేదు. నాటికే అది వ్యవహారమునుండి తొలగియుండుటయే కారణమని తోచును. దేశిరాగములు భరతుని జాతులనుండి పుట్టినవని, ఔడవ, షాడవ, సంపూర్ణభేదములు కలవని వాని ఉత్పత్తి లక్షణములను చెప్పినాడు.

దేశేదేశే జనానాం యద్రుచ్యా హృదయరంజకమ్ ।
గానంచ వాదనం నృత్యం తద్దేశీత్యభిధీయతే ॥

అని మతంగుని తరువాతి వాడును, సంగీతరత్నాకర కర్తయు నగు శార్ఙ్గదేవుడు చెప్పియున్నాడు. ఇతడు 264 మార్గ రాగములను వివరించెను. దేశిరాగములను నూటికి పైగా చెప్పి యున్నాడు. మార్గరాగములు నాటికే రూపు మాసినవి. నాటి దేశి రాగములలో నేడుపయోగములో గల కొన్నిరాగముల పేర్లు కలవు. రత్నాకర గ్రంథగతపద్ధతి ననుసరించి వానిని పాడుట యసాధ్యముగా నున్నది. వాని సంప్రదాయము కాలానుసారముగా

అంతరించినవి. అందుచేత దేశిరాగములుకూడ మార్గరాగములతోపాటు స్వర్గము నలంకరించినవి !

రత్నాకరములో దేశిరాగములు శుద్ధములని (కేవల శాస్త్ర సంబంధములు), ఛాయాలగములని—(శుద్ధరాగమును పోలియుండి ఇతర రాగచ్ఛాయను కలవి), సంకీర్ణములని — (పలు రాగముల కలయికతో రంజింపచేయునవి), మూడు విధములుగా చెప్పబడినవి. దీనిని బట్టి సంగీతము పుట్టినది పుట్టినట్లుండలేదని స్పష్టము. దేశిసంగీతములో పెక్కు మార్పులు, భేదములు కలిగినవి. దేశ దేశములయందు రంజకముగానున్న రాగములన్నియును సేకరింపబడినవి—గాంధారి, కన్నడిక, కాంభోజి, బంగాళ, సైంధవి, సౌరాష్ట్ర, మాళవగౌళ మొదలైనవి. సంగీతశాస్త్రములలోని పద్ధతులలోకూడ మార్పులు కలుగుచు వచ్చినవి. ఉమాపత గ్రంథపద్ధతికిని రత్నాకరపద్ధతికిని కొంత వ్యత్యయమున్నది. ఆకాలమందు ప్రచారములో నున్నట్టి సంగీతపద్ధతిని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో వివరించినాడు. అందలి యనేక విషయములు రత్నాకరములోని వానికంటె భిన్నములుగా ఉన్నవి. దీనిని బట్టి 12—14 శతాబ్దములలో దేశిసంగీతము ఎక్కువగా మారినదని, అనగా లక్ష్యము లక్షణమునకు దూరమైనదని చెప్పవలెను. ఈ విషయమునే రత్నాకర కర్త ఇట్లు చెప్పియున్నాడు.

యథాలక్ష్య ప్రధానాని శాస్త్రాణ్యేతాని మన్యతే ।
తస్మాల్లక్ష్య విరుద్ధంయ త్తచ్ఛాస్త్రం నేదమన్యథా ॥

లక్ష్యము, అనగా దేశమందు వాడుకలోనున్న సంగీతము, లక్షణమునకు విరుద్ధమైనచో, లక్ష్యమునకే ప్రాధాన్య మీయవలెనని తాత్పర్యము. దీనిని విరోధించవశముగాదని, మార్గ, దేశి, సంగీతములను విభేదమంతరించి, దేశిసంగీతమందే లక్షణ సంగీతమని, లక్ష్యసంగీతమని భేదము ప్రారంభమైనదని గ్రహింపవలసియున్నది. వీనినే శాస్త్రసంగీతము (classical music) దేశి సంగీతము (popular music) అని అనుచున్నాము. ఈ భేదములు పరంపరగా వచ్చుచునే యుండును. లక్ష్యసంగీతము ననుసరించి సంగీతలక్షణము మార్పుచెందుచుండెను.

" రంజకో జనచిత్తానాం సరాగః కథితోబుధైః " అని రత్నాకరము. ఇట్టి జనరంజకమైన రాగమును త్రిస్థాయిలో, దశవిధరాగ లక్షణములతో, నియమితములగు నాలుగురాగవర్ధనులతో పెంచి పాడవలెనని రత్నాకరము శాసించుచున్నది. అట్టిమార్గము శాస్త్రమార్గమని, అది లక్షణ సంగీతమని, అట్టిదికాక విశృంఖలముగా, మనోధర్మము ననుసరించి చేయుగానము దేశిగానమని, జానపదగానమని, చెప్పవలసియున్నది.

(1) " రాగంబులలక్ష్యంబులు । రాగనిరూపణము జేయు– "

(2) " లోకులవాడుక లక్ష్యము । లోకములో లక్షణంబు లోక
వ్యవహా । రాకలితమైన నింపని । చేకొందురు — "

(3) " అరయగ లక్ష్యము లక్షణ ।
శరణంబగుచో " ప్రయోగశరణావైయ్యా ।

కరణా" యనుదృష్టాంతము ।
బురజించును — గోసలూరి బుధజనపాలా॥"

(4) "లక్ష్యములేనిలక్షణము లక్ష్యముసేయరు లోకులెల్ల-"

అందుచేత లక్ష్యానుగుణముగా ఎప్పటికప్పుడు లక్షణమును సంస్కరించుచు ఆయాకాలములకు తగిన సంగీతలక్షణగ్రంథములు వెలువడినవి. నాట్యశాస్త్రము, సంగీతరత్నాకరము, అట్టివే-ఇట్లే పదియారవ పదియెనిమిదవ శతాబ్దములమధ్యకాలములో రామామాత్యుడు స్వరమేళకళానిధిని, సోమనాథుడు రాగవిబోధను, గోవిందదీక్షితుడు సంగీతసుధను, వెంకటమఖి చతుర్దండి ప్రకాశికను, తులజాజి సంగీతసారామృతమును రచించిరి. కాలానుగుణముగ వచ్చిన మార్పులన్నిటిని సంగీతశాస్త్ర సంప్రదాయమునకు, మూలసూత్రములకు అనుగుణ మగునట్లే శాస్త్రవేత్తలు సంస్కరించుచు వచ్చిరి. ఈ సంస్కారమంతయు దేశిసంగీతములోనే యని వేరె చెప్పనక్కరలేదు. మార్గసంగీత మేనాడో అంతరించి పోయినది.

జానపదసంగీతములోని రాగములను రంజకముగా ఉన్న వాని నెన్నిటినో సంస్కరించి శాస్త్రమందు చేర్చుచువచ్చిరి. యరకలకాంభోజి, చెంచుకాంభోజి, పున్నాగవరాళి, నాదనామక్రియ, నవరోజు, కురంజి మొదలైనవి. మరియు పండ్రెండవ శతాబ్దమునుండి వేరు మార్గమున వృద్ధిపొందుచు వచ్చిన ఉత్తరాది, హిందూస్థానీ సంగీతములోనుండికూడ, కొన్నిరాగములను

గ్రహించి కర్ణాటక సంగీతము శాస్త్రబద్ధము చేసికొన్నది. తోడి రాగ మట్టిదే.

త్యాగరాజస్వామి, దీక్షితులవారు. శ్యామశాస్త్రి యొక్క సంగీత రచనలే నేటి సంగీతశాస్త్రమునకు లక్ష్యములుగా నున్నవి. వీరు ఉత్తరాది సంగీతమునుండి రాగములను గ్రహించిరి. కాపీ, అమీర్ కళ్యాణి. యమన్‌కళ్యాణి, ప్రతాపవరాళి మొదలైనవి. ఇంతేగాక పాశ్చాత్య సంగీతములోని రీతులు, గతులు, మెట్లు గ్రహించి సంగీతరచనలను చేసియున్నారు. ఉదాహరణకు :-

(i) "రమించువారెవరురా రఘూత్తమా నినువిన"
సుపోషిణి — రూపకము

(ii) "రామచంద్ర నీదయ రామ ఏలరాదయ"
సురటి — దేశాది

(iii) "వినతా సుతవాహన శ్రీరమణ మనసారగ
సేవించెద రామ" జయంత సేన — ఆది

(iv) "శ్రీపతీ నీపదచింతనే జీవము" నాగస్వరావళి — దేశి

(v) "నినువినా నామదెందు నిలువదేహరిహరి"
నవరసకన్నడ — రూపకం

(vi) "వెంతనేసదా ఉంచుకోవయ్యా"
కుంతలవరాళి — దేశాది

(vii) "సరససామదాన భేదదండ చతుర"
కాపీనారాయణి — దేశాది

మొదలైనవెన్నో త్యాగరాజస్వామివ్రాసి సంగీతమును పెంపొందించిరి. ఇట్లే దీక్షితులవారును "శక్తిసహిత గణపతిం" "కమలాసనవందిత" "శ్యామలే మీనాక్షి" "గురుమూర్తే బహుకీర్తే" మొదలైనవి రచించిరి.

ఇట్లు కాలానుగుణముగా సంప్రదాయమునకు విరుద్ధము కాకుండ సంగీతరచనలు చేయుట యవసరము. ఈకాలమందు సంగీతము జనసామాన్యమునకెక్కువగా అందుబాటులో వున్నది. వినుటకింపుగాను, సులభముగా నేర్చి పాడుకొనుటకు వీలుగాను ఉండునట్టి తేలికసంగీతము (light music) అవసరమగుచున్నది. ఈసందర్భములో నానావిధములగు పాటలు — సినిమాపాటలు — వెలువడుచున్నవి, అందుకొన్ని అన్యదేశ సంగీతచ్ఛాయలు కలవి, జాజ్‌మ్యూజిక్ వెనుకపాటగా (back-ground) కలవి, హిందీ, హిందుస్థానీపాటలకు మక్కీకిమక్కీగా వ్రాయబడినవి కలవు. ఇవి కర్ణాటక సంగీత సంప్రదాయమునకు విరుద్ధములై యున్నవి. అపస్వర, అపశ్రుతి ఘూయిష్టములు. ఇవి సామాన్య ప్రజలలోపడి సంగీతకళకే కళంకము నాపాదించగలవు. అందుచేత చేయవలసినదేమనగా — మూలపడియున్న యక్షగానములు, జానపదగేయములు, స్త్రీలపాటలు వెదకి వానినుద్ధరించి వానినాధారముగా లలితగీతములను, నూతనవిషయములపై సంగీతసంప్రదాయమెరిగిన వారిచేత, వ్రాయించి ప్రచారము చేయవలసియున్నది. అట్టివని వలన శాస్త్రసంగీతమునకు జానపద సంగీతమునకు సమ్మేళన మేర్పడును, ఉభయ తారకమగును.

## నాట్యకళ — దాని పరమార్థము

నాట్యకళ అతి ప్రాచీనమైనది. మాట, చేష్ట, భావము మానవప్రకృతిలోని భాగములు. వీని సమ్మేళనమగు ఈ కళను గురించి ఋగ్వేదములో ప్రశంసగలదు. నక్కు అంచులుగల బట్టలు ధరించి, పిక్కలవరకు మాత్రమే దుస్తులు వేసికొని స్త్రీలు నాట్యమాడిరని, యజ్ఞసమయములయందు కన్యలు ఆనందదాయకముగా నాట్యమాడుచుండిరని, చూపుల కపవర్గసుఖము నిచ్చు అందగత్తెలు చాతుర్యముతో, కదలికగా నాట్యప్రదర్శన మిచ్చుచుండిరని, మగవారు — నటులు — యుద్ధవిషయలను ప్రదర్శించుచుండిరని ఉన్నది. రామాయణములో — అయోధ్యలోను, వాలి యొక్క రాజభవనములోను, లంకలోను, ఆటపాటల వర్ణనలున్నవి. రాణివాస స్త్రీలు మందిరములలో ఆటపాటల వినోదములను సల్పుచుండిరట. ఒకస్త్రీ తన అసమానమగు నాట్యాభినయములచేత రావణుని మనసు చూరగొన్నదట. నిద్రచే వివశయయ్యును ఆమె అంగచేష్ట లన్నీ నిద్రయందుకూడ నిలిచియుండివవట. మరియు భారతములో విజయుడు పేడియై ఉత్తరకు నాట్యము చెప్పిన సంగతి ప్రసిద్ధమే గదా. వీనినిబట్టి సంగీతనాట్యములు స్త్రీలు, కన్యలు అభ్యసించుచుండిరని తెలుచున్నది. రుద్రయానుడను నృపతి వీణవాయించుచుండగా అతని సతి నృత్యము చేసినదట. సింహళరాజగు పరాక్రమబాహుడు తన భవనమందు నిర్మించిన నాట్యశాలలో అతని భార్యయగు

రూపవతి నాట్యమాడుచుండెనట. ఇట్లు మన గ్రంథములయందు పెక్కు ఉదాహరణములు కాన్పించుచున్నవి.

దీనినిబట్టి రెండు మూడు వేల ఏండ్లకు పూర్వమే నాట్యకళ అభివృద్ధి చెందినదని స్పష్టము. క్రీ. శ. రెండు మూడు శతాబ్దముల నాటిదగు భరతుని నాట్యశాస్త్రము * నేడు లభించు వాటిలో మొదటిది. భరతాచార్యుడు తనకు ముందు నాట్యగ్రంథ కర్తలున్నట్లు చెప్పియున్నాడు. క్రీ. పూ. 5–6 శతాబ్దముల నాటివాడగు పాణిన్యాచార్యుడు శిలాలి, కృశాశ్వ అను ఇద్దరు నటసూత్ర కర్తలు కలరని చెప్పినాడు. భరతుని నాట్యశాస్త్రమందు నాట్యకళను గురించి విపులముగా కలదు.

నాట్యప్రయోజనము :— లోకములోని పరమార్థమును వెల్లడిచేయుట నాట్యముయొక్క ప్రయోజనము. ఒకరిని సంతోషపరచుటకుకాదు. ఒకరిని దూషించుటకుకాదు. లోకవృత్తులలోని సర్వచైతన్యములనుండి నాట్యము సృష్టింపబడినది. పనులు,

---

* భరతశాస్త్రమును నాట్యవేదమని చెప్పుదురు. అది వేదములనుండి గ్రహింపబడినదనియు — ఋగ్వేదమునుండి పాఠ్యము, యజుర్వేదమునుండి అభినయము, సామవేదమునుండి సంగీతము, అథర్వణమునుండి రసమును చేర్చి కల్పింపబడినదనియు భరతుడు చెప్పియున్నాడు. ఋగ్వేదములో వాదోపవాదములు, సంభాషణలు చాల కలవు. యమీ యముల సంభాషణ, ఊర్వశీ పురూరవుల సంవాదము, చూడనగును. ఇవి నాటకరచనలోని వాచకమునకు, పాఠ్యమునకు మాతృక లనదగును. యజుర్వేదము క్రియాత్మకము గనుక అభినయమునకు మాతృకగా చెప్పబడినదని తోచుచున్నది. సామగానము సంగీతమునకు మాతృక. త్రిస్థాయిలు, సప్తస్వరములు అందుండే గ్రహింపబడినవి. అథర్వణ వేదమందు మంత్రవిషయ మున్నది. దానినుండి రసము నెట్లు గ్రహించినది తెలియుటలేదు.

ఆటలు, లాభము, శాంతి, నవ్వు, యుద్ధము, కామము, సంహారము మొదలైనవి చైతన్యములు. నాట్యము నీతిమార్గమున పోవువారికి ధర్మఫలముల నిచ్చును; కామమును బట్టువారికి సుఖమునిచ్చును; అవిధేయులకు అడ్డములను, విధేయులకు శిక్షను, దుర్బలులకు శక్తియు, శూరుల కుత్సాహమును, తెలివిలేనివారికి వివేకమును, పండితులకు విజ్ఞానమును, రాజులకు వినోదమును, విచారగ్రస్తులకు తాల్మియు, లాభముకోరువారికి లాభమును, విషణ్ణులకు ధైర్యమును ఇచ్చును. నాట్యశాస్త్రము నానావిధప్రయోజనలతో నిండియుండును. నానామనోవికారములను వ్యక్తపరచును. ఉత్తమ, మధ్యమాధమ జనులయొక్క నడువడులకు సంబంధించి గొప్ప బోధలు, సలహాలు, వినోదములు, అభ్యుదయములు కలిగించును.

నాట్యస్వరూపము :— మాట, పాట, అట చేరి నాట్యమగును. మాటకు, పాటకు అర్థముండును. వాని భావమును తెలుపుటను అభినయమందురు. మాట, పాటలలోని భావము ప్రేక్షకుల మనస్సున కందినప్పుడు రసానుభవము గలుగును. ఆట, పాట, తాళము ఒకదానితో ఒకటి కలిసి మాధుర్యము కలిగించినచో దానిని లయ అందుము (లయ సామ్యమే).

నాట్యము త్రివిధము. వాచ్యము లేక, రసభావములు లేక తాళబద్ధముగా, ఇంపగు అంగవిన్యాసములతో ఆడుట నృత్తము. ఇందలి చేష్టలకు అంగవిన్యాసములకు అర్థము, భావము ఉండవు. ఒక నియతమగు పద్ధతిలో ఆనందకరమై, ఉత్సాహజనకమై, అభ్యుదయ సూచకమై, కనులపండుగగా నృత్తముండును. రసభావయుత

మగు అంగవిన్యాసము నృత్యము. ఉద్ధతమైన అంగవిక్షేపములతో ఆర్భాటముతో శక్తిమంతమైన నృత్యమును తాండవమందుము. ఇది శివప్రసాదము. మృదుమధురమై కోమలములగు అంగవిక్షేపములతోకూడిన సుకుమారనృత్యము లాస్యము — పార్వతీప్రసాదము. ఇందు అభిప్రాయము మాటలులేకుండగనే అభినయమార్గమున వ్యక్తము చేయబడును. సర్వాభినయములతో కూడినది, వాచ్యప్రధానమైనది నాట్యము. " వివాహాభ్యుదయాదౌ సర్వరస ప్రధానం నాట్యం. అంగవిక్షేపమాత్రం నృత్తం " తాత్పర్యమును, ఇతివృత్తమును సువ్యక్తముచేయుటకై నాట్యము కల్పింపబడినది.

అభినయము నాల్గు విధములు :—వాచికము, ఆహార్యము, ఆంగికము, సాత్త్వికము అని. మాటలతో, వృత్తముతో లేక పాటతో అభిప్రాయమును చెప్పుట వాచికాభినయము. వస్త్రాభరణాదులతో సూచింపబడునది ఆహార్యము. చేష్టలతో తెలుపబడునది ఆంగికము. ఈ అంగవిన్యాసములు కొన్ని శరీరమంతటితోను చేయబడును. కొన్ని ముఖభేదములతోను, కొన్ని తల, వక్షము, నడుము, కాళ్లు, చేతులు, ప్రక్కలు అను షడంగములతోను, కొన్ని కండ్లు, కనుబొమలు, రెప్పలు, చెక్కిళ్లు, అధరము మొదలగు ఉపాంగములతోను చేయబడును. మనోగతములగు హావభావములను తెలుపుట సాత్త్వికాభినయము. ఇది సత్త్వము — మనస్సు — నుండి పుట్టినది. చెమట, గగుర్పాటు, స్వరభేదము, వణకు, తెల్లబోవుట, ఏడ్చుట మొదలగు చేష్టలచేత మనోభావములు ఇందు వెల్లడి చేయబడును.

నాట్యము - నాటకము :— సంగీతము, సాహిత్యము, అభినయము, నృత్తము ఈ నాల్గు అంగములు కలది నాట్యము. మొదటి మూడు మాత్రమే కలిగి నృత్తములేనిది నాటక కళ. దీనినికూడ నాట్యమనే భరతాచార్యుడు వ్యవహరించినాడు. నాటక మందు ప్రతి పాత్రకు ఒక్కొక్క నటుడో, నటియో ఉండును. వివిధ పాత్రలతోపాటు, వివిధాహార్యములు వివిధ వాచ్యములు పాత్రౌచిత్యమును బట్టి యుండును. ఆంగికముకంటె ఎక్కువగా సాత్వికాభినయము నాటకమం దుండును. లోకమందలి ధర్మము హెచ్చుగా ఇందు జూపబడును.

నాట్యమందు ఏకపాత్ర ఉండును. ఇతివృత్తము వివిధాభి నయములతో నిండియుండును. దుఃఖము నభినయించవలెననిన నాటకమందు ఏడ్చుట జరుగును — లోకధర్మానుసారమును బట్టి. కాని నాట్యమందు అది ఒక సంజ్ఞతో వ్యక్తపరుపబడును. నాట్య మందు, లోకధర్మమునకు మెరుగు దిద్ది, వ్యంగ్యాత్మకముగా, సూచ్యార్థముగా రసమును పుట్టింతురు. దీనిని నాట్యధర్మ మందురు. నాటకమందు లోకధర్మము, నాట్యమందు నాట్య ధర్మము, ప్రధానములు. ఇట్లే సర్వకళలయందు లోకధర్మము, కళాధర్మము లేక శాస్త్రధర్మము మిళితములై సందర్భాను సార ముగా హెచ్చుతగ్గులుగా ఉపయోగింపబడును.

" యానిశాస్త్రాణి యే ధర్మాయాని శిల్పాని యాః క్రియాః
లోకధర్మప్రవృత్తాని నాట్యమిత్యభిసంజ్ఞితమ్
నచశక్యంహి లోకస్య స్థావరస్య చరస్యచ,

శాస్త్రేణ నియతం కర్తుం నానాచేష్టావిధిం ప్రతి
నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితమ్
తస్మాల్లోకప్రమాణంహి జ్ఞేయం నాట్యప్రయోక్తృభిః."

నాట్యమునకు పునాది లోకానుభవము గనుక, ప్రతి అభినయమునకును లోకమే మాతృక. ప్రతి అభినయమునకును ఉపపత్తియున్నది. ప్రతిహస్తమునకును కారణమున్నది. వాని వివిధములగు ఉపయోగములకు — వినియోగములకు — ఉపపత్తి కలదు. వానిని సంపూర్ణముగా నెరిగినగాని నటీనటులు ప్రజ్ఞావంతులు కాజాలరు. ఇది, కష్టించి, సంప్రదాయమునెరిగి తెలిసికొనతగినది. అట్టివారు ఏరసమునైనను, ఏభావమునైనను ప్రదర్శింపగలరు. నేర్చినవిద్యకంటె లోకానుభవమే మేలని భరతాచార్యుడు చెప్పియున్నాడు.

నర్తకి లక్షణము :— ప్రతీస్త్రీ నటించుటకు తగదు. మనోహర రూపిణి, యౌవనవతి, విశాలనేత్రి, మణిమయ భూషితయై, మనోహరమగు ముఖలక్షణమును, సర్వాంగ సౌష్ఠవమును కలదై, ఎక్కువ లావు సన్నదనము మిక్కిలిపొడుగు పొట్టిలేక ఏకరాసియగు ఆకారము కలదై యుండవలెను. సరస స్వభావము, వాక్యమందలి అర్థసూక్ష్మములు గ్రహించగల నిపుణత్వము, లయ యుక్తముగ అడుగు వేయుటలో లాఘవము, నేర్పు గలిగి, రంగభీతి, సభాకంపములేక, గీతవాద్యతాళపరిజ్ఞానము, అభినయ నైపుణ్యము కల స్త్రీయే నర్తకిగా ఉండవలెను.

నటుని లక్షణము :—

" రూపవాన్ మధురాభాషీ కృతీ వాగ్మీ పటు_స్తథా,
కులాంగనా సుతశ్చైవ శాస్త్రజ్ఞో మధురస్వరః
గీతవాద్యాది నృత్యజ్ఞో సిద్ధకః ప్రతిభానవాన్,
ఏతాదృశగుణై ర్యుక్తో నట ఇత్యుచ్యతే బుధైః "

నాట్యక్రమము :—

" కంఠేనాలంబయే ద్గీతం హ_స్తేనార్థం ప్రదర్శయేత్,
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమాచరేత్,
యతోహ_స్త_స్తతోదృష్టి ర్యతోదృష్టి_స్తతోమనః
యతోమన_స్తతో భావోయతో భావ_స్తతోరసః "

కంఠముతోపాడి, హస్తాభినయముతో అర్థమును చూపవలెను. కళ్ళతోభావమును వ్య_క్తముచేయవలెను. పాదములతో తాళమువేయవలెను. ఎచ్చట హ_స్తమో అచ్చటనే దృష్టి, దృష్టియున్నచోటనే మనస్సు, అచటనే భావము, అచటనే రసము ఉండును. ఇట్టి మేళగింపుకలిగినప్పుడే నాట్యము రసాత్మకమగును.

సభాలక్షణము :—

నటీనటుల ప్రజ్ఞావిశేషములట్లున్నప్పుడు అట్టివారి విద్యను గ్రహించు సభ్యు లెట్టివారై యుండవలె నను విషయము చాల ముఖ్యము. ప్రతివారికి అచట చోటులేదు. అభినయశాస్త్రము ముక్కు మూలము తెలియని, విద్యాగంధములేని అనాగరకుల

కా సభలో తావులేదు. పండితులు, రసికులు, సహృదయులు, సభ్యులుగా ఉండిన ఉభయతారకముగా ఉండుననుటకు సందేహము లేదు. భరతునికాలమందు ఈకళ గొప్పస్థితిలో ఉండవలెను. ఉపన్యాసకుడు తనపటిమచేత వాక్శక్తిచేత సభ్యులను తనయభిప్రాయముననెట్లు వశపరచుకోగలుగునో అట్లే ఆనాడు అనన్య లావణ్యాతిశయముచేత, అభినయ ప్రజ్ఞచేత, ప్రౌఢిమచేత, నటి తన సందేశమును సహృదయులగు సభ్యుల కందజేయ కలుగు చుండెను. అట్టి గొప్పపరిణామమును నాట్యకళ నాడు పొంది యుండెను. సభానాయకుడెట్టివాడై యుండవలెనో చూడుడు —

'శ్రీమాన్ ధీమాన్ వివేకీ వితరణనిపుణో గానవిద్యాప్రవీణః
సర్వజ్ఞః కీర్తిశాలీ సరసగుణయుతో హావభావేష్వభిజ్ఞః
మాత్సర్యాద్యైర్విహీనః ప్రకృతిహిత సదాఽఽచారశీలోదయావాన్
ధీరోదాత్తః కలావాన్ నృపనయచతురోఽసౌ సభానాయకః
స్యాత్॥''

ఇట్టి ఉత్కృష్టమైన కళ క్రమముగా అనేక కారణముల చేత దుశ్శీలముచేత హీనస్థితికి వచ్చినది. విద్య రానివారభినయించుట, ఏమియు నెరుగనివారు చూచి మెచ్చుకొనుటలోనికి వచ్చినది. చేతులు, మూతులు, కండ్లు, ఒళ్లు త్రిప్పినంత మాత్రమున ఇటునటు గంతులిడినంత మాత్రమున అభినయము, నాట్యము కాజాలవు. అట్టియెడ రసము పుట్టనేరదు. రసాభాసమై తీరును. ఇట్టి స్థితినుండి నాట్యకళ నుద్ధరించవలెను. ఇందులకు నేటి పరి

స్థితు లాశాజనకముగా నున్నవి. సభ్యులు నాట్యకళా సంప్రదాయములను బాగుగ నెరిగియుండినగాని నాట్యకళ పెంపొందదు.

పురాణదంపతులైన పార్వతీపరమేశ్వరులు లాస్య. తాండవములను నృత్యభేదములను, నాట్యకళకు ప్రసాదించిరి. వీరే నాట్యకళ కాధారభూతులు. అట్లే, నాట్యకళను భార్యాభర్త లిద్దరు అభ్యసించి, నిరంతరసాధకులై లోకమునకు ప్రదర్శించుచు, శీలవంతులై, ఆదర్శచరిత్రులై యున్నగాని నాట్యకళ గొప్ప స్థితికి రాజాలదు.

నాట్యకళయొక్క పరమార్థము :—

" జటాటవీగలజ్జల ప్రవాహ పావితస్థలే
గలేవలంబ్యలంబినీం భుజంగతుంగ మాలికామ్
ఢమడ్డమడ్డమడ్డమన్నినాద వడ్డమర్వ్వయమ్
చకార చండతాండవం తనోతు నశ్శివశ్శివమ్ "

హైందవ విజ్ఞానములో అన్నివిద్యలు కళలుకూడ ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థముల సాధనకొరకే ఏర్పడినవి. పరమార్థసాధనములగు అన్నిమార్గములకు గమ్యస్థానము మోక్షమే, ఆత్మానందమే, శాశ్వతశాంతియే. సర్వవిషయములు, సర్వశక్తులు, విద్యలు, కళలు పరస్పరవిరుద్ధములుకాక, సర్వసామరస్యముతో ఒప్పి సర్వేశ్వరజ్ఞానమునకే తోడ్పడునని భారతీయ సంస్కృతి బోధించుచున్నది.

నాట్యకళయొక్క అంతరార్థము, ఆధ్యాత్మికభావము ఎట్టిదో కొంత తెలిసికొందము. ఆనందకుమారస్వామి ఈవిషయమై విపులముగాను, ప్రమాణవంతముగాను 'శివనృత్య' మను (Dance of Siva) గ్రంథములో చర్చించెను.

ఆదిదేవుడైన పరమశివుడు ఆదినటుడు. మహానటుడు, నటేశుడు, నటరాజు, నటనాయకుడును. ఈనటనాయకమూర్తినే వైష్ణవులు రంగనాయకునిగా మార్చి ఆరాధించిరి. నటరాజునకు సర్వజగత్తు నాట్యరంగము.

"ఆంగికం భువనం యస్యవాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది తం నమః సాత్త్వికం శివం"

ఆయనశక్తి వల్లనే జీవులందరు చైతన్యముకలిగి బొమ్మలవలె ఆడుచున్నారు. ఈచైతన్యమే ఆత్మశక్తి, ఈశ్వరశక్తియును.

జీవితమొక యరణ్యము వంటిది. దేహమును అట్టిదే. అందనేకశక్తులు అడవిలోని చెట్లవలె, మార్గములవలె నున్నవి. వీనినన్నిటిని సమీకరణము చేయుటెట్లు? వీనినన్నిటిని ఏకీభావమును పొందించుటెట్లు? అను తీవ్రసమస్యకు సమాధానముగా కళారూపమగు శివనృత్యమేర్పడినది. సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములచేత చిందరవందరైన మన జీవితము విషాదహేతువు కాకుండ, సమానమైన పాళ్ళతో ద్వంద్వములను సమ్మేళనము చేసినచో సుఖప్రదమగు జీవితపరమార్థమును పొందవచ్చునని పూర్వుల సిద్ధాంతము. ఆదికారణమును, నియమితమైన గతితో కూడినట్టియు స్పందనాత్మకమును అగు ఈశ్వరశక్తి

యొక్క వ్యక్తీకరణమే శివనృత్యము (Manifestation of Primal rythmic energy). భూభ్రమణము, దానివలన కలుగు నక్షత్రముల భ్రమణము, గ్రహసంచారములు, చంద్రుని గతి ఇవన్నియును నియతములై అన్యోన్యసంబంధము కలిగి ప్రవేశ నిష్క్రమణములు కలిగి వానివాని గతులలో భేదములేక అనాదినుండియు జరుగుచున్నవి. ఇదంతయు ఒక బృందనృత్యముగా భావింపబడినది.

నృత్యము చైతన్యశక్తి విజృంభణము. అన్నిటికిని ప్రారంభము నృత్యమే. సృష్ట్యాదియందు మనుష్యుడు సృష్టిచైతన్యమునకు చకితుడై సృష్టికర్త నుద్దేశించి తన ఆనందమును వెల్లడించుటకై ఒడలెరుగని నృత్యము చేసియుండును. పర్వత శిఖరాగ్రమున మంచుకొండపై నివసించు ఆదిదేవుడగు శంకరునికి తమకృతజ్ఞతను నృత్యరూపమున ఆర్యులు తెలిపియుందురు. సంతోషకారణముకలిగి నప్పుడు మాటలచేత కాకుండ ఎక్కువగా గంతులు వేయుచు చిన్నపిల్లలు ఆనందమును వెలిబుచ్చుదురు. జంతుజాలమునకుకూడ నిదియే ప్రకృతి. మానవహృదయమును ఆకర్షించిన ఈశ్వరసృష్టి వైచిత్ర్యము. ప్రకృతి సౌందర్యము ఆరాధనీయములై పూజార్హములై ఒక ఆకారమును పొంది యుండును. అన్నివేళలకంటె సంధ్యవేళలలో ప్రకృతి సౌందర్యము ముఖ్యముగా హిమాలయప్రాంతములయందు మిక్కిలి ఆకర్షణీయముగా ఉండును. అందుచేత ప్రథమమున ప్రదోషకాలములయందు ఈశ్వరశక్తి ఆరాధింపబడి యుండును. స్తోత్రరూపమున అందరు కలిపి

ఆడియుందురు. రాను రాను ఈ ప్రదోష నృత్యమీలాగున భావింప బడినది. ముజ్జగములకు తల్లియగు ప్రకృతిస్వరూపిణియగు జగన్మాతను నవరత్నాలంకృతమగు బంగారుపీఠమున కూర్చుండ బెట్టి కైలాసశిఖరమున దేవశ్రేష్ఠులందరు తన చుట్టు నుండగా శూలపాణి నృత్యమాడెను. సరస్వతి వీణవాయించెను. ఇంద్రుడు వేణుగానము చేసెను; బ్రహ్మ తాళము వాయించెను; లక్ష్మిపాడెను; విష్ణువు మద్దెల వాయించెను; తక్కినవారు ఇరుగడల నిలిచి యుండిరి.

"కైలాసశైలభువనే త్రిజగజ్జనిత్రీమ్
గౌరీం నివేశ్య కనకాంచిత రత్నపీఠే
నృత్యం విధాతు మభివాంఛతి శూలపాణౌ
దేవాః ప్రదోషసమయేను భజంతి సర్వే.

వాగ్దేవీధృతవల్లకీ శతమఖోవేణుం దధత్పద్మజ
స్తాలం భద్రకరీ రమాభగవతీ గేయ ప్రయోగాన్వితా
విష్ణుస్సాంద్ర మృదంగవాదనపటుః దేవాస్సమస్తాః స్థితాః
సేవంతే తమను ప్రదోషసమయే దేవం మృడానీపతిమ్."

శివ నృత్యమునకు గొప్ప అంతరార్థము కల్పింపబడినది. ఆ యర్థమునే మూర్తిమంతముగా శిల్పులు సృష్టించినారు. ఈ సృష్టియే నటరాజమూర్తి. నటరాజనృత్యమును నాదాంత నృత్యమందురు. దీని భావమును వెల్లడి చేయునదే నటరాజ మూర్తి. ఈ మూర్తి యొక్క వివరములు ఇవి.

నటరాజ స్వరూపము :— చేతులు నాలుగు (నాలుగ దిక్కులు), జటాజూటము (పర్వతపంక్తిని, పర్వతాగ్రమును సూచించును; యతీశ్వరుడని చెప్పును.) అందు చుట్టుకొనియున్న నల్లత్రాచు (ఇది పర్వతములలో సహజమైనది), ఒక పుర్రె, గంగ, పైన చంద్రవంక, ఇవి శివుని చిహ్నములు. పుర్రె బ్రహ్మకపాలము, పర్వతములపైన గడ్డకట్టిన మంచు గంగ, ప్రదోషకాలమందు పర్వతాగ్రములపై దోచు ఆకాశతిలకమనదగు చంద్రవంక , కుడిచెవికి పురుషులు ధరించునట్టి, ఎడమచెవికి స్త్రీలు ధరించునట్టి చుట్లు (అర్ధనారీశ్వరుడని సూచన), ఎత్తిన కుడి చేతిలో ఢమరమను వాద్యము, రెండవ కుడిచేతితో అభయప్రదాన సూచకమగు ముద్ర ఉన్నవి. ఎత్తిన ఎడమచేతిలో అగ్నిజ్వాల. కుడికాలిక్రింద ముయలకుడను పొట్టి రాక్షసుడు — అతని చేతిలో పాము. ఎడమకాలు ఎత్తబడి యున్నది. దీనినే కుంచితపాద మందురు. రెండవ ఎడమచేయి ఈ పాదమును చూపుచున్నది. ఈ మూర్తి ప్రకాశమానమగు పద్మపీఠమున నుండును.

అంతరార్థము :— ఈ నటరాజ స్వరూపము పరమేశ్వరుని పంచకృత్యములను సూచించును. సృష్టి, స్థితి, సంహారము, తిరోభావము (మాయ), అనుగ్రహము (మోక్షము) అనునవి. ఇవి, వరసగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివుల క్రియలు. ఇవే విశ్వమందలి సర్వచైతన్యమునకు మూలాధారములు. చేతిలోని ఢమరము జగత్కారణమైన శబ్దమును సూచించుచున్నది (శబ్దవిష్టం జగత్). అభయహస్తము స్థితి (పోషణ)ని సూచించు

చున్నది. దీనివలన శాంతి, సుఖము, జ్ఞానమును మానవుడు పొందగలడని అభయమిచ్చుట సూచింపబడినది. అగ్నిజ్వాల సంహారసూచకము. సంసారమను సర్పమును ధరించి మాయా స్వరూపమైన అహంకారమును, ముంకుడను రక్కసి సూచించు చున్నాడు. అట్టి అహంకారమును పరమేశ్వరుడు త్రొక్కిపెట్టి యుంచినాడు. ఎత్తినపాదము మోక్ష (ఊర్ధ్వపదము) సూచకము. ప్రవృత్తి, మాయ, ప్రపంచము అను వీనిని దాటి పైకి గంతువేయుటయే గదా మోక్షము. అందుచేత కుంచితపాదము భవబంధవిమోచన సూచకము. ఇట్టి నటరాజమూర్తి తాండవించు జ్యోతిర్మయమగు పద్మపీఠము, నిర్మలమగు హృత్పుండరీకమును తెలుపుడు చేయుచున్నది. శక్తి ఆనందస్వరూపిణి. శక్తి పురుషునితో కలిసినప్పుడే, ఏకమైనప్పుడే నిత్యమైన జ్ఞానోదయమగును. అట్టి శివశక్త్యాత్మకమగు అర్ధనారీశ్వరస్వరూపమే నటరాజమూర్తి.

చిదంబర రహస్యము :— నటరాజు తాండవముచేయు స్థలము తిల్లవనము, అడవివంటి దేహము ; ప్రపంచముకూడ యని గ్రహింపనగును. మరియు ఈ స్థలము చిదంబరమనికూడ చెప్పబడినది. చిదంబర మను పుణ్యక్షేత్రము. చిత్ అను అంబరమే చిదంబరము. అంబరమనగా ఆకాశము, శూన్యము, శ్మశానము. సర్వమనోవికారములు, ప్రవృత్తులు, ప్రపంచవ్యామోహములు, ఇంద్రియ వ్యాపారములు నశించిన, కాల్పబడిన, స్వచ్ఛమైన చిత్తు అను అంబరము చిదాకాశము. అట్టి పవిత్రస్థావ

ములో గాని, అట్టి నిర్మలమగు అవస్థలో గాని దేహికి జ్ఞానము తాండవింపదు. నటరాజమూర్తి జ్ఞానస్వరూపుడగు పరమేశ్వరుని స్ఫురింపజేయునట్టి మూర్తి.

నటరాజ నృత్యముయొక్క మహోన్నతభావము శాస్త్ర వేత్తలకు, మతకర్తలకు, కళారాధకులకు కూడ సమానముగా ఉత్కృష్టమగు సందేశము నిచ్చునదనుటలో సందేహములేదు. బహుక్లిష్టమగు జీవితసమస్యకు సమాధానముగాను, వివిధజాతుల వారికి సమ్మతముగాను, ఏదో ఒక శతాబ్దమునకు జెందిన మేధావులకు మాత్రమే గాక, సర్వకాలములయందలి బుద్ధిమంతులకును, రాగులకును. జోగులకును కూడ తృప్తిని కలిగింపగల సర్వ భావములను ప్రత్యక్షము చేయగల నటరాజ నృత్యమును కళా పుంగవులగు ఋషిశ్రేష్ఠులు సృష్టించినారనిన ఎవరికి ఆశ్చర్యము, ఆనందము కలుగకుండును ? ఈ నటరాజమూర్తియొక్క శక్తి సౌందర్యము లెంతదివ్యములు! ఆర్యు లెంతటి ప్రతిభాశాలులు! సర్వదృశ్యముల వెనుకను తాండవించు శక్తియొక్క స్వరూప మును ఇంతకంటె ఎక్కువగా, మేలుగా సృష్టించ వీలగునా? ఢమరమువలన ద్యోతకమగునది స్పందనము. దానివలన పుట్టు అనంతములగు శక్తి తరంగములలోని ఆటుపోటులను, అనంత విశ్వమందు కలుగుచున్న ఎడతెగని మార్పును, బ్రహ్మకల్పము లలో విశ్వశిల్పమందు జరుగుచున్న సృష్టి, స్థితి, సంహార పరంపరలను ఎరిగి చూచెడువారికి నటరాజ నృత్యము కరతలామలక ముగ చూపుచున్నది.

కర్తవ్యము :— పాశ్చాత్యనాగరకత కొన్ని శతాబ్దముల నుండి విజృంభించినది. ప్రవృత్తి మార్గము ననుసరించినది. వాణిజ్యమును వ్యాపింపజేసి, విజయకాంక్షతో దేశదేశముల నాక్రమించినవి. బలవంతులలో రాజ్యకాంక్షలు పెచ్చుపెరిగి ప్రపంచక్షోభ కారణములైనవి. ఒక తరములోనే రెండు ప్రప్రంచ సంగ్రామము లుత్పన్నమైనవి. యంత్రతంత్రశక్తుల తాండవము చెలరేగినవి, దేశములను, లక్షలాది ప్రజలను బుగ్గి, బూడిద, నుగ్గు, నుసి, పొడి, గాలిగా, ఒక్క క్షణకాలములో, చేసివేయగల మహాశక్తులు సృష్టించబడినవి. కాని ఎట్టి శాంతియులేక ప్రప్రంచ మంతయు అల్లాడుచున్నది.

పాశ్చాత్యులలోని మహామహులందరు వారి నాగరకతలో ఏదో ఒక గొప్ప లోపమున్నదని గుర్తించియున్నారు. ప్రపంచ నాగరకతకు పుట్టిల్లయినట్టియు, అధ్యాత్మతత్త్వమునకు మూలకంద మైనట్టియు సర్వవిజ్ఞానమునకు జీవగఱ్ఱయైనట్టియు ఏషియాఖండము వైపు దృష్టిని త్రిప్పి చైనా భారతదేశీయుల సంస్కృతిని స్మరించి గ్రహించి కడుపార గ్రోలినగాని ఈసంక్షోభము, అశాంతి తీరవని ఆమహామహులు నొక్కి చెప్పియున్నారు. నశ్వరములగు ధన, ధాన్యములకై భారత చైనా దేశముల దండెత్తి కొల్లగొనుటవలన ఏమియును లాభించలేదు. శాశ్వతమగు క్షేమ, లాభముల పొంద వలెనన్న భారతాదిదేశీయుల ఆధ్యాత్మికధనమును చూరగొన వలసియున్నది. నాలుగైదు వేలేండ్లుగా స్థిరపడి పరమపూజ్యమైన ప్రాచ్యదేశ విజ్ఞానమును కడుపార భుజించినగాని జీర్ణించుకొనిన

గాని ప్రపంచమునంతటను వ్యాపించియున్న అజ్ఞాన రూపమగు క్షామము తీరదు. భారతీయుల సంస్కృతి వైదగ్ధ్యము నిండు వెన్నెలవలె ఒకానొకకాలమున ప్రకాశించియుండెను. కాని నేడది అడగి మడగి మూల మూలలో అంతరాళములలో చేరియున్నది. దాని నుద్ధరించినగాని తరణోపాయముండదు. భారతదేశసంస్కృతి యొక్క దివ్యాలాపములను పెడచెవిని పెట్టక ఆత్రతతో విని వీనులార గ్రోలవలసిన సమయమిది. బాహుబల మదాంధకారము చేత విఱ్ఱవీగి శాంతిమూలమగు ప్రాచ్యసందేశమును ధిక్కరించి నచో పాశ్చాత్యదేశములకేగాక ప్రాచ్యదేశములకుగూడ సర్వ నాశనము తప్పదు. తరువాత అంతయు శూన్యమైపోగలదు. సృష్టి కర్తచే నిర్మితమైన అనన్యసామాన్యమైన ప్రకృతి సౌందర్యము మానవ నిర్మితమైన సర్వసంపదలు మాయమైపోవునట్టి భయంకర స్థితి నేడు లోకమున కాపాదించియున్నది. అందుచేత ప్రాచ్య సంస్కృతియొక్క దివ్యబోధనలను ఆత్మశక్తియొక్క స్వరూప మును సామర్థ్యమును తెలిసికొని అదియే సర్వక్షేమములకు ఆధార భూతమని గ్రహింపవలసియున్నది. అధ్యాత్మవిద్యయే సర్వ శ్రేయస్సుల నీయగలదు. అట్టి మార్గమును ప్రపంచమంతయు అనతికాలములో ననుసరించి దివ్యవైభవముతో, సర్వమానవ సౌభ్రాత్రముతో, భూలోకస్వర్గమై వర్ధిల్లుగాక; సత్యము, శాంతి, అహింస నిత్యములై నిలుచుగాక! పాశ్చాత్యుల కార్య శక్తి భారతీయుల ఆత్మశక్తి ఏకమై లోకకళ్యాణ మగుగాక!

# పాండవాజ్ఞాతవాస వత్సరవ్యాప్తి నిర్ణయము

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్ర మహాభారత పీఠిక (వావిళ్ళ వారిచే నచ్చొత్తింపబడిన A critical Introduction to Andhra Mahabharatamu) యందు, తిక్కన యాంధ్రీకరణమును గూర్చిన యుదాహరణము లలో నొకటిగా నజ్ఞాతవాస సత్సర వ్యాప్తి సందర్భ ముదాహరించి, కొంతవరకు చర్చించి యందు, మూలమును నీలకంఠ భట్టాచార్యుని వ్యాఖ్యానమును తిక్కనార్యుని తెలుగు పద్యమును వ్రాసి పైవిషయములో, నివి పరస్పర సందర్భము లేకయున్న వనియు, ఈసందేహము లోకము విమర్శించుగాక యనియు వ్రాసి విడిచిరి.

శాస్త్రిగారు ప్రస్తావ వశమున పైవిషయము నాకు జదివి వినిపింపగా, మూలవ్యాఖ్యానాంధ్రీకరణములకు పరస్పర విరోధ మేమియును లేదని నాచేతనైనంత కొలదివి విమర్శింపబూనితిని.

చదువరుల సౌకర్యముకొరకు మూలము నిక్కడ వ్రాయు చున్నాను.

భీష్మః॥*

తేషాంకాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్।
పంచమేపంచమే వర్షే ద్వౌమాసావుపజాయతః॥

---

* వ్యాఖ్యానము — జ్యోతిషాం వ్యతిక్రమాత్—మార్గేణ చంద్రేణ చలంఘనాత్. అత్రిచతుర్వింశత్యా సౌరాబ్దంద్రిసంవత్సరః చతుష్పంచాశదధిక శతత్రయ (354) దినాత్మకః—పంచషష్ట్యుత్తరత్రిశత (365) దినాని, పంచదశఘటికాః (15) ఏకత్రింశ

ఏషామప్యధికామాసాః పంచచద్వాదశక్షపాః।
త్రయోదశానాం వర్షాణామితిమే వర్తతేమతిః॥
సర్వంయథావచ్చరితం యద్యదేభిః ప్రతిశ్రుతమ్।
ఏవమేతద్ధ్రువం జ్ఞాత్వాతతో బీభత్సురాగతః॥

తిక్కన తెలుగుపద్యము.

సీ॥ "రెండవయేట నొక్కండధిమాస మిట్లెక్కిన యన్నెలలెల్ల గూర్చి
కొన నేడుమూడు హాయనములు తప్పక విన్నటితోడనె వింతె వింత
యెఱిఁగియె తమపూన్కి యెల్లనుదీర్చితిమని పొడసూపె నర్జునుడు నేడు."

విరాటపర్వము ౪ ఆ. 232 ప.

---

ద్వివార్ద్యః (31) త్రింశ (30) దక్షరాణి, సౌరసంవత్సరమానం-షష్ట్యధికశతత్రియ (360) దినాత్మక స్సావన సంవత్సరః తత్ర-ప్రతిజ్ఞానిర్వహణాది ప్రాయశ్చిత్త క్రియా స్సావనమానేనైవ నిర్వర్త్యాః-నసౌరమానేన-నాపిచాంద్రమానేన-తథేతి శాస్త్రనిశ్చయాత్-తథాహి॥ శ్లో॥ ఆయుర్దాయ విభాగశ్చ ప్రాయశ్చిత్త క్రియాశ్చహి। సావనేనైవ కర్తవ్యా గార్గ్యస్య వచనం తథా॥ ఇత్యుక్తత్వాత్-యదా సౌర చాంద్రమానయో రాంతరాళికస్సావన స్సౌరమానేన సాకం సమీక్రియతే-తదాసౌరమాన గతావృద్ధి స్తత్రలభ్యతే-తథైవ-సౌరచంద్రమానయోర్విషయేఽపి-సామరస్యేక్రియమాణే త్రయోదశసు సౌరసంవత్సరేషు గతేషు పంచచాంద్రమాసాః కించిదభ్యధిక ద్వాదశదినా (౫ మా. 12, + ,ది) వ్యధికాని భవంతీతిజ్ఞేయం. ఏవమేవక్రమేణసావన మానానురోధేన గణనాయాం క్రియమాణాయాం త్రయోదశ సౌరసంవత్సర పరిపూర్తేః-సపాదాష్ట షష్టిదినేభ్యః $(88\frac{1}{4})$ పూర్వమేవ త్రయోదశ సావన సంవత్సరాణాం పరిపూర్తి స్సమగ్రతయా జాయతే. తస్మాద్యథావచ్చరిత మిత్యాదినా-పాండవైర్యథా ప్రతిజ్ఞమాచరిత మిత్యుక్తమ్.

తిక్కనార్యుని ఈపద్యమును గురించి శాస్త్రిగారిట్లు వ్రాసిరి. "....13 సౌర సంవత్సరములైన నాటికి (ఉత్తర గోగ్రహణము నాటికి) పూర్వదినముతో నిండినట్లు కనబడుచుండుటంబట్టి యీ వ్యాఖ్యాన మాధారముగానో మరియెట్లో తిక్కనార్యుఁడు 'నిన్నటి తోడనె నిండె' ననుచు నూదిపలికి సౌరమానమున గాల నిర్ణయ మొనరించినట్లు కనబడుచున్నది."

దీనికి సమాధానము — వ్యాఖ్యానమందు 13 సౌరాబ్దము లైన 'నిన్నటితో నిండి' నట్లు గానరాదు. అందుచేత వ్యాఖ్యాన మాధారము గానేరదు. వ్యాసకృత మహాభారతమందలి పూర్వ సందర్భములను బట్టి యీభావమును గ్రహించి తిక్కన తెలుగు చేయుటలో వ్యక్తపరిచెను. తిక్కనభావము సరియైనదని యీక్రింది పద్యములవలన స్పష్టము కాగలదు.

ఆంధ్ర మహాభారత మందలి విరాటపర్వ తృతీయాశ్వాసములో 107 వ పద్యమందు కృపాచార్యు డిట్లు చెప్పెను.

" వారలు పూనినట్లు వనవాసము సల్పిరి పేరువేఁడి త
మ్మారయగా బయల్పడనియట్లుగ నుండెదు వత్సరంబును
స్నేరువ చేరువల్గడచె........"

దీనికి వ్యాస మహాభారత మందలి మూలము.

" నివృత్త సమయాః పార్థా మహాత్మానో మహాబలాః "

ఆ సందర్భ మందే పిదప 191 వ పద్య మిట్లున్నది.

" పాండురాజ సుతులు పాంచాలియునుదమ్ము నొరు తెరుంగ
కుండ దిరుగ వలయు
దుష్కరంపుచేదు దుదిసేరబాతె నెవ్వరును దీని దలపవలను
లేర "

దీనికి మూలము.

" తతస్త్రయోదశ స్యాంతే తస్యవర్షస్య భారత
సుశర్మణా గృహీతం తద్గోధనం తరసాబహు. "

ఇంకను నొక సందర్భము, దక్షిణ గోగ్రహణమందు విరాటుడు సుశర్మచే గట్టబడియున్న సందర్భమందు ధర్మరాజు భీమునితో నిట్లనును.

" తరువు వెస బెరికికొని నీ, వురవడిమై గవిసితేని నుభయ
బలము న
చ్చెరు వందుచు జూచి వృకో, దరుడ వగుట యెఱుగకున్నె
తద్విధ మేలా, "

మూలము.

" మా భీమసాహసం కార్షీ స్తిష్ఠ త్వేష వనస్పతిః।
మాత్వాం వృక్షేణ కర్మాణి కుర్వాణమతి మానుషమ్॥
జనాస్సమవ బుధ్యేర న్భీమోఽయ మితి భారత।
అన్యదే వాయుధం కించిత్ ప్రతిపద్యస్వమానుషమ్॥ "

దీనివలన దక్షిణ గ్రోహణము నాటికి సమయపూర్తి కాన టుల స్పష్టము. మరుసా డుత్తర గోగ్రహణమందు అర్జునుడు తన్నుత్తరుడ కెరింగించు కొనెను. ఆసమయమందే భీష్ముల

వాసను సమయాబ్దములనిండెనని నిష్కర్షచేయుట చేత 'నిన్నటితోడనె నిండె' ననుట సమంజసమే. ఈయభిప్రాయమే కన్నడ భారత మందుగూడ నీసందర్భమున నిట్లు చెప్పబడి యున్నది.

"మగనె, కేళిరై దువర్షకె, మిగువువెరడే మాసమాసా
దిగళనవరనుభవిసిదరు హదిమూరు వత్సరవ
మిగువవధి బళరతియె నిన్నహగలు నిన్నదు పాండుతనయరు
పొగువాడిందిన దినసవవరదు కందకేళెంద॥"

(నిన్నటిదినమునిది; ఈదినము వారిది యని తాత్పర్యము)

(2) "పదుమూడు హాయనములు తప్పక నిన్నటి తోడనె నిండె" ననుచో హాయనమన, సావన సంవత్సరమా, సౌరసంవత్సరమా యని కొంత శంకించుకొని రెండింటికిని రెండ సందర్భములను శాస్త్రిగారు చూపించియున్నారు. మూలమందు లేని సావన సంవత్సరమును వ్యాఖ్యానకర్త గార్గ్యవచన మాధారముగా వ్యాఖ్యానమందు జొప్పించినాడు. కాని యావిషయమెంత మాత్రమును మూలమందు భావింపబడలేదని నా యభిప్రాయము, కాన ప్రస్తుత మాచర్చ యనవసరము.

శాస్త్రిగారి పీఠికలో నిట్లున్నది. "మూలములోని 13 వత్సరములలోను 5 మా, 12 దినము లధికముగా వచ్చినవని యుండుటచే నవి చాంద్రమానాబ్దము లగుటంబట్టి క్రిందిపట్టిక ప్రకారము అప్పటికి సౌరాబ్దములు పదుమూడు నిండుటకు 13 దినములు తక్కువయైనట్లు తెలియుచున్నది.

ఎట్లనగా ది గ

13 సౌరాబ్దములకు దినములు $(13\times 365\frac{1}{4})$....4748-15

13 చాంద్రాబ్దములకు $(13\times 354)$ 4602 }
5. మా. 12 ది కు $(5\times 29\frac{1}{2}+12) 159\frac{1}{2}$ } ....4761-30

దీనింబట్టి భీష్ముడు చేసిన కాలనిర్ణయము నాటికే 13 సౌరాబ్దములు నిండె నందుమా? ఈ 13సం॥ లో మా. 5 ది. 12 లధికముగా వచ్చినవని చెప్పెడి మాటయు విరుద్ధమగును". ఈ ప్రశ్నకు సమాధానము మూలమందే స్పష్టపరుపబడి యున్నది "తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్ పంచమేపంచ మేవర్షే ద్వౌమాసావుపజాయతః॥'' దీని భావము-సూర్యచంద్రులు నక్షత్రములను దాటుటలో గలుగు హెచ్చు 5 సంవత్సరములలోను 2 మాసములు అనగా, 5 సౌర సంవత్సరములు 5 చాంద్ర సంవత్సరములకంటె 2 మాసములధికము. భారతకాలమునాడు సౌర చాంద్రమాసములయొక్క సర్దుబాటట్టిది యని స్పష్టము. ఈ 5సంవత్సరముల కాలమునకును యుగమని పేరు (వేదాంగ జ్యోతిషమందు). అప్పటి గణితపద్ధతిని బట్టి ఈ యుగము 62 చాంద్ర మాసములకు సమానము. ఒక చాంద్ర మాసమనగా ది. 29 గడి 31 వి. గ. 50 అక్ష. $7\frac{1}{2}$*

62 చాంద్రమాసములు 1830. 90 దినములు = 5 సౌర సంవత్సరములు. ఒక సౌర సంవత్సరమునకు 366.2 దినములని వ్యాస

* సాధారణముగా $29\frac{1}{2}$ దినములని లెక్కించుచున్నాము. అట్లే లెక్కించినచో 62 మాసములు = 1829 దినములు = 5 సౌర సం. ఒక సౌరసంవత్సరమునకు 366 దినములు రమారమిగా సమానము.

భారతమూలమునుబట్టి గ్రహించవలసియున్నది. వ్యాఖ్యాత సూర్య సిద్ధాంతమునుబట్టి ఇచ్చిన 365.25 దినములకంటె ఇది రమారమి ఒక దినమధికము. అట్లే 13 సౌర సంవత్సరములకు నాటి లెక్క ప్రకారము 13 దినము లధికముగా లెక్కించవలెను. అందు చేత పైనవ్రాసిన 4748ది - 15గ లకు బదులు 4761-15గ లని వ్రాయవలెను. అప్పుడది 4761ది. 30గ లకు సరివచ్చును.

కాని సౌర సంవత్సరమునకు 365¼ దినములగుట సార్వ కాలిక సత్యమైయుండగా నపుడు మాత్రమొక దిన మధికముగా నెట్లుగలుగునని సంశయము గలుగకమానదు. నిజమే, దీనికిట్లు సమాధాన మరయదగును. ‘ఎన్ని సంవత్సరముల కొక యధి మాసము వచ్చునండీ’ యని మనమిప్పుడు సిద్ధాంతులను ప్రశ్నిం చిన ‘మూడేండ్ల కొకసారి’ యని వారు సాధారణముగా ప్రత్యు త్తర మిత్తురు. దీనినే సిద్ధాంతముగ తీసికొనినచో 3 సౌర సంవ త్సరములు 37 చాంద్రమాసములకు అనగా 1092.6 దినములకు సరియగును. దీనినిబట్టి ఒక సౌర సంవత్సరము 1092.6/3 = 364.2 దినములకు సరియగును. ఇది 365.25 దినములకంటె రమారమి ఒక దినము తక్కువ. అట్లు చెప్పుటచేత 18 సం॥ గడచుసరికి చాంద్రసంవత్సరాది సౌర సంవత్సరాదికంటె రమారమి 18 దిన ములు ముందగును. ఒక సౌరసంవత్సరము చాంద్ర సంవత్సరము కంటె సుమారు 11 (365.25-354) దినములధికమగుటచేత, 19 సౌర సంవత్సరములు పూర్తియగునాటికి 19 చాంద్రసంవత్సరములు పూర్తియై (18 + 11) సుమారు 29 రోజులగును. కనుకనే 19 వ

యేటఁగూడ నొక యధికమాసము వేసికొని 19సౌర సం॥లకు 7 అధికమాసములని రెండు మానములను సరిజూచుకొనుచున్నాము. కనుక మూడేండ్ల కొక యధికమాసమనుట సౌకర్యము కొఱకు చెప్పునదిగాని సరియైనదికాదు. ఈ విధముగానే ప్రజలకు సుల భముగా దెలియుటకుగాను 5 సం॥ లకు 2 అధికమాసములని నాటివారు ఉజ్జాయింపు లెక్క చెప్పెడివారు. ఈఉజ్జాయింపు లెక్క ప్రకారము సంవత్సరమున కొక దినము చొప్పున 30 సౌర సంవత్సరములకు 30దినము లధికముగ వచ్చునుగనుక(366.2–365.25) 30 దినము లొక చాంద్రమాసమునకు సుమారు సమానముగాన ఆ ముప్పది సౌర సం॥లలో అనగా 6 వ యుగాంతమందు ($6\times5=30$) రాతగ్గ ($\frac{30}{5}=6$: $6\times2$) 12 అధికమాసములలో ఒక మాసమును (30 దినములు) తగ్గించుకొని, 30 సౌరసం॥ లకు, 11 అధికమాసములని లెక్కించి, రెండు మానములను సరి జూచుకొని యుందురు. ఇది బహుకాలమునాటి అధికమాసగణన పద్ధతి. ఇదియే వేదాంగ జ్యోతిష పద్ధతి. దీనిని గుఱించి దివాను బహద్దరు స్వామికణ్ణుపిళ్ళగారు విపులముగా వ్రాసియేయున్నారు. (The Vedanga Jyotish-Examples of Yuga Cycle and Exeligmos and The Vedanga Jyotish Calendar)

కావున 'పంచమే పంచమే వర్షే' యను మూలమునుబట్టి పాండవుల సమయకాలమందు 5 మా. 12 ది. లధికముగా దప్పక వచ్చియున్నవి. కావున పాండవాజ్ఞాత వత్సర వ్యాప్తిని గూర్చి సంశయమక్కఱలేదు.

(3) మఱియు, శాస్త్రిగారు “పంచమే పంచమే వర్షే ...” అను దానిని వ్యాఖ్యాతయు తిక్కనార్యుడుగూడ గ్రహించినట్లు కానరాదు.” అని వ్రాసియున్నారు. వ్యాఖ్యాత గ్రహించినట్లు తెలియుచున్నది. సావనమానము సౌరచాంద్రమానముల అంతరాళిక మని చెప్పినాడు. మఱియు చాంద్రసంవత్సరము సుమారు 354 దినములని, సావన సంవత్సరము 360 దినములని చెప్పుటచేత సౌర సంవత్సరము 366 దినములై యుండవలెను. ( $\frac{354+366}{2} = 360$ ) అని గూఢముగా చెప్పియున్నాడు. (అంతరాళికము = mean). ఇది స్థూలదృష్టి చెప్పినలెక్క. మఱియు సరిగా గణించినచో సౌరసంవత్సరమునకు 365.25 దినములని. అందుచేతనే 13 సౌర సంవత్సరములు 13 సావన సంవత్సరములకంటె ( $13 \times 5\frac{1}{4} = 68\frac{1}{4}$ దినము లధికముగా చెప్పియున్నాడు.

ఇక “రెండు మూఁడేటి నొక్కండధిమాసము” అని మూలములోను వ్యాఖ్యానములోను లేని విషయమేల తిక్కన వ్రాసియున్నాడని యాలోచింప దగియున్నది. దీని కిట్లు సమాధాన మియ్యవచ్చును. 5 సం॥ లకు 2 అధికమాసములను మూల మందలి లెక్కలేకాక మూడు సం॥ లకు ఒక యధికమాసమును తన కాలపునాటి లెక్కను సమన్వయించు కొనుటకై ఇట్లు వ్రాసి యుండవచ్చును. ఈ సమన్వయమున కొక యుదాహరణమును సూచించుచున్నాను. పాండవులు ప్రభవ సంవత్సర మాఘ శుక్ల మందరణ్యమునకు పయనమైరనుకొని యీ క్రింది పట్టికను వ్రాసితిని.

| సంఖ్య | సంవత్సరము | అధికమాసము | పాండవుల సమయకాల హాయనములు |
|---|---|---|---|
| 1 | ప్రభవ | లేదు | ఆంగిరస మాఘ శుక్లమునకు 5 ఏండ్ల సమయకాలము పూర్తియగును, అందు రెండధికమాసములు వచ్చినవి. |
| 2 | విభవ | జ్యేష్ఠము | మూడేండ్ల కొక యధిక మాసము వచ్చినది. రెండవదగు విభవలో మొదటి యధికమాసమని తిక్కన చెప్పినాడు. |
| 3 | శుక్ల | లేదు | |
| 4 | ప్రమోదూత | ,, | |
| 5 | ప్రజోత్పత్తి | ఆషాఢము | |
| 6 | ఆంగిరస | లేదు | |
| 7 | శ్రీముఖ | లేదు | ఈశ్వర మాఘ శుక్లమునకు 10 ఏండ్ల సమయకాలము పూర్తియగును. ఈయైదేండ్లలోను గూడ 2 అధిక మాసములు వచ్చినవి. మూడేండ్ల కొక యధికమాసము వచ్చినది. |
| 8 | భావ | శ్రావణము | |
| 9 | యువ | లేదు | |
| 10 | ధాత | ,, | |
| 11 | ఈశ్వర | భాద్రపదము | |
| 12 | బహుధాన్య | లేదు | విక్రమ మాఘ శుక్లమునకు 13 సమయాబ్దములు నిండును. ఈ మూడేండ్లలో ఒక అధిక మాసము వచ్చినది. మొత్తము మీద 5 అధిక మాసములు వచ్చినవి. అధిక దినములను సూచించలేదు |
| 13 | ప్రమాది | ,, | |
| 14 | విక్రమ | ఆశ్వీజము | |

## పరిణామవాదము

జీవిత సమస్యలలో నిరంతరము కొట్టు మిట్టాడుచు, తీరని కోర్కెలకై అల్లాడుచు, నిత్యావసరములను తీర్చుకొనుటకై యవస్థపడుచు, పట్టణములలో నివసించు మనము అన్యచింత చేయుట కెట్టియవకాశమును లేకున్నాము. ప్రకృతియొక్క అద్భుత సృష్టి వైచిత్ర్యము మన మనస్సుల నాకర్షించుటలేదు. మనపూర్వులిట్లు గాక అమాయకులై ప్రకృతి శోభకు ముగ్ధులై సృష్టి రహస్యమేమియై యుండునను జిజ్ఞాసకలవారై యుండిరి.

సృష్టిక్రమమును దెలుపు ఒక సొగసైన కథ బైబిలులో మొదటి ప్రకరణమందు కలదు—సృష్టికి పూర్వము అంధకారమయమగు శూన్యాకాశముండెను. "ఆకాశము జ్యోతిర్మయమగుగాక" యని భగవంతుడు సంకల్పింపగా "కాంతి వెల్లివిరిసెను" అంధకారము మాయమైపోయెను. స్వర్గములను, భూమిని, సముద్రములను, వృక్షములను, సూర్యచంద్రాదులగు ఆకాశగోళములను జంతువులను భగవంతుడు సృజించి తుట్టతుదను తనకు ప్రతిబింబమనదగు మనుష్యుని సృష్టించెను—అని.

మన ఋషులు, తత్వజ్ఞానులు వివిధములగు సృష్టి వాదములను సూత్రీకరించిరి. ప్రపంచ మంతయు పరమాణువులతో ఆదియందే నిండియుండెననియు, ఆపరమాణువులయొక్క పరస్పర సమ్మేళనము వలన ప్రపంచమందలి వివిధ వస్తువులు పుట్టెననియు నైయాయికుల మతము. సృష్టి యంతయు ప్రకృతి యొక్క పరిణామమని సాంఖ్యుల మతము. సాంఖ్యుల సృష్టి వాదమునే అద్వైతు లంగీకరించిరికాని, ప్రకృతికారణము కాదు పరమపురుషుడే హేతుభూత మనిరి.

పురాణ ప్రసిద్ధములగు విష్ణుని దశావతారములలో ప్రాణికోటియొక్క పరిణామ క్రమమందుగల ముఖ్యములగు దశలు, ఘట్టములు గోచరించుచున్నవి. కేవలము జలచరమైన మత్స్యము వెన్నెముకగల జీవులలో మొదటిది. కూర్మము జలమందు, భూమిపైని కూడ బ్రతుకగలిగిన జంతువు. భూమిపైని మాత్రమే అడవులలో తిరుగు క్రూరజంతువు వరాహము జంతువు మనిషిగా

పరిణమించు మధ్యావస్థను దెలుపునది, నరసింహము. పొట్టిమను ష్యుడు వామనుడు. వేట, వధ క్రియాకలాపములుగా గల మను ష్యుడు పరశురాముడు. ఆదర్శపురుషుడు శ్రీరాముడు. అమానుష ప్రజ్ఞావంతులు బలరామ, కృష్ణులు. పామరులకు విజ్ఞాన మార్గ మును బోధించు శాంతి స్వరూపుడు, కరుణామయుడు బుద్ధుడు.

ప్రాణులలో ఏదో పరిణామము అనాదిగా సాగుచున్నదను సత్యమును గ్రహించుట మాత్రమే గాని, దాని మూలసూత్రము లేవో, చరిత్ర ఎట్టిదో తెలిసికొనుటకై ఏ పరిశీలనయు పదు నెనిమిదవ శతాబ్ది మధ్యభాగము వరకు జరుగలేదు. ఆతరువాత లినో, కువియర్, ఓవెన్ అనువారు శిలరూపము పొందిన జంతు వుల,చెట్ల (fossils) యొక్క పరస్పర రూప నిర్మాణములను (morphology) పరిశోధించిరి. వృక్షములయందు జంతువుల యందుగల నానా జాతులు సృష్ట్యాదినుండియు మార్పును జెంద లేదని వారనుకొనిరి. కాని, వారి తరువాతి వాడగు, గొప్ప జీవ శాస్త్ర వేత్తయునగు చార్లెస్ డార్విన్, జీవజాలములలో మార్పు కలుగుచున్నదని చెప్పుటయేగాక ఆమార్పు ఎట్లు కలుగునో సూచించుటకై "స్వాభావికముగ వేరు పరచుట" (natural selection) యను, గుణము కలదను వాదమును లేవదీసెను. సమర్థములైనవి చావకమిగిలి యుండునని (survival of the fittest) జీవితపు పోరాటమందు నిలువగల జాతులే భద్రముగా నుండునని (preservation of the favoured races in the struggle for life) 1838 లోనే డార్విన్ ఊహించెను,

కాని ఇరువదేండ్ల తరువాత వీనిని ప్రచురించెను. 1859 లో ఇతడు ప్రకటించిన "జాతుల ఉత్పత్తి" (Origin of the Species) అను గ్రంథముతో జీవశాస్త్రచరిత్రయందు ఒక ప్రధాన ఘట్టము ప్రారంభమయ్యెను. కొద్దిపాటి మార్పులు—ఒక విషయములో హెచ్చు, ఒక విషయములో తగ్గు—ఒక్కొక్క తరములో కలుగుటవలన జాతులలో భేదములు పుట్టుచున్నవని, ఇట్లు కొన్ని తరములగుసరికి ఈస్వల్ప వ్యత్యయములు పెరిగి పెరిగి పెద్ద మార్పు క్రింద జాతులలో పొడకట్టునని డార్విన్ ప్రతిపాదించెను. కాని కొన్ని ప్రత్యక్ష నిదర్శనముల కీవాదము సరిపడలేదు. కొన్ని జాతుల మొక్కలలో ఉన్నట్టుండి హఠాత్తుగా మార్పులు గోచరించుచున్నవని 1900 ప్రాంతమందు డీవ్రీజ్ కనిపెట్టెను. వంశానుగతముగా వచ్చు గుణములు సాధారణముగా అట్టే మార్పు జెందకుండ తర తరములలో గోచరించుచుండును. కాని ఒక్కొక్కసారి పారంపర్యముగా వచ్చు గుణములలో ఆకస్మికముగ మార్పులు, నూతన విశేషములు సంక్రమించుచుండును. ఈమార్పునకు మ్యుటేషను (mutation) అని డీవ్రీజ్ పేరిడెను. వంశపారంపర్యముగా వచ్చు గుణములలో కొన్ని తీవ్రమైనవి, కొన్ని అణగి మణగి అంతగా స్పష్టముగా గోచరించనివిగా ఉండును. ఈగుణములు, ప్రత్యేకతలు — కండ్లరంగు, జుట్టుతీరు, స్థౌల్యము, సంగీత కళయందు నేర్పు మొదలైనవి — తలిదండ్రుల నుండి పిల్లలకు సంక్రమించును. నానావిధములుగా మిశ్రితమైన (complex) మాంసకృత్తుల బీజాణువులు (protein molecules) ఈప్రత్యేకతలకు మూలస్థానములని శాస్త్రపరిశోధన వలన

తెలియవచ్చినది. వీని పేరు జనె (genes). ఇవి జీవాణువుల (cells) కేంద్రకములోని భాగములైన క్రోమోజోమ్సులలో తీగకు గ్రుచ్చిన పూసలవలె అమర్చబడియుండును. క్రోమోజోమ్సు ప్రోటోప్లాజమ్ అను జీవ పదార్థపు సూక్ష్మ రూపములు. అవి ఒకటి రెండుగా విభజన పొందుటచేత, వానిసంఖ్య క్రమముగా పెరుగును. క్రోమోజోమ్సులోని సూక్ష్మావయవములగు జెనెల ద్వారా తలిదండ్రుల గుణములు సంతానమునకు కలుగును. ఈ జెనెలలో ప్రబలమైనవే ఎక్కువగా సంతానమునకు సంక్రమించును. అందుచేత సంతానమునకు ప్రబలమగు గుణములే పారంపర్యముగా ఎక్కువగా వచ్చుచుండును. కాని ప్రబల జెనెలతో బలహీనమగు జెనెలు కూడ స్వల్పముగా సంతానమందు సంక్రమించుచుండును. అందుచేత తత్సంబంధమగు గుణములు ప్రబలముగా గోచరింపక నిదానముగా పరిశీలించినప్పుడుమాత్రమే తెలియవచ్చును. కాని, ఇట్టిబలహీనములగు గుణము లొక్కొక్క సంతానమందు ప్రబలముగా గోచరించుటకూడ సకృత్తుగా తటస్థించుచుండును. ఇట్టి గుణభేదము లెట్లు వివిధములగు జెనెల యొక్క సమ్మేళనము వలన కలుగునో ఆవిధానము నంతయును మెండెల్‌యను జీవశాస్త్రవేత్త కొన్ని సూత్రముల (Mendel's laws) ద్వారా వివరించెను, ఈసూత్రములద్వారా మెండేలియన్ వంశానుక్రమణ వాదము (Mendelian theory of heredity) ఒకటి ప్రతిపాదింపబడెను. దీనిని జీవశాస్త్రజ్ఞు లందరు ఆమోదించిరి. దీపనుంచి జెనెటిక్సు (genetics) అను వంశానుక్రమణ శాస్త్రము క్రమముగా వృద్ధిపొందినది. ఈశాస్త్రము పరిణామ

వాదమునకు జెందిన వివిధ విషయములను సమన్వయించి ఆవాద పరిశీలనను ప్రోత్సహించినది ఇట్టి శాస్త్రము బాగుగ వృద్ధిచెంది జీవశాస్త్ర చరిత్రయందు సాంప్రదాయకముగా వచ్చుచున్న సమస్య లన్నిటికిని ఉపపత్తి కల్పించినది. ఈ శాస్త్రమింక నెంతో వృద్ధి కావలసియున్నది ఈమధ్యనే ప్రారంభమైన పిండోత్పత్తి వృద్ధి గురించిన శాస్త్రము (embryology) నకు సంబంధించిన ప్రయో గము లింకను విరివిగా సాగవలసియున్నవి.

సకల ప్రాణులయందు ఏకత్వము (Unity of life) అను మహోన్నత సత్యము కలదని ఈపరిణామవాదము నిరూపించి నది మానవులందరు మాత్రమేగాక ప్రాణికోటి యంతయు సోదర ప్రాయులని, ఏకజన్మస్థానమునుండే – జీవకణమునుండే –ఉద్భవ మగుచున్నదని ఒక్కమూల ప్రక్రియానుసారమే వివిధరీతులలో జాతులుగా వృద్ధిచెందుచున్నదని నిరూపించినది.

సృష్టిలో మానవు డుత్కృష్టస్థానమును పొందియున్నాడు. అతని జాతియేవేరు, తరహాయేవేరు. యోచన, ఏర్పాటు, ఆదర్శము మొదలగు గుణవిశేషములు మానవునికి తప్ప ఏప్రాణికిని లేవు. మానవసృష్టితో సంఘమని దాని నిర్మాణమని ఒక నూతనపరి ణామక్రియ ప్రారంభమైనది. అలవాటుగా ఒకరితో ఒకరు అట్టి సంఘమందు ఆలోచనలు సలుపుకొనుటవలన నూతనమగు అవ సరములు, కోరికలు, మనోభావములు, విలువలు. నైతిక పరి ష్కారములు ఉత్పత్తి యగుచుండును. పశముతప్పని ఎఱుకతో సాంఘికపరిణామము పురోగమించుచున్నది. మరియు ఇంతు

కోటి యంతటిలో ఒక్క మానవునికే తాను పరిణామము పొందు చున్నానను అను ఎఱుక కలదు. తాను పొందు పరిణామమును సక్రమమార్గమును పట్టునట్లు చేయవలెనను తలంపు, సమర్థత మానవుని కొక్కనికే గలదు. కాని ఈపరిణామక్రియ పూర్తిగా అతని స్వాధీనములోని కింకను రాలేదు.

మానవుడు మేలుమానిసి (Super-man) గా రూపొందుటకై మాఱ్పు సాగుచున్నది. మానవగరిష్ఠులకు గల తెలివి తేటలు జనసామాన్యమునకు కలుగవలసియున్నది, మానవుని గరిష్ఠప్రజ్ఞ, తెలివి ఇంకను పెరుగవలసి యున్నది. ఆయుర్దాయ విషయమందుగూడ సామాన్యప్రమాణము, గరిష్ఠప్రమాణము కూడ పెరిగి అన్నివిధముల మానవజాతి పురోగమించవలసి యున్నది. పరిణామసంబంధములగు పరిస్థితులను వశములో నుంచుకోగలిగిననగాని ఈ పురోగమనము సాగదు. ఆధివ్యాధుల నడ్డుట, నివారించుట, యుక్తమగు యాహారనియమము, ఇతర ఆరోగ్యసాధనములు, సంపూర్ణము, సక్రమము యైన మానసిక వికాసము, ఆధ్యాత్మికవృద్ధి ఇవన్నియును పరిణామపరిస్థితుల స్వాధీనపరచుకొనుటయం దిమిడియున్నవి. సంఘముతో సంబంధములేని ఏకాంతవాసము (Segregation and isolation) ఇట్టి పురోగమనమునకు దోహదమిచ్చి సత్ఫలితముల చేకూర్చు నని శాస్త్రము చెప్పుచున్నది. నిర్మానుష్యమగు అటవీ ప్రదేశములయందు, కొండగుహలలోను, యోగము నభ్యసించుట, తపస్సుచేయుట యను సనాతనమార్గములయందీ మహత్తరమగు గుణవిశేషము నిబిడీకృతమై యున్నదని వేరే చెప్పనవసరములేదు.

మరియు దేహసంబంధమైన, సంఘసంబంధమైన భేదములను సానుభూతితో సహించగలిగినపుడుగాని మానవునియొక్క, సంఘముయొక్క పురోభివృద్ధి సాధ్యపడదు. ఏమనగా, మార్పు లేని అభివృద్ధి, వ్యత్యాసములు లేని మార్పులు ఉండజాలవు. ఒక నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించుటకై మనము నేడు గాఢముగా అభిలషించుచున్నాము. అట్టి నూతన వ్యవస్థ మానవుని అంతర్యము మారినగాని సాధ్యము కాదు. సంఘము యొక్క తీరు మారవలెనన్న మనిషిలో మార్పు కలుగవలెను గదా. స్వయంసమృద్ధి, మనోనిగ్రహము గల వ్యక్తులను తయారు చేయుటయే మానవాభ్యుదయ చరిత్ర యొక్క లక్ష్యము. అట్టి లక్ష్యమునకు మన మింకను ఎంతో దూరములో ఉన్నాము.

మరియు, ఈ పరిణామ శాస్త్రములో మానవుని దేహమునకు, దేహధర్మములకు సంబంధించిన విషయముల గురించి మాత్రమే పరిశీలన జరుగుచున్నది. శరీరసంబంధములైన గుణములనే గాక మనస్సునకు, ఆత్మకు సంబంధించిన గుణముల యొక్క పరిశీలన చాల ముఖ్యమైనది. ఆత్మశక్తి ప్రాణమునకాధారము. శరీరసంబంధమైన సర్వధర్మములు, మానసికములైన సర్వవృత్తులు ఈ ఆత్మశక్తి వలననే నడచుచున్నవి. మన మునులు, ఋషులు ఆధ్యాత్మికవిద్య నభ్యసించిన ఘనులు. ఆత్మ నిత్యమని, శరీరముతో ఆత్మ నశింపదని, మరియొక శరీరముతో ఆత్మ జనించుచున్నదని వారినమ్మకము. శరీరములందలి పరిణామక్రమమును శాస్త్రజ్ఞులు శోధించుచున్నారే గాని, ఇన్ని శరీరములను ధరించు ఆత్మయొక్క పరిణామమును గురించి పరిశోధన

చేయుట లేదు. అంతరాత్మ చెందు మార్పులను పరిశీలించినగాని మనుజుని ఆంతర్య స్వభావము తెలియదు.. ఈ ఆంతర్యమందు మార్పు కలిగినగాని నేటి సంఘస్థితి ఉత్తమ సాంఘిక వ్యవస్థ గాను, నేటి మానవుడు మేలు మానిసిగాను పురోగమింప వీలు లేదు. ఆత్మవిచారము వలనగాని మానవాభ్యుదయమునకు దారి గోచరింపదు,

హిందూ, చైనా, ఈజిప్టు మొదలగు ప్రాచీన దేశస్థులలో గల నమ్మకములమాటటుండగా నవీనముగ ప్రసిద్ధిగన్న దేశ ముల వారిలో కూడ ఆత్మనిత్యమను, పునర్జన్మ కలదను, భావ ములు పొడచూపుచున్నవి. పూర్వజన్మ జ్ఞానముగల చిన్న బాల బాలికలు అపురూపముగా తటస్థించు చున్నారు. క్రిందటి జన్మ లోని వారి ఇల్లు, ఊరు, బంధువుల గురించిన వివరములు ప్రత్య క్షముగాపోయి నిజమని తెలిసికొన్న సంఘటనలు కలవు. చిన్న వయసులోని పిల్లలు వేదములు మొదలగు పవిత్రగ్రంథ భాగము లను అప్పజెప్పుట, వానిని గురించి పండితులతో భాషించుట సకృత్తుగా వినుచున్నాము. పూర్వజన్మ సంస్కారమను మహ త్తర విషయమును గురించి పరిశోధన చేయుట అత్యావశ్యకము. దేహముయొక్క పరిణామము మాత్రమే గాక దేహి యొక్క పరిణామము, ఆ రెంటికినిగల పరస్పర సంబంధమును తెలిసికొన వలసియున్నది. ఇట్లు మానవుని పరిణామ ప్రక్రియ పూర్ణముగా తెలిసికొనుటకై మనసు, బుద్ధి, ఆత్మలయొక్క స్వరూప స్వభా వములు నూతన మారములలో పరిశీలింపవలసి యున్నది.

సృష్టిలోని జీవకోటియందే గాక, జడములయందు కూడ ఒకవిధమగు పరిణామము గోచరించు చున్నది. జ్యోతిర్మయ మగు ఖగోళమందొక యద్భుతమగు ఉత్పత్తి, వృద్ధి కలదని ఖగోళ శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. గంభీరమగు విశ్వాంతరాళములో ఎచ్చటనో ఏరీతినో విశ్వకారణమగు మిక్కిలి తేలికయైన, పల్చని ధూళి పుట్టుచున్నదని దానినుండి పల్చటి మబ్బులవలె గోచరించు నెబ్యులాలను బ్రహ్మాండములు, వాటినుండి నక్షత్రగోళ గుచ్ఛ ములు, వాటినుండి సూర్యాది నక్షత్రగోళములు క్రమముగా పుట్టు చున్నవని ఈ నక్షత్రగోళముల వయస్సు పెరిగినకొలది వాని సాంద్రత, వేడిమి, వెలుతురు, ఘనపరిమాణము మొదలగు గుణ ములు ఒక విధానానుసారముగా మార్పు జెందుచున్నవని ఖగోళ శాస్త్రము చెప్పుచున్నది. జిల్లిక (Jelly) వంటి అతిసూక్ష్మ మైన జీవకణము నుండి మహామేధావి యగు మానవు డెట్లు ఒక నియమితమైన పరిణామక్రియా కలాపముచేత భూమిమీద ఉద్భ వమై పెరుగుచున్నాడో అట్లే అనంత విశ్వమందు జీవరహితమగు విశ్వధూళి కణములనుండి బ్రహ్మాండగోళములు పుట్టి పెరుగు చుండుట ఎంతటి అద్భుతమైన విషయమో ఊహించిన కొలది గోచరింపగలదు.

మరియు సూర్యాది గోళముల యందలి ద్రవ్యము అంత రించి వేడిమి, వెలుతురు రూపములగు శక్తిగా పరిణమించు చున్నదని, ఇంతద్రవ్య మింత శక్తిగా నియమితమైన సూత్రాను సారముగ మార్పు చెందుచున్నదని, నక్షత్రగోళముల నుండి వెలు వడు కాంతిపుంజము లీరీతినే ఉద్భవమగుచున్నవని శాస్త్రము

చెప్పుచున్నవి. ద్రవ్యము శక్తిగా మారుటయేగాక శక్తి ద్రవ్యముగా ఘనీభవించు చున్నదని కూడ ప్రత్యక్ష నిదర్శనములు కలవు. దీనినిబట్టి నక్షత్రగోళములనుండి వెలువడు అనంతములగు కాంతిప్రవాహములు నభోంతరాళములలో ఘనీభవించి విశ్వ ధూళికణములుగా మారుచున్నవని, ఆ ధూళి నుండియే ఖగోళములు పుట్టి పెరుగుచున్నవని ఏల ఊహింపరాదని తోచకమానదు. ఇట్లు ద్రవ్యము శక్తిగాను, శక్తి ద్రవ్యముగాను మారుచు ఒక మహత్తరమైన పరివర్తన చక్రమందు అనంతముగా పరిభ్రమించు చున్నదని చెప్పవచ్చునేమో! ఈ విషయము అచేతన మగు ద్రవ్యరాసులకు సంబంధించినది. ఇట్లే చేతనమగు పశు, పక్షి, వృక్ష, కీటకాదులలో కూడ నీ యుత్పత్తివినాశముల పరిణామ మంతర్వ్యాప్తమై ఏల ఉండకూడదను సందేహము కలుగుట స్వాభావికమేగదా! జంతుజాలము నశించి, బూడిద బుగ్గిగా మారిపోయిన తరువాత ఆబూడిద, బుగ్గినుండి తిరిగి చైతన్యరూపము సృష్టి కావచ్చునేమోయను అనుమానమునకు తావు కలుగుచున్నది. ఇట్టి యద్భుతకార్య మెన్నటికైన సాధ్యమగునా? శాస్త్రపరిశోధనలు ఎట్టి అగాధములు, అద్భుతములు అగు భావములను పుట్టించు చున్నవో చూడుడు! ఏమతములవారు కూడ కలలో నైన భావింపని విషయములు శాస్త్రపరిశోధన వలన మనము భావింప గలుగుచున్నాము.

కాని సృష్టిరహస్యము సులభముగా తెలియునది కాదు; శాస్త్రమార్గమునకు, మనస్సునకు, బుద్ధికి అందునది కాదు.

వేదాంతులు, తత్త్వవేత్తలు అనాది నుండి వెదకుచున్న సృష్టి మూలము, ఆది కారణము పరమరహస్యముగానే ఇంకను నిలిచి యున్నది. నేటి స్థితిలో మానవుని కీ రహస్యమును భేధింప శక్తి చాలదనియే చెప్పవలెను.

## వి ఘ్నే శ్వ రు డు

మానవజీవితము ప్రకృతి సంపదపై నాధారపడియుండును. సకాలములో వర్షములు కురియుట వలన భూమి సర్వసస్య ఫల సంపన్నమై ప్రజాజీవితమునకు సుఖము నిచ్చును అందుచేత ఈసౌఖ్యమున కాధారభూతులగు సూర్యుడు, అగ్ని, వాయువు, ఇంద్రుడు మొదలగువారు ఆది నుండియు దేవతలుగా పూజింప బడుచు వచ్చుచున్నారు. దుష్టశక్తుల వలన భయము కలుగకుండ వాని నడుమలో నుంచి కాపాడుమని దేవతలను ప్రార్థించు నాచారము అతి ప్రాచీనము. దేవతాప్రీతి కొరకు యజ్ఞయాగా దులను చేయుట, వ్రతము లొనర్చుటయేగాక మన సంతోషమును కృతజ్ఞతను దెలుపునట్టి పండుగులను చేసికొనుచున్నాము. నాగరకత పెరిగిన కొలది ప్రజలు ప్రకృతిశక్తులను స్వాధీనములోనికి తెచ్చుకొని వానిపై నంతగా నాధారపడ నవసరము లేకున్నారు. అందుచేత యజ్ఞములు, యాగములు, వ్రతములు తగ్గిపోవుచున్నవి. కాని సార్వకాలిక సత్యములగు దైవభావములను, నైతిక, మానవ సేక ధర్మములను ఎత్తిజూపునట్టి హైందవాదర్శములను మాత్రము విడనాడ వీలులేదు.

జీవితపరమార్థమును, సుందరరూపములతో సృష్టించి చూపు నట్టి హైందవ శిల్పకళ, విగ్రహములతీరు, చాల నిగూఢమైనది. ప్రకృతిలోని దృశ్యములను ఉన్నవున్నట్లు చూపక, వానినుండి గ్రహింపవలసిన భావములను ఎత్తి, రమ్యముగాను మనోరంజ కముగాను చిత్రించు శిల్పకళ యొక్క అంతరార్థమును తెలిసి కొనుటలో జీవితమునకు శ్రేయమెంతైన కలదు. ఇందుల కుదా హరణగా,

విఘ్నేశ్వర విగ్రహ కల్పనలోని భావన, వినాయకుని పూజించుట యందలి పరమార్థము, సామాన్య జనులకు కూడ ఉత్సాహము కలిగించునట్లు ఈవిషయము లెల్ల సుబోధకములు చేయబడినవి, భాద్రపద శుద్ధ చతుర్థినాడే ఈ వ్రతము చేయు టయో, మొదలగు సంగతులను కొంత వివరింప ప్రయత్నించెదను.

బ్రహ్మచర్యమను పరమధర్మము యొక్క ఉత్కృష్టతను, అబలాబాలగోపాలక్షితిపాలురగు సర్వజనులకు బోధించుటకై ఒకపెద్ద దేవునిగా విఘ్నేశ్వరుని పెద్దలు సృష్టించి పూజించుచు వచ్చిరి. ఈదేవునిరూపము, గుణములు, వైఖరి, మొదలగువాని కన్నిటికిని అంతరార్థము కలదని నానమ్మకము. తత్సంబంధమగు పురాణ గాథలు నట్టివే యని నాతలపు. ఇట్టి యభిప్రాయముతో ఈక్రింది విషయమును వినుకూర్చు చున్నాను.

హైందవ సంప్రదాయములో బ్రహ్మచర్యమునకు గొప్ప స్థానము ఈయబడెనది. జీవితకాలమును నాల్గు భాగములుగా జేసి మొదటి భాగములో బ్రహ్మచర్య మవలంబించుచు గురుకులవా సముచేసి విద్యాభ్యాసము చేయవలెను.

" తయువు మొదలి నా-లవుపాలు గురుపాల,
వాసువియట్ల సంతతము బనులు
ప్రీతిసేయుచు గుడిచిన - పిదప గుడిచి,
శయ్యనెంపిన నాతని - చరణ యుగము
కరయుగంబున నొత్తుచు - గలిత నిద్రు,
డైన నిద్రించు బ్రహ్మచ - ర్యాన్వితుండు. "

భారతము, శాంతిపర్వము. అ. 5, 186.

" రసగంధ ప్రముఖంబుల,
దెసవేడుకలేక గురు మ - తికి వచ్చిన య
ట్టి సమయముల దగవేదా,
భ్యసనంబులు సేయుచుండు - నాతడు నియతిన్. "

భారతము, శాంతిపర్వము. 187.

రెండవ జీవిత భాగమందు గృహస్థాశ్రమములో సత్సంతానమును గని, లోకులకు నిరంతరము సేవజేయుచుండవలెను. గృహస్థుగా నుండి కూడ బ్రహ్మచర్య ముచితరీతి నవలంబింప వలయునని శాసింపబడినది.

" వనితల సంగతి మానుట,
చనునొక్క విధంబు బ్రహ్మచర్యం బగుచున్
తన సతితో ఋతువేళల
జనవున మెలగుటయు బ్రహ్మచర్యంబె సుమీ. "

(వావిలకొలను రామాయణము-ఉలూచి అర్జున సంవాదము)

"ధర్మమార్గమున సంతతి యుపార్జింప
సమాన్వయంబున వివాహంబు వడసి
మనసు తమకంబు లేకాత్మవనిత యందు
బూని ఋతుకాలమందున గాని తిథుల
పరిహరించి, సుఖోచిత భంగి గేలి
సలుపువాడు సదా బ్రహ్మచారి యండ్రు."

(అనంతామాత్యుని భోజరాజీయము)

తరువాతి మూడవ జీవిత భాగమందు వానప్రస్థము సలుపుచు కందమూలఫలాదులచేత భిక్షుపూజ చేయుచు, పరిశిష్టములు భుజించి బ్రహ్మచర్యముతో తపము చేయవలెను.

"బ్రహ్మచర్య సమేత త - పంబు విపుల
కాననమున వానప్రస్థ - గణము పొంత
విలిచిచేయుచు బర్ణశా - లలకు నుచిత
కాలమున జని యెత్తి భి - క్షలు భుజించి"

182. శాంతి ఆ. 5.

"నుతియు నమస్కృతియు లే
క తిరిగి శుభమశుభ మను వ - గం బొందక గో
ష్ఠి తెరువు సొరకుండుట సు
వ్రతమది యధ్యాత్మవిద్య - ప్రచురము జేయున్."

183. శాంతి. ఆ. 5.

తుది యాశ్రమమగు సన్యాస మందును తీవ్రముగా బ్రహ్మ చర్యమును సలుపుచు కర్మత్యాగియై పరమధర్మమగు అహింసా మార్గమున వర్తించుచు శాంతాత్మకుడు గావలెను. అనుచు బ్రహ్మచర్య వర్తనము బ్రహ్మవిద్యా ప్రాప్తికి ముఖ్యకారణమని వేదవ్యాసుండు శుకున కుపదేశించెను

మరియు ఆనుశాసనిక పర్వమందు ప్రథమాశ్వాసములోని 285 వ. పద్యములో లక్ష్మి యెట్టిజనులయందు వసించునో భీష్ముడు ధర్మరాజునకు జెప్పుచు బ్రహ్మచర్య మవలంబించువారిని పేర్కొనెను. "సత్కర్మంబులకయ్యెడి ఫలంబులను" గురించి చెప్పుచు "బ్రహ్మచర్యమునకు బరమాయు పుపవాసములకు చిత్తశుద్ధి" (142 పద్యము) ఫలములని చెప్పెను. సత్యవ్రతుడును, బ్రహ్మ చర్య నిష్ఠాగరిష్ఠుడు నైన భీష్ముడు స్వచ్ఛంద మరణము గలవాడై నట్లు చెప్పబడినది. అంపశయ్యపై నుండి ఉత్తరాయణ పుణ్య కాలము వచ్చిన తరువాత అసువులను త్యజింప బూనియున్న భీష్ముని వద్దకు శ్రీకృష్ణుడు రాగా ప్రాణత్యాగము చేయుట కాతని యనుజ్ఞ యడుగును. అప్పుడు "బంటువోలె గాంగేయ మృత్యువు నీవశమున నిలిచె నిర్భయముగ" యని శ్రీకృష్ణు డుగడించును. బ్రహ్మచర్యము వలన దేహారోగ్యము, వీర్యవృద్ధి, బుద్ధిబలమే గాక, మనశ్శాంతి, చిత్తశుద్ధి, ప్రసన్నత, సత్వగుణ సంపన్నత. ఆధ్యాత్మవిద్య ఇవన్నియును ప్రాప్తించును. అందుచేతనే భీష్ముల వారు అఖండ ప్రతిభాశాలి, సకలధర్మవిదుడు, మహాభక్తుడు, ఆత్మవిద్యాసంపన్నుడు నై వెలుగొందెను. ఇట్లే హనుమంతుడు మహాబలశాలి, మహాపరాక్రమవంతుడు, రామభక్తాగ్రగణ్యుడుగా

పురాణములు చెప్పుచున్నవి. ఈ వాయునందనుడు బ్రహ్మచారి, చిరంజీవి యనియు చెప్పబడినది.

ఇట్టికారణముల వలన బ్రహ్మచర్య ధర్మమునకు గొప్ప స్థానము కల్పింపబడుటలో ఆశ్చర్యమేమియును లేదు. ఈకారణముననే బ్రహ్మచర్య ధర్మమును దేవతగా, విఘ్నేశ్వరునిగా రూపకల్పనచేసి, బ్రహ్మచారిణేనమః, బ్రహ్మరూపిణేనమః, బ్రహ్మ విద్యానిధాన భువేనమః అని పూజించుచున్నాము.

" యంబ్రహ్మవేదాంత విదోవదంతి
పరేప్రధానం పురుషం తథాన్యే
విశ్వోద్గతేః కారణ మీశ్వరంవా
తస్మైనమో విఘ్నవినాయకాయ" అని స్తుతించుచున్నాము.

బ్రహ్మచర్యము వలన సత్వగుణము ప్రధానముగా లభించును. సత్వగుణమును తెలుపు రంగు తెలుపు. భీష్మలవారు తెల్లటి వస్త్రములు ధరించినట్లు గలదు. బ్రహ్మచారి యగు విఘ్నేశ్వరుడు శుక్లాంబరధరుడు, శశివర్ణుడు. మరియు సత్వ సంపన్నునకి ప్రసన్నత సహజగుణము. అందువల్లనే

" శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే, "
అని ధ్యానశ్లోకము చెప్పబడినది.

ఇంక 'విఘ్నవినాయకాయ' విఘ్నేశ్వర, విఘ్నరాజ, విఘ్నహంత యనే నామము లేల కలిగిన వని పరిశీలింతము

"అదౌపూజ్యో గణాధిప" యని ప్రతి కార్యమునకు ముందు విఘ్నేశ్వరపూజ చేయుచున్నాము. "విద్యారంభే, వివాహేచ ప్రవేశే, నిర్గమే తథా, సంగ్రామే సర్వకార్యేషు విఘ్న స్తస్య నజాయతే" యనుట కూడ నీవిషయమునే స్పష్టపరచుచున్నది. ఏకార్యము తలపెట్టినను మంచిరోజున విఘ్నేశ్వరునికి మీదు కట్టుట, కార్యము పూర్తి కాగానే పండుగజేసికొని విఘ్నేశ్వరుని కుంద్రాళ్లపోసి మీదును విప్పుట పెద్దల యాచారము. వివాహాది కార్యములకు దీక్ష, శక్తి, పదుగురి సహాయము అవసరము. నేటి నాగరకులయందీ యాచారము కనిపించుటలేదుగాని 30, 40 సంవత్సరముల క్రిందట ఈ యాచారము సర్వత్ర పాటింప బడుచుండెను. కార్యదీక్ష పూనుటకు, తగిన శక్తి సంపన్నత కలుగుటకు ఇంటిలోని వారందరు పూనుకోవలెను. అందులకై సాంసారిక నిత్యవ్యవహారాదులకు మీదు కట్టవలెను. బ్రహ్మచర్య దీక్షపూనవలెను. తలపెట్టిన కార్యమందే ఇంటి వారందరు నిమగ్నులై రాత్రింబవళ్లు కష్టించి పనిచేసినచో నిర్విఘ్నముగా కార్యము కొనసాగును. వివాహ కార్యానంతరము పదునారు రోజుల పండుగను జరుపుకొని విఘ్నేశ్వరుని కుంద్రాళ్లపోసి మీదు తీసివేయుదురు—సాధారణ జీవితమును యధాప్రకారము నడుపుకొందురు. మీదు కట్టుట యనగా, కట్టిబెట్టుట, ఉపయోగము లేకుండ నుంచుట. "చేయి మీదు కట్టితివా?" అనుట కలదు. సాధారణముగ ఉపయోగించుదాని నుపయోగింపకుండుట తటస్థించినప్పు డిట్టి ప్రశ్న పుట్టుచుండును. సంసార క్రియా కలాపము కట్టిపెట్టి కార్యదీక్ష పూనుట చేతనే మీదుకట్టుట

యను నాచారము కలిగినది. బ్రహ్మచర్యము వలన నిర్విఘ్న ముగా కార్యసిద్ధి కలుగునని దీని సారాంశము. మరియు విద్యా భ్యాసమును చేయువారు బ్రహ్మచారులై యుండవలెను. సంగ్రా మమునకు బోవువారు అట్టిదీక్ష పూనవలయునని వేరే చెప్పనవస రము లేదు.

విఘ్నేశ్వరపూజ వేదకాలము నుండియు జరుగుచున్నది.
" గణానాంత్వా గణపతిగ్ం హవామహే
కవింకవీనా ముపమశ్రవ స్తమమ్
జ్యేష్ఠరాజమ్ బ్రహ్మణామ్ బ్రహ్మణస్పతి
ఆనః శృణ్వన్నూతిభిః సీదసాదనమ్. "

(ఋగ్వేదము)

" ఈ సమస్తమైన దేవతాగణములకు నీవే ప్రభుడవు, నాయకుడవు ; బుద్ధిమంతులలో బుద్ధిమంతుడవు ; ప్రఖ్యాతపురుష ులలో అగ్రగణ్యుడవు. మేమొనర్చు సమస్త కర్మలకు నీవే రాజవు. ఓబ్రహ్మణస్పతీ ! యజ్ఞస్థానము నధిష్ఠింపుము " అని దీనితాత్పర్యము.

విఘ్నేశ్వరుడు గణాధిపతి. ప్రథమగణములకు, యక్ష గణములకు—దేవతల యొక్క సర్వకార్యములు ఎవరిద్వారా నడు చునో ఆగణముల కందరకు—ఈత డధిపతి. అనగా సర్వశక్తులు ఈతని యాధీనములో పనిచేయును. బ్రహ్మచర్యావలంబకునికి సర్వ శక్తి సామర్థ్యములు ఉండునని దీనినిబట్టి మనము గ్రహింప వలెను. అట్లు శక్తిమంతుడుకాని దుర్బలునకు నిరుత్సాహము,

భయము, పిరికితనము మొదలగు దుష్టశక్తులు భూత, ప్రేత పిశాచములవలె కార్యమందు అడ్డుతగిలి విఘ్న మొనరించును. సత్వ సంపన్నుడగువాని కట్టి భయముండదు. ఇదే "గణాధిపతి" యొక్క అంతరార్థము.

"తుండము నేకదంతమును తోరపుబొజ్జను వామహస్తమున్
మెండుగ మ్రోయుగజ్జలును మెల్లనిచూపులు మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరినవిద్యలకెల్ల నొజ్జవై
యుండెడి పార్వతీతనయ యోయి గణాధిప నీకుమ్రొక్కెదన్"

అను పద్యము సాధారణముగ రానివారుండరు. ఇందు కోరిన విద్యలనెల్ల వినాయకుడు ప్రసాదించునని చెప్పియున్నది. బ్రహ్మచర్య ధర్మము నవలంబించిన వానికి కోరినవిద్య లెల్లను సులభముగా నలవడునని ఇదివరలో చెప్పిన విషయమునే తిరిగి ఇది స్ఫుట మొనర్చుచున్నది. అట్టి వానికి చురుకైనబుద్ధి గొప్పమేధ ఉండునుగదా. దీనికి గురుతుగా ఏనుగ తలకాయ (పెద్దతలకాయ) విఘ్నేశ్వరుని కమర్చబడినది. గజాననుడగుట చేత తుండముండుట స్వభావమే. ఈ తుండము "ప్రణవస్వరూప వక్రతుండం" అని వర్ణింపబడినది. నాగరలిపిలో ఓం అను అక్షరమును అడ్డముగా త్రిప్పి చూచినచో కుంభస్థలములుగల ఏనుగు తలనుండి వ్రేలాడు వక్రతుండము గోచరించును. ఓంకారమునుండి సర్వశబ్దములు, అక్షరములు పుట్టినవని నాదోత్పత్తి క్రమములో చెప్పబడి యున్నది. అందుచేత విఘ్నేశ్వరు డక్షర స్వరూపుడు, వాగధిపతి, "పరాది చత్వారి వాగాత్మకం

అని వర్ణింపబడినాడు. పర, పశ్యన్తి, మధ్యమ, వైఖరి యను నవి వాక్కుయొక్క స్వరూపభాగములు.

విఘ్నేశ్వరు డతి మేధావి యను విషయమును వెల్లడించు టకై పురాణములయందు కథలు చెప్పబడినవి. వ్యాసుడు మహా భారత రచన కుపక్రమించుటకు ముందు తాను చెప్పునది అర్థము చేసికొని చురుకుగా వ్రాయగల లేఖకుడు కావలెననగా ఆ పనికి విఘ్నేశ్వరుడు నియమితు డైనాడట. చెప్పుదాని కంటె తొందరగా వ్రాయుచు వినాయకుడు వ్యాసుని తొందరపెట్ట సాగెనట. దానిమీదట కొంతయాలోచన పైనగాని యర్థముకానట్టి క్లిష్టమైన శ్లోకములను వ్యాసుడు మధ్యమధ్య చెప్పి అతొందరను తొలగించు కున్నాడట. ఇవే భారత మందలి వ్యాసఘట్టములు.

విఘ్నేశ్వరుడు శుద్ధ బ్రహ్మచారి. కనుకనే "విఘ్నేశ్వరుని పెండ్లికి వేయివిఘ్నములు" ను నానుడి పుట్టినది. అతని పెండ్లి కన్నియువిఘ్నములే కనుక ఎన్నటికి వివాహము పొసగదు. వివాహమైనచో బ్రహ్మచర్యమునకు విఘాత మేర్పడును గదా! ఐనను విఘ్నేశ్వరుని పెండ్లి గురించి ఒక చమత్కారమగు కథ యున్నది. దానిలో గణపతిదేవునిబుద్ధి సూక్ష్మత సూచింపబడినది.

ఒకనాడు తన తనయులగు విఘ్నేశ్వరుని, కుమార స్వామిని పార్వతీదేవి పిలిచి "నావద్ద "సిద్ధి", "బుద్ధి" యను చక్కని కన్యలున్నారు. ఏడుసార్లు భూప్రదక్షిణముచేసి మీలో ఎవరు ముందుగా వత్తురో వారికా పిల్లలనిచ్చి పెండ్లి చేసెదను" అనెను. అంతట వారిద్దరు వారి వాహనములగు మూషకమును,

నెమలి నెక్కి బైలుదేరిరి. ఎలుక నెక్కి తానీ కార్యమును మయూర వాహనునితో పోటీచేసి గెలుచుట యసంభవమని ఆలోచించి విఘ్నేశ్వరుడు తిరిగివచ్చి మాతృదేవతయగు పార్వతి కేడుసార్లు ప్రదక్షిణ మొనర్చి నమస్కరించి "అమ్మా భూదేవత కంటె మహత్తరయగు మాతృదేవతవు నీవు. నిన్ను చుట్టి ఏడుసార్లు ప్రదక్షిణ మొనర్చితిని. భూప్రదక్షిణ ఫలము తప్పక నాకు లభించినది. నాకు కన్యలనిచ్చి వివాహము చేయుము" అనెను. ఆమె అతని బుద్ధి సూక్ష్మతను మెచ్చి సిద్ధి, బుద్ధులనిచ్చి వివాహ మొనర్చెనట. దీనిభావ మిట్లై యుండవచ్చును. బ్రహ్మచారికి కార్యసిద్ధి, సూక్ష్మబుద్ధి భార్యల వంటివి; వాని కతడు భర్త; అవి అతని అనువర్తనలో నుండును అని సూచన. ఈకథ ఇంకను పొడిగింపబడినది. ఆ ఇద్దరు భార్యల వలన—క్షేముడు, లాభుడు యను కుమాళ్లు కలిగిరట అనగా కార్యసిద్ధి వలన క్షేమము సూక్ష్మబుద్ధివలనలాభము ప్రాప్తించునని తాత్పర్యము.

స్థూలకాయుడగు 'బొజ్జగణపయ్య' చిన్న ఎలుకపైని స్వారి చేయుట — చిత్రముగా తోపకమానదు. విఘ్నేశ్వరుని ఆకారమంతయును నవ్వుపుట్టించు నట్టిదే. ఏనుగుతల, సూర్పకర్ణములు, తుండము, గుజ్జురూపు, కాళ్లకు గజ్జెలు, లంబోదరము హాస్యరసస్ఫురణకములు. బాగుగ భోజనము చేయగల స్థూలకాయులు చిదానందముతో హాస్యరసప్రియులై యుండుట లోకములో తరుచు చూచుచుందుము. అందుచేత వినాయకునికా రూపకల్పన సమంజసముగానే యున్నది. హాస్యరసప్రియుడగు

విఘ్నేశ్వరునికి చిన్ననాటి నుండియు కొంటెచేష్ట లుండె నను భావమును కవులు వర్ణించియున్నారు.

“ తనుగని యొక్కయెత్తునవె దక్షజయుం నిటలాక్షుడు న్మాన్యం
బున నిరుచెక్కుల న్గదిసి ముద్దుగొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకున్ నిగిచి యత్నవిహీన పరస్పరాస్య చుం
బనములు తల్లిదండ్రులకు బన్నుగ గూర్చుగజాస్యు గొల్చెదన్”

విఘ్నేశ్వరుని రూపకల్పనకు గల కారణము లేమైయుండ గలవని ఆలోచింతము. ఎలుకవాహనము—ఎట్టి గట్టినేలనైనను సునాయాసముగా వాడియైన దంతములతో బొరియలుచేసి భేదించుకుని ఎలుక ఎట్లుదూరిపోగలుగునో అట్లే నిశితమగు బుద్ధితో ఎట్టి క్లిష్టవిషయములనైనను బ్రహ్మచారి యవగాహన చేసికొనగలడు. మరియు నీసందర్భములో నొకవైదిక సంప్రదాయమును చెప్ప నగును. అగ్నిదేవుడు శాపవశమున కొన్నాళ్ళు ఎలుకరూపమై నేలలో దాగియుండెనని వేదములో కలదు. అందువలన ఎలుక కొక పవిత్రత తాపాదింప బడినది. ఎలుకలు భూమిలోతులనుండి మన్నును పైకితెచ్చి కుప్పగా చేర్చును. ఈమన్ను ఏసంపర్కము లేక శుద్ధమైనది. దీనితో యజ్ఞవేదిక నలుకుట వైదికసంప్రదాయము. అట్టి యజ్ఞవేదికపై విఘ్నేశ్వరుని ప్రతిష్టించుట గురించిన “ గణానాంత్వా ” యను ఋగ్వేదవాక్యము పై నుదహరింపబడినది. ఈలాగున మూషికమునకును గణపతికిని ఏవో సంబంధములు చెప్పబడినవి.

'తోరపుబొజ్జను వామహస్తము'—బ్రహ్మచారికి జఠరాగ్ని ప్రజ్వరిల్లియుండును. పుష్కలముగా భోజనము చేయగలడు, భోజనానంతరము తోరపుబొజ్జను వామహస్తముతో నివురుకొని ఆనందించును. ఆతని భోజనప్రియత్వమును తెలుపుటకై కుడి చేతియందు ఒకకుడు ముంచబడి యుండును. పొట్టివానికి పుట్టెడు బుద్ధులన్నట్లు స్థూలశరీరమునకుతోడు గుజ్జురూపముకూడ ఏర్ప రుపబడినది. ఇవి చాలక కాళ్లకు "మెండుగమ్రోయు గజ్జలు" ఉన్నవి. దేహదార్ఢ్యము జీవచైతన్యము సమృద్ధిగా గల బ్రహ్మ చారి ఆనందతాండవ మాడగలడని దీని సూచన. ఈయానంద తాండవముచేయు స్వరూపమునే శ్రీత్యాగరాజస్వామి గానము చేసియున్నారు.

"శ్రీగణపతిని సేవింపరారే శ్రితమానవులారా ॥శ్రీ॥
వాగధిపతి సుపూజల జేకొని బాగనటింపుచు వెడలిన ॥శ్రీ॥
పనసనారికేళాది జంబూఫలము లారగించి
ఘనతరంబునను మహిపై పదములు ఘల్లుఘల్లన నుంచి
అనయము శివుని చరణయుగముల హృదయంబున నుంచి
వినయమునను త్యాగరాజ వినుతుని
వివిధగతుల ధళంగుమని వెడలిన ॥శ్రీ॥

పరమేశ్వరునిపై భక్తిపారవశ్యముతో కాలిగజ్జలు ఘల్లు ఘల్లుమని మ్రోగుచుండగా వివిధనాట్యగతులతో ధళంగు, ధిత్తళంగుమని ఆనందతాండవనృత్యమును చేయుచు వచ్చు చున్నాడట.

ఇట్లు వినాయకుని రూపకల్పనా విశేషములన్నియును తేట తెల్లముగా 'తుండము నేకదంతమున' అను నొక చిన్నపద్యములో వివరింపబడినవి. పిల్లలకు పెద్దలకుకూడ ఆనందజనకమై సుబోధకమగునట్లు నిగూఢమగు భావములతో ఈపద్యము వ్రాయబడినది. ఉన్నతములైన అధ్యాత్మికభావములను సమన్వయించి చెప్పుట, చూపుటయే పద్యమందలి, ప్రతిమాశిల్పమందలి నేర్పు. ఇట్లే హైందవశిల్పమంతటను నిగూఢత్వము సౌలభ్యముకూడ గోచరించును. దర్శనమాత్రముననే సామాన్యుల నాకర్షింపుచు భావించినకొలది గూఢములగు విషయములను బోధించునట్టి స్వరూపములతో శిల్పకళ నిండియుండును.

మరియు, గణపతివంటి దేవతల కందరకు ప్రతిమాశిల్పకల్పనయే కాక యంత్ర, మంత్రరూపములుకూడ కల్పింపబడినవి. యంత్రము శుద్ధరేఖాకారము (pure form). దీని కవయవము లుండవు. మంత్రము శబ్దమే రూపముగా గలది (sound form). ఆయాదేవతలకు తగిన బీజాక్షరముల సంపుటియే మంత్రము. ఈ మంత్రమును దానిని నిజవర్ణస్వరములతో ఉచ్చరించినచో కలుగు శబ్దవిభూతి ఆ యధిష్ఠానదేవతను నిరూపించును.

దీక్షితులవారు హంసధ్వనిరాగములో ప్రసిద్ధమగు "వాతాపి గణపతిం భజేహం" అను కృతిలో వినాయకుని వర్ణించుచు "త్రికోణమధ్యగతమ్" అని చెప్పి యున్నారు. ఆదికారణమగు పరబ్రహ్మయొక్క ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తుల మూడింటిని సమత్రిభుజాకారమగు త్రికోణయంత్రము సూచించును. ఇట్లే గణపతి

దేవునకు మంత్రకల్పన చేయబడినది. మంత్రజపము సిద్ధిపొందినచో సర్వశ్రేయములు కలుగునని మంత్రశాస్త్ర సంప్రదాయము.

ఇట్లు అనేకరీతుల మనపూర్వులు విఘ్నేశ్వరు నారాధించిరి.

ఇక వినాయక వ్రతమును గురించి కొంతయాలోచింతము. ఆవ్రతమును భాద్రపద శుద్ధ చతుర్థినా డేల చేయవలయు ననునది మొదటి యంశము. పురాణములయందలి దేవతలకు సంబంధించిన గాధలకు ఖగోళదృశ్యములకు పరస్పరసంబంధములను కల్పించుట అనాదిగా వచ్చుచున్నది. సూర్యభగవానుడే, సూర్యగోళముకూడ. రాత్రులయందు మిక్కిలి కాంతివంతముగ గోచరించు గురుగ్రహమే నక్షత్రములకు దేవతలకు గురువు, దేవగురువు. ఇట్లే అనే కోదాహరణముల జూపవచ్చును.

" ప్రాతర్య వాణాప్రథమాయజధ్వమ్
నోరనసామయ న్తి దేవాయా అజుష్టమ్. "

అని ఋగ్వేదము.

సూర్యోదయాత్పూర్వమున తూర్పున ఏనక్షత్ర ముదయించునో ఆనక్షత్రమునకు సంబంధించిన దేవతను ఆనాడు ముందుగా పూజింపవలెను : లేక సూర్యాస్తమయ సమయమందు తూర్పున ఉదయించు నక్షత్రదేవతనైనను పూజింపవలెను అని దీని తాత్పర్యము. నక్షత్రములకు సరియైన దేవతాస్వరూపము లున్నవని దీనివలన స్పష్టమగుచున్నది. సప్తఋషి మండలము — సప్తఋషులు, ధృవనక్షత్రము — ధృవుడు మొదలగునవి యిట్టివే. ఇట్లే

విఘ్నేశ్వరునికి సంబంధించిన నక్షత్రముల గుంపు ఒకటి కల్పింపబడినది. చిన్నఎలుక ఆకారముగల నక్షత్రములగుంపు, దానిమీదనే విఘ్నేశ్వరరూపముగా భావింపతగిన ఇంకొక నక్షత్రముల గుంపు కలవు. ఈ విఘ్నేశ్వర నక్షత్రములు సూర్యోదయమునకు పూర్వము తూర్పున భాద్రపద శుద్ధ చవితినా డుదయించును. అందువలన నాడు సిద్ధివినాయక వ్రతముచేయు నాచారము పుట్టియుండును. ఆమరునాడే సప్తఋషి మండలమందలి పడమటి భాగము సూర్యోదయాత్పూర్వ ముదయించును. ఆనాడు ఋషిపంచమి వ్రతమును జేయుదురు.

మరియు భాద్రపద శుద్ధ చవితినాడు సాధారణముగా హస్త నక్షత్ర మగుచుండును. అనగా నాటి చంద్రుడు హస్తనక్షత్రమందుండును. 12 చాంద్రమాసములు పదమూడు నక్షత్రమాసములకు సమానము. ($12 \times 29.5 = 354$ దినములు ; $13 \times 27.3 = 354.9$, దినములు). హస్తనక్షత్రము ముంజేతి యాకారము కలదై యుండును. అందుచేత నాటి చంద్రునికి హస్త సంబంధముచేత హస్తిత్వము కలదనవచ్చును. నాడు సూర్యోదయాత్పూర్వమున వినాయక నక్షత్రోదయమగును గనుక వినాయకుని హస్తిత్వము ప్రత్యేకముగ ప్రకటన చేయబడుచున్నది, ఇట్లు చంద్రునకు విఘ్నేశ్వరునకు భాద్రపద శు. ౪ నాడు వేరు కారణములచేత హస్తిత్వము సంభవించుచున్నది. మరియు నాటిచంద్రుని పరికించి చూచినచో బోసినోరు * తెరచి నవ్వుచున్నట్లు కనిపించును.

* దక్షయజ్ఞధ్వంస సమయమున వీరభద్రుడు చంద్రుని పండ్లూడునట్లు తన్నెనని కథ కలదు. "వీరభద్రపదాహతి డుల్లిన బోసినోరు"

చంద్రుని గోళమంతయు భూమిమీదనుండి ప్రతిఫలించిన సూర్య కాంతిచేత గుండ్రముగా కనపడును. అట్టి చంద్రముఖము క్రింది భాగమున చవితినాటి చంద్రవంకతోకూడి నవ్వుచున్న ట్లుండును. దీనిని బట్టి విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వినట్లు కథయున్నది. దానివలన ఒక శాపము. దాని నివృత్తి గాథ, శ్యమంతకమణి వృత్తాంతము మొదలైనవి కలవు. ఈ కథ లోని సింహము, (సింహరాశిలో సూర్యు డుండు కాలమది) శమంతకమణి (సూర్యుడు) జాంబవంతుడు (సప్తఋషిమండలము)—పెద్ద వెలుగుబంటి (Great Bear)—ఖగోళదృశ్యములై యున్నవి. వీటిని గూర్చి ఏవో కొన్ని కల్పనలు కూడ కథగా చెప్పుచున్నారు. ఇవంత పొందిక గలవిగా లేవు.

భాద్రపద శుద్ధచతుర్థికి ఆరుమాసముల తరువాత ఫాల్గుణ శుద్ధ చతుర్థినాడు విఘ్నేశ్వరనక్షత్రము సూర్యాస్తమయసమయమున తూర్పున ఉదయించును. ఆనాడు "పుత్రగణపతి వ్రతమ"ని పంచాంగములలో వ్రాయుదురు. ఇట్లు ఖగోళదృశ్యములను పురాణగాథలకు ముడిబెట్టుట, పురాణగాథలనే కొన్నింటిని ఆదృశ్యములనుబట్టి కల్పించుట కనిపించుచున్నది. ఈ సందర్భములో విఘ్నేశ్వరుడు గజాననుడైనట్టి గాథను గురించి కొంత తెలిసికొందము.

చంద్రుడు ఖగోళచక్రములో ఒకసారి తిరిగివచ్చుటకు 27 దినములు పట్టును. అందుచేత ఆచక్రమును ఇరువదియేడు భాగములుచేసి అశ్విని, భరణి యను ఇరువదియేడు నక్షత్రము

లను పేర్కొనుచున్నాము, ఈ మార్గమందే సూర్యుడుకూడ ఒక సంవత్సరములో తిరిగివచ్చును. అందుచేత ఈనక్షత్రములను పదిరెండు రాశులుగా రూపకల్పనచేసిరి. $(12 \times 2\frac{1}{4} = 27)$. ఒక్కొక్కరాశిలో రెండు నక్షత్రములు మూడవదానిలో నాల్గవ వంతగు నక్షత్రపాదము, కలిసియుండును. అశ్విని, భరణి, కృత్తికలో నాల్గవవంతు చేరి మేషరాశియగును. నేటివలె ఆది కాలములో ఈరాసుల నిర్ణయము అంత నిశితముగా ఏర్పడి యుండలేదు. పరిశీలన చేయుచు, నూతనముగా కనిపెట్టిన విషయములను చేర్చుచు ఖగోళజ్ఞానమును పెంచుకొనుచు వచ్చిరనుట సమంజసమే గదా. అందుచేత ఆరంభమందు ఆర్ద్రనక్షత్రమును వృషభరాశిలో (అశ్విని, భరణి, కృత్తిక, మేషమని, రోహిణి, మృగశిర్ష, ఆర్ద్ర, వృషభమని,) చేర్చియుందురు. అది సరికాదని తెలియగానే దాని తరువాతి రాశియగు మిథునములో ఆర్ద్రను చేర్చియుందురు. ఈ విషయమునే ఒక కథగా ఇట్లు కల్పించి యుందురు.

రోహిణి, మృగశిర్ష, ఆర్ద్రలు ఆకాశమందు గజవీధి యను దానియందుండును, ఈ గజవీధికి పైభాగము—తల—యైన ఆర్ద్రనక్షత్రమును గజవీధినుండి తీసి మిథున రాశిలో చేర్చుట గజాసురుని తల తీయుట. ఆర్ద్ర, పునర్వసుతో చేర్చినగాని మిథునరాశి ఏర్పడదు. మిథున మనగా పురాణదంపతులగు పార్వతీపరమేశ్వరులు. ఆర్ద్ర చేరక పూర్వము పార్వతి (పునర్వసు) ఒంటరిగా నుండెను. భర్తజాడ తెలియక బాధపడినట్లు - తనభర్త గజవీధిలో దాగియున్నట్లు — అనగా గజాసురుని

గర్భస్థుడై శివుడున్నట్లు—తెలిసికొని విష్ణువును వేడగా (సూర్యుని వేడగా—సూర్యుడు సంచరించు రాసులే గనుక — అతడు వానిని సరిదిద్దగలడని) ఆర్ద్రను పునర్వసుతో చేర్చి మిధునమునకు సరియగు రూపకల్పన జరిగినట్లు కథ, ఆర్ద్ర రుద్రదేవతాకమైన నక్షత్రము. అది వృషభరాశికి పైన సూర్యాస్తమయ సమయమున గోచరించును. అందుచేత శివుడు వృషభవాహను డని చెప్పుచున్నాము. శివుని వాహనమగు వృషభము-నందీశ్వరుడు-గజాసురుని సంహరించి పార్వతీదేవితో శివుని జేర్చుట జరిగినది. ఇట్లు తన్ను జేరరానున్న భర్తవిషయమును విన్న పరాశక్తి ముదమొంది అభ్యంజనస్నానము జేయబోయి గుమ్మమువద్ద విఘ్నేశ్వరుని ప్రతిష్ఠచేసి కావలియుంచెనట. అంతలో పరమేశ్వరుడు వచ్చి లోపలికి పోబోవ విఘ్నేశ్వరు డడ్డగించెను. కోపావేశుడై విఘ్నేశ్వరుని తలద్రుంచి శివుడు లోనికి జనెను, (బ్రహ్మచారియగు విఘ్నేశ్వరుడు — అనగా బ్రహ్మచర్యము — పార్వతిని చేరుటకు శివుని కడ్డముగా నిలిచినదని — బ్రహ్మచర్యమును సంహరించి, తలద్రుంచిన తరువాతగాని మిధున మేర్పడ లేదని—పార్వతిని శివుడు కలియజాలడయ్యెనని అనుకొనవచ్చును). లోనికి జనిన తరువాత పార్వతివలన విషయమును తెలిసికొని ఆ బాలుని బ్రతికించి త్రుంపబడియున్న ఒక ఏనుగ తలను అతికించెనని కథ.

వినాయక వ్రతము హిందూదేశ మంతటను, ముఖ్యముగా వింధ్యకు దక్షిణభాగమునందు ఆబాలగోపాల మాచరింతురు. హైందవవిజ్ఞానము ప్రాకిన తూర్పు ఆసియా భాగములయందు

చైనా, జపాను మొదలగు దేశములందు—విఘ్నేశ్వరుడు దేవతగా ఏర్పడినాడు.

బ్రహ్మచర్య దీక్ష సర్వజనులకు, సర్వదేశములయందు, సర్వకాలములయందు, సర్వకార్యసిద్ధికొరకు, ప్రజానీకముయొక్క క్షేమలాభములకై అత్యంతావలంబనీయమగు పరమధర్మము.

## నా డీ గ్ర ం థ ము లు

మహత్తరములైన పూర్వుల విద్యలు, విజ్ఞానము, సంస్కృతి మాటుపడియున్నవి. భారతీయు లెట్టి శక్తులను సంపాదించిరో ఎట్టి ఆత్మవిద్యా విషయములను తెలిసికొనిరో భరత ఖండ మెట్టి ఔన్నత్యము నందికొనెనో తెలిసికొన వలసి యున్నది. అట్టి విజ్ఞాన నిలయములగు గ్రంథముల నుద్ధరించి పరిశీలింపవలసిన యవసర మెంతైన గలదు. నూతనశకము పైబడుటచేత పూర్వవిషయములను విస్మరించుట, తాత్కాలికోప యోగకరములగు వానితో తృప్తిజెంది శాశ్వతోపయోగము లగు విషయములను విడనాడుట సాధారణమైన ధర్మము. కాని, ప్రపంచమందలి యితర దేశములలో గొప్పస్థానమును మనము తిరిగి ఆక్రమింపవలెననిన ప్రాచీనుల నైతికాధ్యాత్మిక సంప్రదాయములను, సంస్కృతిని అవలోధన చేసికొని అందలి ఉత్కృష్ట తమ లోకమున కందజేయవలసి యున్నది.

మన ప్రాచీనుల విద్యలలో జ్యోతిశ్శాస్త్రమునకు గొప్ప స్థాన మీయబడెను. దీనిమూలమున భూతభవిష్యద్వర్తమానముల నెరుగవచ్చును. శాస్త్రపద్ధతి, ఉపాసనాపద్ధతియని ఇందు రెండు మార్గములున్నవి. జాతక చక్రమునుబట్టి గాని, అరచేతిలోని రేఖలను బట్టిగాని ఫలములను చెప్పుట శాస్త్రపద్ధతి. సోది చెప్పుట ప్రశ్నలు చెప్పుట మొదలగునవి ఉపాసనాపద్ధతిలోనివి. జ్యోతిశ్శాస్త్రములో ఫలభాగమును దెల్పునట్టి పరాశర, జైమిని, వరాహమిహిర ప్రణీతములైన గ్రంథములెన్నో గలవు. వానిని సంప్రదాయముగా నేర్చుకొని పరోపకారచింతతో జాతకములను చూడ గలిగినవారు క్రమముగా అరుదైపోయిరి.

పాశ్చాత్యనాగరకత వ్యాపించినకొలది ఇట్టి విద్యల ప్రచారము సన్నగిల్లినది. జోస్యమనిన పరిహాసము ప్రారంభమయ్యెను. దానియందు నమ్మకముండుట అనాగరకతా లక్షణముగ పరిగణింపబడుచు వచ్చినది. జోస్యమును రహస్యముగ జెప్పించుకొనుచు, బహిరంగముగ దానిని నిరసించుట చూచుచున్నాము.

చిన్నతనమునుండియు నాకు జ్యోతిశ్శాస్త్రమందు నమ్మకముండెను. పెద్దలయొక్కయు చిన్నలయొక్కయు జాతకములు తాటాకులమీద వ్రాయబడినవి మాయింట నుండెను. అందు ఆయుర్దాయము, యోగము మొదలగువాని గురించి క్లుప్తముగా వ్రాయబడియుండెను. అనుభవములో అవి చాలవరకు దృష్టాంతములు నిచ్చుచుండెను. నేను ఇంగ్లీషు వత్యసించి ఉద్యోగములో నున్న దినములలో జ్యోతిశ్శాస్త్రజ్ఞులయొక్క, ఉపాసకులయొక్క

పరిచయము లభించినది విచిత్రములు అద్భుతములునగు అనుభవములు చాల కలిగినవి. క్రమముగా ఈశాస్త్రమును గురించి తెలిసికొనుటకు ప్రయత్నించితిని అట్టి పరిశీలనా ఫలితములగు అనుభవముల సారమును వివరించుట నాధర్మమని, అవసరమని తోచి ఈరచనకు పూనితిని.

జ్యోతిషవిద్యయందు రెండు పద్ధతు లున్నవని చెప్పితిని. అందొకటియగు ఉపాసనాపద్ధతి గురించి, కొందరి వ్యక్తుల శక్తిని గురించి దృష్టాంతములతో చెప్పెదను. తూర్పుగోదావరిజిల్లా మోదేకుర్రు గ్రామస్థులు, పండితులు, జ్యోతిశ్శాస్త్రకోవిదులు నగు కీర్తిశేషులైన దండిభొట్ల రామమూర్తి శాస్త్రిగారితో విశేషపరిచయము గలిగియుంటిని. ఎవరి విషయము గురించియైన తెలిసికొనవలెనన్న పేరు పైకి చెప్పకుండగనే శాస్త్రిగారిని అడిగినచో వారు మనకు తోచిన అంకెలను వరుసగా చెప్పమనుచుండిరి. కొన్నిటిని చెప్పిన తరువాత ఆగుమని ఆ అంకెలనుబట్టి జాతక చక్రమువంటి దానిని వేసి, దాని ఆధారముతో గబగబ సమాధానము ఆశ్చర్యముగా చెప్పుకొని పోవుచుండిరి. ఒకసారి ఏలూరులో పెద్ద లందరునుకూడి వీరి విద్యను పరీక్షించుచుండిరి. కొందఱు కొంటెవారు శాస్త్రిగారి గురించి తలచుకొని ప్రశ్న అడిగిరి. దానికి సమాధానముగా "తండ్రిగారికి జబ్బుగానున్నది. ఇంటికి రమ్మని టెలిగ్రాము వచ్చును" అని చెప్పిరి. అంతలోనే టెలిగ్రాపుబంట్రోతు వచ్చి శాస్త్రిగారికి తంతివార్త నందజేసెను. అందు తండ్రిగారి స్థితి ప్రమాదముగా నున్నదని బైలుదేరి

రమ్మని కలదు. దేశ ప్రఖ్యాతి గాంచిన పెద్ద పెద్దలకు అద్భుత ముగా నిదర్శనము లిచ్చునట్టి జీవిత విశేషములను శాస్త్రిగారు చెప్పుచుండిరి. వారందరు వారి యిండ్లయందు శాస్త్రిగారిని గౌరవించి, ఆదరించుచుండిరి.

పశ్చిమ గోదావరిజిల్లా, నిడదవోలు సమీపమున గల అట్లపాడులో చిరావూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పంచపక్షి ఉపాసకులుండిరి. వారితో ఏడెనిమిదేండ్లు నాకు ఎక్కువగా పరిచయము గలిగినది. ప్రశ్న అడుగుట తరువాయిగా వారు సమాధానములను ఆశ్చర్యముగా చెప్పెడివారు. రాజమహేంద్రవరము లోని కళాశాలలో పనిచేయుచు ఒకనాడు కాలేజీ ప్రిన్సిపిల్ గారితో నేను మాట్లాడుచుండగా అచ్చటికి శాస్త్రిగారు వచ్చుట తటస్థించినది. వారు జోస్యులని తెలిసి దొరగారు తన్నుగురించి చెప్పుమనిరి. దొరగారి భార్య ఎక్కడో దూరదేశమున నున్నదని ఒక్కడే కుమారుడని తల్లివద్దనే యున్నాడని ఆమెను రమ్మని వ్రాయగా వచ్చుట కిప్పుడు వీలులేదని బదులు వ్రాసినదని మొదలగు విషయములు ఒక్క నిమిషములో చెప్పివేసినారు. మరు నాడీ విషయము గురించి దొరగారు నాతో సంభ్రమాశ్చర్యములతో మాట్లాడుచు, అనాడే తనకు భార్యవద్దనుండి జాబు వచ్చినదనియు అందులో శాస్త్రిగారు చెప్పినట్లే తు.చ. తప్పకుండ ఉన్నదనియు అట్టి అద్భుతము తానెన్నడు కనివిని యెరుగననియు చెప్పిరి. కాలేజీ విద్యార్థులకు శాస్త్రిగారిని పరిచయము చేయుచుంటిని. వారు విద్యార్థుల ప్రశ్నలకు వారిభవిష్యత్తు గురించి చిత్రముగా చెప్పుచుండిరి. ఆవిషయములన్నియు ఎట్లు దాఖలా

లిచ్చుచున్నదియు తరువాత ఆ విద్యార్థులు నన్ను కలసినప్పుడు చెప్పుచుండిరి.

అనకాపల్లిలోని శ్రీ కవికొండల నారాయణమూర్తిగారును ఇట్టివారే. వారు వాస్తుశాస్త్రములో ఎట్టి విషయములకైనను సరియైన సమాధానములు సలహాలు ఇచ్చుచుండిరి. నీరులేనిచోట వారి సహాయమువలన మంచి నూతులు త్రవ్వబడినవి. చామర్లకోట వేట్లపాలెముల మధ్య భూగర్భమునుండి తొండమంత లావుగా పైకుబుకునట్టి నీటివసతి వీరు చెప్పిన స్థలమును త్రవ్వగా లభించినదే.

ఇట్లే ఇంకను ఇదరు, ముగ్గురితో నాకు పరిచయము కలిగి ఎన్నోవింతలను వింటిని. ఇట్టి విషయములను గురించి ఎంత వ్రాసినను ప్రత్యక్షములు కాకుండుటచేత మనస్సున కంతగా పట్టక పోవచ్చును. ప్రత్యక్ష నిదర్శనాపూర్వకములగు నాడీగ్రంథముల గురించి కొంత విపులముగా జెప్పెదను.

నాడీగ్రంథము లేకాలమువాడో ప్రజ్ఞావంతులచే చెప్పబడి తాటాకులమీద వ్రాయబడి యున్నవి. ఈనాడులలో కొన్ని మాత్రమే సంస్కృతమునను ఎక్కువగా తమిళములోను చెప్పబడినవి శుక్రనాడి, ధ్రువనాడి, సంస్కృతములో నున్నవి. చంద్రనాడి, బ్రహ్మనాడి, అగస్త్యనాడి, విశ్వామిత్రనాడి, సుబ్రహ్మణ్యనాడి, నందినాడి, కాకాభుజండనాడి మొదలైన వెన్నో తమిళభాషలో ఉన్నవి. ఇవి చాల పెద్ద గ్రంథములు. నాడీస్వాముల వద్ద అచ్చటచ్చట కలవు, వారు వానిని గుప్తముగా ఉంచి జీవనోపాధి కుపయోగపరచుకొనుచున్నారు. అన్నియు అముద్రితములే.

జాతక ఫలములు కావలసినవారు జాతకచక్రమును నాడీకారు నకు చూపించినచో నాడిని వెదకి ఫలములుగల భాగమును వ్రాసి యిచ్చును. కొన్నినాడులను—కౌశికనాడి, అగస్త్యనాడి మొదలైన వానిని—చేతిరేఖ లాధారముగా చూడవలెను. నాడి చూచువాడు చేయి చూచి ఒకముఖ్యమగు రేఖను గుర్తించి దానిని బట్టి జాతకము వెదకి యిచ్చును. ఉదాహరణమునకు ఒకటి—"అడిక్కి—విరిచక్ర ఇరపాలి సంకృత లికితయేక యోగాంశరేఖ". దీనినిబట్టి తీసిన జాతకమును చదివి వినిపింతురు, సరిగా నున్నదని చెప్పిన తరువాత వ్రాసి యిత్తురు, కొంత మూల్యమును తీసికొందురు. ఈ నాడులలోని జాతకములు సాధారణముగా గతించిన విషయములను సరిగా వివరించును, అందు అసాధారణములగు విషయములు కూడ ఉండును. పుట్టిన తిథి వార నక్షత్రములు, జనన కాలము, రాశి, అంశచక్రములు, జననకాల దశాశేషము, తరువాత వచ్చుదశలు, అంతరములు జీవితవిశేషములు జీవితాంతమువరకు ఉండును. జాతకుని పేరు, తలిదండ్రుల పేర్లు ఉండును, నాపేరు వెంకటప్పయ్యని చెప్పబడినది. వెంకటప్పయ్య అని నాకు నామకరణము జరిగినది. ఈ జాతకములలో భవిష్యత్తు సాధారణముగా సరిపోదు. కొన్నిట బొత్తిగా తప్పుగా నుండును. ఒక్కొక్క లగ్నమందు ఒకనాడే భిన్నభిన్న జాతకములుండును. అందుచేత భేదములు కలుగును. జాతకమును తీసికొనిన నాటి వరకు సరిపోయిన జాతకము జీవితాంతమువరకు కూడ సరిపడుట కాకతాళీయముగా నుండును. అనేక జాతకములను వ్రశ్నాకాలు లగు మహర్షులు గుణించి ఫలములను వ్రాసియుంచిరని, వానిని

సరిగా గుర్తించుటకు జాతకచక్రముగాని, చేతిలోని రేఖగాని, సూక్ష్మతరమైన సాధనముకాదని ఊహింపవలసి యున్నది.

రేఖాధారమగు కౌశికనాడిని నే చూపించుకొంటిని, నామిత్రులు చూపించుకొనిరి. అందు ఒకటి రెంటిలో మాత్రము భవిష్యత్తుకూడ చాలవరకు సరిగా చెప్పబడియున్నది. నేను తీయించిన రెండు జాతకములలో భవిష్యత్తు సరిగాలేదు.

సత్యాచార్య ప్రణీతమైన ధ్రువనాడి సంస్కృతమున నున్న దానిని నేను చూపించుకొంటిట. నాజాతక చక్రమునకు సంబంధించిన జాతకములు కొన్నియుండెను. ఒక్కొక్కటి చదివిచూడగా 15 ఏండ్లవరకు ఒకటి, 30,35 ఏండ్లవరకు మరియొకటి సరిపడుచు తరువాత తప్పుచు వచ్చినవి. నాటి వయస్సువరకు పూర్తిగా సరిపోయిన జాతకమును వెదకుటకు కాలవ్యవధి నాకు లభింపక, అందుండి జాతకమును తీసికొని రాలేకపోతిని. కాని మద్రాసులోని పెద్దలను, ఈ ధ్రువనాడి నుండి జాతకములను వ్రాయించుకొన్నవారిని నే నెరుగుదును. వారి జాతకములు పూర్తిగా దాఖలా లిచ్చినవి. ఇందు మొదట, జాతకుని గురించి సంగ్రహముగా చెప్పబడును, తరువాత ఆదినుండి అంతమువరకు సంవత్సర ఫలములు వివరింపబడును. జాతి, మతము, దేశము, పితృమాతృవంశములు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రెందరో అందు జాతకుని స్థానము, వారివారి యాయుర్దాయములు జాతకుని వివాహము, భార్యయొక్క రూప గుణ శీలములు, సంతానము మొదలైనవి, నేటి ఉద్యోగములు, రైల్వే తంతి టపా

సౌకర్యములు మొదలగు విషయముల గురించి నాడిలో నుండును. పూర్వజన్మ వృత్తాంతములు, భావిజన్మ విశేషములు కూడ సూచింపబడి యుండును. ధ్రువనాడిలో ఏబది రెండు సంపుటములు కలవు. చాల పెద్దగ్రంథము. దానిని వ్రాయుటకే కొన్నేండ్లు పట్టునేమో. అట్టి ఉద్గ్రంథము లెట్లు వ్రాసినది ఆలోచించినచో అద్భుతముగా తోపకమానదు. నాడీగ్రంథముల గురించి కృష్ణాపత్రికలో 1917 అక్టోబరు 6 వ నాటి సంచికలో వ్రాసిన కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఇట్లు వ్రాసియున్నారు. " ఈగ్రంథములు అలోకసామాన్యమైన దివ్యచక్షుస్సుతో నెవ్వరో మహానుభావులు లోక సంగ్రహకాంక్షచే రచియించి యుండిరేగాని శాస్త్రము పరిగణనము సలిపి సమకూర్చినవి కావని పెక్కురు తలచుచున్నారు". ఇంకొక రీతిని క్రింది రీతిని నభిప్రాయపడిరి. " జ్యోతిశ్శాస్త్రము పారము ముట్టిచూచిన మహామహులు తమ పాండితీ విశేషమును వెలార్చుచు, అనేక శతాబ్దుల క్రిందట విశ్వ మానవ జాతక సంగ్రథన రూపములను, నాడీగ్రంథములను వివరించియుండిరి."

మచ్చునకు ధ్రువనాడి నుండి కొన్ని శ్లోకముల నిచ్చుచున్నాను.

" గాధాంశే తుతులాలగ్నే లగ్నేశే కర్మరాశిగే
వృశ్చికాంశే కమలనాధే లగ్నాధీశే బలాన్వితే॥
లాభేకటకాంశగే హేళిః పంచమేఝషగాంశగే శశీ
భాగ్యే అజాంశగేభౌమే కర్మే మృంగాళగే బుధే॥

అదృష్టశాలీ ధర్మాత్మా, దారద్వయయుతో భవేత్
ద్వితీయాఽదృష్టశాలీచ, భర్తార మనువర్తతే॥

పంచమాబ్దివయఃకాలే స్వీకారోహ్యన్యవర్గకే
స్వీకారాత్పూర్వకాలేతు, తత్పితామృతిమాదిశేత్
స్వీకార మాతృసౌఖ్యంచ పితృమాతృ సుఖావహామ్
పంచమాబ్దేఽక్షరారంభః విద్యావిఘ్న స్తదాభవేత్॥"

"ఆత్మజ్ఞానపరాయణోఽతినిపుణో బౌద్ధప్రధానోగుణీ
హృష్టోలౌకికమార్గతో న చలతి ప్రఖ్యాత శిష్యప్రజః
సౌమ్యోక్తిర్బహువిత్తదారతనయః సద్బ్రహ్మతేజోజ్జ్వలన్
ఆత్యాయుర్విజితేంద్రియో నతన్నృపో వైరించయోగో
భవేత్॥"

1917 నవంబరు 3 వ తేదీ కృష్ణాపత్రికలో పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారు నాడీగ్రంథముల గురించి వ్రాసిరి. అందుండి కొన్ని విషయములు సంగ్రహముగా వ్రాయుచున్నాను.

" తెలుగుదేశమందుకూడ తెలుగు భాషలో ఇట్టి గ్రంథము లున్నవి. బెజవాడకు దగ్గరగానున్న గంగూరు ఖండికలో పిళుపాటి రామకృష్ణశాస్త్రిగారింట 'భీమకవి జోస్య' మను గ్రంథముండెను. ఈ గంగూరు భీమకవి ప్రశ్నలు 1890 ప్రాంతములవరకు వాడుకలో నుండెను. ఇది కొందరికి జీవనాధారముగ నుండెను. దీని నాధారము చేసికొని లకోటా ప్రశ్నలు చెప్పు చుండిరి. ఈ ప్రశ్నగ్రంథ స్వరూపము కొంత సీసపద్యములు గను, కొంత తెంపులేవి పురాణధోరణి ననుసరించు వచనముగను పాటలుగాను ఉండును. లక్షణమంతగా పాటింపబడదు. ఇది

క్రమముగా శిథిలమైపోయినను ఒకరిద్దరింఢ్లలో 1917 నాటి వరకు కొంత నిలిచియున్నది. గ్రంథస్వాములు వానిని దాచిపెట్టి మర్మమును తెలుపకుండుటచేత, వాని నిజస్వరూపము బైటపడుట లేదు. ఇవి సంప్రదాయమెరుగనివారి పాలబడి ప్రచారము లేక క్రమముగా మాసిపోవుచున్నవి. ఇట్టి శాస్త్రపరిచితి క్షుద్రోపాసనాలబ్ధము. దురాచరణానృతవాద సమ్మిశ్రము. వంశ వృద్ధికి భంగకరము. ఈ విద్య నభ్యసించువారందరు తమకది అచ్చిరాలేదనే చెప్పుచుండిరి. ఇట్టి క్షుద్రోపాసనా విద్యలనేకములు తంత్ర సంబంధములు - కట్టుమోకు విద్యలు, చేతబళ్ళు మొదలగున విట్టివే. ఇవి అనుసరింపరానివి. ఇహపరములకు దూరములు."

దక్షిణామూర్తి శాస్త్రిగారు వ్రాసినదానిలో చాల యథార్థమున్నది. దండిభొట్ల రామమూర్తి శాస్త్రిగారు, చిర్రావూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తిరువళిక్కేణిలో నేనెరిగిన సుబ్రహ్మణ్యోపాసకులిద్దరును ఉపాసనా బలముచేతనే కొన్ని వేళలలో అద్భుతముగా చెప్పగలుగుచుండిరి. వీరి ఉపాసలు క్షుద్రములు కావు. నిష్ఠ నియమములలో కూడినవే. ఇట్టివానియందు కూడ అనేక రీతులున్నట్లు తోచును. చిర్రావూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ పంచపక్షి ఉపాసనగురించి చెప్పుచు వారికది అచ్చిరాలేదని వారి వంశము వృద్ధి కాలేదని అనిరి.

కాని జైమిని, పరాశరమునుల ప్రణీతములైన జ్యోతిశ్శాస్త్ర గ్రంథములు, నాడీగ్రంథములు అట్టివికావు. ఈ నాడుల గురించి బాగుగ తెలిసికొనవలెనని కొంత శ్రద్ధతో నేను ప్రయ

త్నించినాను. పూర్తిగా జీవితాంతమువరకు సరిగా దాఖలా నిచ్చునాడులకై వెదుక నారంభించితిని. నా మిత్రులు రాళ్ళబండి సుబ్బారావుగారివద్ద వారి జాతకమునకు చెందిన తాళపత్రము—ఒక నాడినుండి తీసికొనివచ్చినది - ఉన్నది. అది నాకు వారు చదివి వినిపించిరి. నేటివరకు అందులో చెప్పినరీతిని జరుగుచున్నది. మరియు ప్రెసిడెన్సీ కాలేజీలోని ఒక ప్రొఫెసరుగారొకనాడొక తాటాకును తీసికొని నావద్దకు కాలేజీలోనికివచ్చిరి. భూతద్దముతో అందు వ్రాసియున్న అరవపాటలు - ఒక నాడిగ్రంథమునుండి సేకరింపబడినవి—చదివిరి. వారి జీవితముగురించి అంతయు పూసగ్రుచ్చినట్లు అందు వ్రాయబడియున్నది. తలితండ్రుల పేర్లు, ఇంగ్లాండు వెళ్ళి పెద్దపరీక్షలు ఇచ్చివచ్చుట, ఉన్నతోద్యోగము, సోదరభావము మొదలగునవి కలవు. అప్పుడు నామిత్రునకు కలిగిన యాశ్చర్య మింతింతగాదు. అద్భుత ప్రతిభావంతులైన మనపూర్వులగురించి ఒక్కసారిగా ఆయనకు తెలియవచ్చినది. పెద్దల విద్యలగురించి ఏమియు తెలియనట్టి, తెలిసికొనుట కేమియులేదని ఉదాసీనత కలిగినట్టి ఇట్టి ప్రతిభాశాలులు, నాడీగ్రంథములు, ఉన్నవని నమ్మి వారియెడ చులకన భావము కలిగినట్టివారిలో ఒకరైన నామిత్రులు తనయభిప్రాయము లెట్లు తారుమారైనది నాతో స్పష్టముగా వెలిబుచ్చిరి.

నే నెరిగిన నాడు లన్నిటిలోను సర్వోత్తమ మైనది కాకాభుజండనాడి. ఇది కాకాభుజండమహర్షి వశిష్ఠునితో చెప్పుచున్నట్లు వ్రాయబడినది. మధ్య మధ్య వారిద్దరకు సంభాషణలు చర్చలు జరుగుచుండును. ఇది కుంభకోణములో నొకరివద్ద

ఉండెను. వారు కొంతకాలము క్రిందట కీర్తిశేషులైరి. ఈ నాడీ స్వరూపమును ప్రత్యక్షముగ తెలిసికొనుటకై నేను వారికడకు కుంభకోణము వెళ్ళియుంటిని. తాటాకు పత్రములమీద రెండువైపులను చీమలబారులవలె విషయము వ్రాయబడి యున్నది. అందుండినా జాతకపుపాటలు నాయెదుటనే ఒక మిత్రుడువ్రాసి నాకిచ్చెను. జాతక సంబంధములగు పాటలన్నియు ఈనాడినుండి ఒకేసారి లభ్యములుకావు. వాయిదాలమీద, అందుచెప్పినరీతిని, ఆపాటలు పంపబడుచుండును. ఒకపాటలో సీస పద్యములో వలె వాల్గు పాదములు, ప్రాసయుక్తములుండును. పాటలన్నియును ముక్త పదగ్రస్తములు. అందువర్తమాన విషయములతో కలిపి భవిష్యత్తులోని విషయములు చెప్పబడును. జాతకుని గురించియే కాక, లోకరీతి, పరిపాలనా విషయములు, యుద్ధములు, భావిలో మానవుడు పొందనున్న దివ్యానుభవములు కూడ ఉండును. ఇంగ్లీషుభాష వాడబడి యుండును. దానికి కవిభాషయని పేరు. ఇంగ్లీషువారికి 'వికటన్' అని, ఫ్రాన్సువారికి 'వ్రజ్జిలన్' అని జర్మనులకు 'వరలీన' అని, ఆస్ట్రియావారికి 'అక్షి' యని పేర్లు చెప్పబడినవి. 'వికటావతి' యను పేరుతో విక్టోరియా రాణి గురించి కలదు.

ఈనాడిలోని వివిధములగు కొన్నివిషయముల గురించి క్రింద వ్రాయుచున్నాను.

1. మద్రాసు గవర్నమెంటువారు 1931 సంవత్సరములో ఉద్యోగస్థుల జీతములను తగ్గించిరి, దానివలన వారు కలిగిన

చీకాకుసమయములో ఈనాడిని గురించి విని తెలిసి కొనగోరితిని. నేవచ్చినకారణము అందు చెప్పబడియున్నది.

2. మరియు, గోదావరికి దగ్గరగానున్న పెద్దాపురములో జన్మించెను. కవిభాషలో పదార్థ గుణశాస్త్రమును (Physics) చదువును, పదార్థగుణమూలమును తెలిసికొనును. ఇతను 'అప్పా'- " అప్పాఇవన్, కరుమైయల్లామ్ " - అన్నిటిలోను గట్టివాడు. ఇతనికి లింగధారులతో బాంధవ్య మున్నది అని, ఎన్నో విషయములు " సోదిశొల్రేన్ " సోది చెప్పుచున్నా నని వ్రాయబడి యున్నవి. జాతకచక్రమునుండి జ్యోతిశ్శాస్త్రరీత్యా ఈవిషయముల నెట్లు సకారణముగా నిరూపింప వచ్చునో అచ్చటచ్చట చెప్ప బడును. జాతకమునకు శాస్త్రరీత్యా ఫలముఎట్లు చెప్పవలెనో సాధారణులెట్లు తప్పులు చెప్పుచుందురో చూపబడినది. మరియు నేను చేయుచున్న ఉద్యోగమందలి తరగతుల, జీతములు, జీతముల వృద్ధిక్రమము, ఎచ్చటెచ్చట ఎప్పుడెట్టి ఉద్యోగములు చేయునది మొదలగు విషయము లన్నియును చెప్పబడియున్నవి.

3. " పరిపాలకుల ( ఇంగ్లీషువారి ) అవినీతిచేత, వారి సమాన స్కంధులలోని కలహములవలన పెద్ద యుద్ధము వచ్చును. తూర్పు పశ్చిమముల మధ్యగల పెద్ద రాజ్యములలో యుద్ధము వ్యాపించును. ఎల్లయిన్ పక్షమువారికి చాలకష్టములు వచ్చినను జయముకలుగును. " అని చెప్పబడియున్నది. ఎల్లయిన్ (Allies) అనుమాటను ఆల్ లైన్ (all lies) అని చమత్కరింప బడినది. ఇట్టి చమత్కారములు నాడిలో ఎన్నో ఉన్నవి. " యుద్ధ పరిణామముగా హిందుకు (India) స్వాతంత్ర్యము వచ్చును. "

అని చెప్పబడినది. " ఈ యుద్ధము గురించి కవిభాషను బట్టి చెప్పెదను. ఏడో అక్షరము (G) మొదలు పదునాలుగో అక్షరము (N) చివరగల వారున్నారు (German అని భావము) అందు N అక్షరమును త్రిప్పి (Z) ఆరెంటిమధ్య బి. సిలకు పూర్వమున్న అచ్చును (A) ఉంచు (NAZ అగును) ఆపేరు గలవారు చేయు దుష్టకార్యములు, అధర్మములు లెక్కలేని కష్టములను కలిగించును." అనికలదు. ఈపాటలు 7–2–32 న నాకు వచ్చినవి. ఆనాటికి నాజీలనువారున్నట్లే లోకమునకు తెలియదు.

ఈ పాటలు 1940 వరకు 613 వచ్చినవి. తరువాత పాటల నిచ్చుట నిలిపివేయ బడినది. ఇచ్చినపాటలలోని విశేషములు జరుగుచు వచ్చుచున్నవి.

4. కాకాభుజండ నాడిలో వ్యక్తుల జాతకములే గాక 'అరశర్ కాండ' మనుభాగములో మనదేశమును పాలించిన ఇంగ్లీషు రాజులగురించి కలదు. "వర్తకసంఘములోని వారు పాలించి, వికటావతికి ఇండియా రాజ్యపాలన మప్పగింతురు. అట్లప్పగించిన తరువాత 43 ఏండ్లు ధర్మపరిపాలనచేసి ఆమె గతించును. ఆమెకుమారుడు పదేండ్లు రాజ్యముచేయును. అతని పరిపాలనాంత కాలమందు పెద్దతోకచుక్క (Halley's Comet) వచ్చును. తరువాత అతని కుమారుడు రాజ్యము ప్రారంభించి భరతఖండమునకు వచ్చి పట్టాభిషిక్తుడగును. దీనితో ఇంగ్లీషు వారి రాజ్యపతనము ప్రారంభమగును" అని యున్నది. ఆకాలమందు జర్మనీదేశమెట్లు విజృంభించునో, ఆస్ట్రియా ప్రభుత్వకుమారుని సర్వియావారు హత్యచేయుటచే గలిగినయుద్ధములో 'వరలీనాదవ్'

జర్మనుచక్రవర్తియగు కైజరుయొక్క ప్రభను పడగొట్టుటకై ఇంగ్లాండు అతనికి ప్రతిపక్షముగా ఎట్లుచేరునో చెప్పబడినది. వరలీనాధుడు శత్రువులను — ఫ్రెంచివారిని (France) దూదినేకి నట్లు కొట్టి — పీడించునని చెప్పియున్నది.

మరియు, ఐదవజార్జి రాజ్యకాలములో 25 సంవత్సరములు నిండగానే వైభవముగా ఉత్సవము (రజతోత్సవము) చేయుదురని. "జడ్ అనముడింజు దయ్యా" - అనగా 26వ అక్షరమగు జడ్‌ను ఉచ్చరించినతోడనే, అనగా 26 వ రాజ్యసంవత్సరము రాగానే అతనిరాజ్యము ముగియునని కలదు 'కుమానే జార్జి. వి.* (Geogre V) ఎన్‌ఋవన్‌దాల్ పేరవినిన్ అధికారమ్ తవమేవాంగి పిరట్టువదాయ్ అరివీరేముత్రనాల్ " అనియున్నది. అనగా, భగవంతుడు George V నుండి అధికారమును తానేతీసికుని అనూరాధ నక్షత్రమునాడు అతని ఆయువునపహరించును. ఇంకను ఆనాటి గోచారమందలి గ్రహసంపుటి కూడా చెప్పబడినది. చంద్రునితోపాటు గురుడుకూడ వృశ్చిక లగ్నమందుండునని, పాపగ్రహములు ముందురాశులలో ఉండునని చెప్పియున్నది. ఆతేదీ 21-1-1936 నాడు పంచాంగములో గ్రహములట్లే యుండెను.

5. అరళరకాండ నుండి ఇంకొక్క విషయము నుదహరించెదను :-(i) పోర్‌బందర్‌లో జన్మించిన ఒకనిలో భగవంతుని

---

* [ఐదవజార్జియని మామూలుగా వ్రాయువానిలో ఐదు రోమను అంకెగా వ్రాయుట పరిపాటి. ఆ అంకె ఇంగ్లీషువర్ణమాలలో (V) వలె నుండును.]

కళయొకటి ప్రవేశించును. అతడు దేశమందలి వారినందరినికూర్చి ఏకాభిప్రాయులగునట్లు చేయగలుగును. స్వాతంత్ర్యాభిలాషను వారికి కలిగించును; స్వతంత్రభారతమునకై గొప్పఆందోళనమును అహింసా మార్గమున చేయును. అతనిపేరు మోహన్‌దాస్ కరంచంద్. గాంధియను ఇంటిపేరుకలవాడు. గాంధికారణముగా ఏర్పడిన అహింసామార్గము రానురాను ప్రపంచమంతటను విస్తరించి, పొగడ్త గాంచును. భారతదేశమునకు స్వాతంత్ర్యము లభింపగానే వచ్చినకార్యము ముగించుకొని అతడు గతించును.

(ii) సాతంత్ర్యము వచ్చినతరువాత హిందీ దేశభాష యగును, సందేహములేదు. తరువాత దేశమునకు గొప్ప అభ్యుదయము కలుగును. అందుపైని 'బృందిత' (?) భాష దేశభాష యగును. ఆభాషలో సర్వవిజ్ఞానము ప్రచారమగును. అంతవరకూ హిందీయే రాజభాషగా నుండును.

(iii) ఏటమ్‌ను చీల్చివిభజించుటచేత పరమాణువును ఇంక విభజించుటకు వీలులేనిస్థితి ఏర్పడును (? ?) — "కేవలమే ఆటమ్ ఎన్‌అల్ ఒన్‌త్రై పైత్తు. కీరిక్కిరిపిరిత్తిడవో పరమాణుక్కుమ్. చూఱుమురై ఇనిపిరిక్కముడియదేన్న



పై నుదహరించిన విషయములలో చిన్నవి, పెద్దవి, మహత్తరములైనవి కూడా గలవు. మరియు మానవుడు ఇంతకంటె గొప్పస్థితి పొందునని, ఆ పరిణామఫలము మహామహిమ కలదని. సూర్యాది గ్రహములయొక్క శక్తులకు లోనై జీవితమును నడుపుకొనుచున్న మానవుడు ఆ శక్తుల

నతిక్రమించి సర్వస్వతంత్రుడు కాగలడని, బైటనున్న ప్రకృతి శక్తులను వశపరచుకొని సంపాదించుచున్న శక్తి సామర్థ్యముల కంటె తనలోని శక్తులను జయించి తన్నుతాను తెలిసికొనినచో లభించు శక్తిస్వాతంత్ర్యములు నిరుపమానములని, సర్వసమర్థము లని, నిత్యములని, అట్టిస్థితిని, దివ్యానుభవములను, పొందుటకై పురోగమనము సాగుచున్నదని కాకాభుజండ మహర్షి నాడిలో పలుచోట్ల స్పష్టపరచియున్నాడు.

ఇట్టి గ్రంథములలోని విజ్ఞానము, సంస్కృతి నిరుప మానములు. శ్రేయోదాయకము లగు నిట్టి గ్రంథములు మూలపడి యుండుట, చింతింపదగిన విషయము. వీనిని బాగుగ పరిశీలించి వీనిఉపయోగా నుపయోగములను తెలిసికొనుట ప్రాజ్ఞత. అధిభౌతికమగు పాశ్చాత్యనాగరికత నేడు ప్రబలి యున్నది. దానివలన మానవజాతికి శాంతి భద్రతలు కలుగుట లేదు; అధ్యాత్మతత్వమూలకమగు భారతీయసంస్కృతి యొక్క టియే శాశ్వతశాంతి, అభ్యుదయములను ప్రసాదింపగలదు. ఆత్మ విద్యామూలములగు సత్యాహింసామార్గములను అనుసరించియేగదా గాంధీమహాత్ముడు ప్రపంచమున కాదర్శ మార్గమును చూపించి యున్నాడు. అట్టిమహత్తరమార్గమును ప్రపంచములోనివారందరు అవలంబింపవలెను. దానివలన శాశ్వతమగుశాంతి, నిరుపమాన మగు అభ్యుదయము లభింపగలవు.

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమండ్రి

# శోధిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 12 | సిద్ది | సిద్ధి |
| 11 | 22 | యేనిథ | యేవిధ |
| 12 | 14 | అక్కల్మష | అకల్మష |
| 13 | 4 | గాలివానె | గాలివానై |
| 14 | 22 | చేసికొనివగాని | చేసికొనినగాని |
| 16 | 12 | కావాలె | కావలె |
| 18 | 11 | గ్రంథము | గ్రంథము |
| 19 | 12 | అమార్పులు | ఆమార్పులు |
| 20 | 15 | ఆధ్యాత్మ | అధ్యాత్మ |
| ,, | 18 | స్వాతంత్ర | స్వాతంత్ర్య |
| ,, | 20 | చువ్నారు | చున్నారు |
| 23 | 15 | స్వార్ధ | స్వార్థ |
| 31 | 2 | బడినవి | బడినది |
| 32 | 21 | చగుణము | గుణము |
| ,, | 21 | నిర్ణయిం | నిర్ణయింప |
| ,, | 22 | నియర్ణ | నిర్ణయ |
| 33 | 1 | బడినవి. | బడినవి |
| 34 | 9 | లున్నదో | లున్నవో |
| 37 | 3 | అగుంవు | అగుంపు |
| ,, | Foot-note | దేహము | దేహము |
| 49 | 11 | అయినాంశ | అయనాంశ |
| 50 | 16 | సూచి | శుచి |
| ,, | 22 | పెటి | పెట్టి |
| 54 | 13 | ధనిపాది | ధనిష్ఠాది |
| 58 | 3,8 | అయిన | అయన |

| | | | |
|---|---|---|---|
| 59 | 8 | ఆరంభింతురు | ఆరభించును |
| ,, | 14 | ఉగాధి | ఉగాది |
| 60 | 7 | మార్గ శిర్షె | మార్గశీర్షె |
| ,, | 2 | మాసాద్య | మాసాబు |
| 65 | 14 | విరాజిల్లినవి. | విరాజిల్లినవి |
| 66 | 4 | సౌహార్ద్య్రము | సౌహార్దము |
| ,, | 17 | పానన్వత | సారస్వత |
| 71 | 18 | ఆది భౌతిక | అధి భౌతిక |
| 72 | 15 | ప్రవేవించి | ప్రవేశించి |
| 82 | 10 | నందలి | అందలి |
| 84 | 15 | ఇన్ప్రా | ఇన్ఫ్రా |
| 87 | 7 | గతార్థ | గతార్ధ |
| ,, | 18 | దుస్థితి | దుస్స్థితి |
| 92 | 12 | అద్భుత | అద్భుతపు |
| 93 | 12 | మహత్పార్థ | మహాపదార్థ |
| 94 | 8 | గలది | గలవి |
| 98 | 10 | చెప్పుచునట్లు | చెప్పుచున్నట్లు |
| 99 | 6 | Continuim | Continuum |
| 107 | 5 | విదితార్థన్ | విదితార్థ |
| 111 | 4 | నాయకునియడ | నాయకునియెడ |
| 112 | 3 | ప్రథాన | ప్రధాన |
| 114 | 1 | గ్రంధ | గ్రంథ |
| ,, | 20 | ప్రథాన | ప్రధాన |
| 120 | 9 | బ్రహ్మవేత్త, | బ్రహ్మవేత్త. |
| ,, | 12 | వాక్సుద్ధి | వాక్ఛుద్ధి |
| 121 | 10 | అథి | అధి |
| 122 | 2 | గుణనికాన | గుణవికాన |
| 126 | 9 | పృథివ్యాపో | పృథివ్యాఅపో |
| 131 | 13 | అధ్యాత్మ | అధ్యాత్మ |

| | | | |
|---|---|---|---|
| 134 | 7 | చాళుక్యులు | చాళుక్యుల |
| 139 | 18 | బ్రామ్మణ | బ్రాహ్మణ |
| 140 | 9 | నరశింహ | నరసింహ |
| 147 | 20 | ఉచ్ఛారణలో | ఉచ్చారణలో |
| 150 | 7 | గీతాభేద | గీతభేద |
| 152 | 12 | భాపములు | భావములు |
| 156 | 22 | వైయ్యా | వైయా |
| 157 | 7 | శతాబ్ద | శతాబ్ద |
| ,, | 9 | చతుర్దండే | చతుర్దండి |
| 159 | 15 | భూయిష్ట | భూయిష్ఠ |
| 160 | 16 | బారత | భారత |
| 163 | 4 | లములతో | పములతో |
| 165 | 14 | విశాలనేత్రి | విశాలనేత్ర |
| 168 | 11 | లంబినీం | లంబితాం |
| ,, | 12 | వడ్డమ | వడ్డుమ |
| 169 | 1 | అంతరార్ధ | అంతరార్థ |
| 170 | 17 | వైచిత్ర్యము. | వైచిత్ర్యము |
| 171 | 14 | స్తాలంభద్రకరీ | తాలోన్నిద్రకరో |
| ,, | 15 | న్వమస్తాః | నమస్తాత్ |
| 175 | 8 | సుసి | నుసి |
| 177 | 3 | పతి | పతిక |
| 178 | Foot-note | స్వానన | స్వావన |
| ,, | ,, | నాసి | నాపి |
| ,, | 7 | అచ్చు | క్రియా |
| ,, | 11 | అస్పష్టము | షష్టిదివేళ్యాః |
| ,, | 12 | ... | పరిపూర్తి |
| 185 | 11 | 3 | 13 |
| ,, | 20 | చున్నా | చున్నామ. |

